జనవరి 2006

వెల: రూ. 7/-

# చతుర




ఆదిరెడ్డి మావుళ్లు నవల **మాయమబ్బులు**




జలాంతర్భాగాన జలవిహంగ విన్యాసమిది. అచ్చంగా మనుషుల మాదిరిగానే తల కిందకి తోక పైకి పెట్టి డైవ్ చేసే ఈ అమెరికన్ పిట్ట భూమి ఉపరితలంమీద కాకుండా జలాంతర్భాగంలోనే ఆహారాన్ని సేకరించుకుంటుంది. బాతులవలె దీని కాళ్లు తెడ్ల మాదిరిగా ఉండకపోయినా రెక్కలు మాత్రం వాటర్ ప్రూఫ్. ప్రవాహ ఉధృతికి వ్యతిరేక దిశలో డైవ్ చేసే ఈ పిట్ట నీటిలో ఉన్నంతసేపు ముక్కుమూసుకుని ఊపిరి బిగబట్టి ఉంటుంది. కంటిమీద ఉండే పారదర్శక పొర కొట్టుకుంటూ నీటిలో ఉన్న వాటిని చూడడానికి అనువుగా పని చేస్తుంటుంది.

నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 | సంచిక : 12
జనవరి : 2006 | 336వ సంచిక

## ఈ నెల నవల



చదువుల వాకిట దారి తప్పి అత్యాశతో భవిష్యత్తును బీటలు వార్చుకున్న విద్యార్థి గాథను కమనీయంగా చిత్రించిన

## మాయ మబ్బులు

ఆదిరెడ్డి మావుళ్ల















ఇంకా హెల్త్ బిట్స్, ఫొటో వ్యాఖ్యలు

బొమ్మలు: పినిశెట్టి   కవర్ డిజైన్ : మహేష్




# రాయటానికేం కావాలి?

జ్ఞానం, ప్రతిభ, అవగాహన, ప్రేరణ. ఇలా ఎన్నెన్నైనా చెప్పుకోవచ్చు అయితే, అన్నింటి కన్నా ముఖ్యంగా కావలసింది 'ఓపిక' అన్నాడో పెద్ద మనిషి. తాదాత్మ్యతతో రాసిన క్షణాలున్నట్టే సహనానికి పరీక్ష పెట్టే సందర్భాలూ ఉంటాయి. ముఖ్యంగా నవలా రచనలో ఇది అనివార్యం. కొంత రాసి, చాలా రాసి, ఇక ఏం చెయ్యాలో పాలుపోక పక్కన పెట్టిన కథలు రచయితల దగ్గర కోకొల్లలు.

ఇలాంటప్పుడే కొన్ని సదా సత్సంశయాలు కనబడుతుంటాయి. ఏది ముఖ్యం? పాత్రా? ప్లాటా? (రెండూ ముఖ్యమే గానీ ప్రారంభించవలసిందెక్కడ? )

అయిడియా తట్టగానే రాయటానిక్కూర్చుంటాం. "మాంచి" ప్లాటు కావాలి. కుట్రలు, రంకులు, ఎత్తుకు పైఎత్తులూ ఆలోచిస్తాం. కాని ఇవన్నీ చేసేదెవరు? వ్యక్తులు. అంటే పాత్రలు. "పాత్ర లేకపోతే ప్లాటేమిటి నా మొహం" అన్నాడు అరిస్టాటిల్‌తో భేదించిన లాక్షణికుడు. 'పాత్ర' అంటే- అతడు పుట్టి పెరిగిన వాతావరణం, బంధుమిత్రులు, శారీరక, మానసిక స్థితి, సామాజిక అంశాలు-ఆర్థిక, రాజకీయ పరమైనవి కూడా తెలుసుకోవాలి. (హెడ్ లైన్సు చదివి నిజమని నమ్ము తాడా లేక "కట్టు కథకు, పెట్టుబడికి పుట్టిన విషపుత్రికలీ పత్రికలని తెలిసినవాడా). సహజంగా, పాత్రోచిత ప్రవర్తన, వాళ్ళు ఎదుర్కొనే సంఘటనలు, మనుషులు, తత్కాల ప్రతిక్రియలే కథ. (మన రచయితలందరూ చిన్న ఉద్యోగస్తులు, గుమాస్తాల గురించీ, చాలీచాలని జీతాల గురించీ, కుటుంబ సమస్యల గురించీ రాయటంలో స్పెషలైజేషన్ చేశారు. ఇతర భాషల, సాహిత్యాల విస్తృతి మనకు లేకపోవటానికో కారణం కావచ్చు)

కర్మ ఫలాన్ని అనుభవించక తప్పదనుకునే వాళ్ళు మాత్రమే మంచి కథకులు కాగలరు.

"ఇంత గొడవెందుకు? కథల్రాయించటం ముఖ్యం" లక్ష్యం అదే. ఇంటి కప్పు వేసి, దానికి ఆధారంగా గోడలు నిలబెడతామా? పునాదులతోనే కట్టడం ప్రారంభమవుతుంది. కిందినించి పైకి. పాత్రల బలంతో కథ పండుతుంది గాని, మంచి పాత్రలు లేకపోతే పాఠకుల మెప్పు పొందజాలదు.

"ప్రతి జీవీ వైరుధ్యాల సమ్మేళనం. ఒక దశ నుండి మరో దశకు పరిణామం చెందటం సహజం. కొత్త జీవకణాలు నిరంతరం పుడుతుంటాయి. మరణిస్తుంటాయి" ఈ వ్యాఖ్యానం పాత్రలకూ వర్తిస్తుంది గదా.

పాత్రల స్వభావ ఫలితమే డ్రామా.

సృజనా క్రమాన్ని ఒక రచయిత ఇలా వివరించాడు.

సాహిత్య కృషిలో నాకు తోడుగా ఉంటా

నని ఒక పరిచారిక వచ్చింది. ఆమె పేరు ఫాంటసీ. తరువాత తెలిసింది. ఆమె పైకి కనిపించినంత అమాయకురాలు కాదు. కోపిష్టి. చంచల స్వభావం. తనకు లభిస్తుం దనుకుంటే ఎవర్నైనా, ఏమైనా చెయ్యగలదు. అంతే కాదు. ఆమె ప్రవర్తన క్షణక్షణానికీ మారుతుంటుంది. మంత్రాలు, మాయలతో




ముగ్ధుల్ని చేస్తుంది. ఊహకందని చిలిపి పనులన్నీ చేసి, నోట్లో వేలు పెట్టుకుని కూర్చుంటుంది. "అబ్రకదబ్ర" అనకుండానే చిత్ర విచిత్రమైన, వస్తువుల్ని జంతువుల్ని సృష్టించగలదు. సృజనకు పర్యాయపదం ఫాంటసీ. ఎప్పుడు వస్తుందో, ఎంతసేపుం టుందో తెలియదు. కాని వచ్చినప్పుడు మాత్రం వింత వింత మనుషుల్ని వెంట తెస్తుంది. నా కథల నిండా వాళ్ళే. నిర్భా గ్యులు, పతితులు, నిత్య పోరాటంగా బతి కిన వాళ్లు. అదేమిటో, ఏమి చెయ్యాలన్నా వాళ్లకు చుక్కెదురే. ఒక్కటీ అనుకున్నట్టుగా జరగదు. ఆశోపహతులు. ఏ ఖైదీలూ అనుభవించని చిత్ర హింసలతో తమను తాము గాయపర్చుకుంటారు.

'పాత్ర' అనబడే జీవి ఎలా పుడు తుంది? ప్రతి స్త్రీకీ తల్లి కావాలని కోరిక ఉండటం సహజమే. కాని కోరిక ఉన్నంత మాత్రాన మాతృత్వం సిద్ధించదు. ఎవర్నో ప్రేమిస్తుంది. "ఏ క్షణాన నువ్వు గర్భం దాల్చావమ్మా" అంటే ఏం చెప్పగలదు? అదలా జరిగి పోతుందంతే. రచయిత నిత్యానుభవంలోని అసంఖ్యాకమైన స్పందనలు, సూక్ష్మక్రిముల్లాంటి, లిప్తమా త్రమైన ఊహలెన్నో ఇందులోని ఒక క్షణం, ఒక బిందువు ఫాంటసీ గర్భంలో 'పాత్ర'గా రూపు దాలుస్తుంది. మానవాకా రంలోనే ఉన్నా, ఈ జీవి మనం చూసే మనిషి మాత్రం కాదు. దేవదానవుల అంశంతో కాగితం మీద ఆవిర్భవించిన ఒక "అలౌకిక మూర్తి"

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

**చతుర సమీక్ష** | **జనవరి 'చతుర' నవల మాయమబ్బులు**

**సమీక్షకుని పేరు:** ______________________

**చిరునామా:** ______________________

______________________

______________________

స్టెంధాల్

# ది రెడ్ అండ్ ది బ్లాక్

కాలాతీతం

ఫ్రెంచ్ కథ

"ఆంటాయిన్ బెర్తె" విద్యార్థి. మతపరమైన విద్యనభ్యసిస్తున్నాడు. తీరికవేళల్లో ట్యూషన్లు కూడా చెప్పుకునేవాడు. ఆ క్రమంలో ఒక ఇంటి యజమాని భార్యతో, మరొక యజమాని కూతురితో ప్రేమ వ్యవహారాలు నడిపించాడు. ఈ రహస్య కలాపాలు బైటికి పొక్కటంతో అతణ్ణి మత విద్యకు అనర్హుడిగా ప్రకటించారు. ప్రేమ వ్యవహారం నడిపిన వివాహితే ఇందుక్కారణమని అనుమానించిన విద్యార్థి ఆమె మీద కాల్పులు జరిపాడు. కోర్టులో విచారణ జరిగింది. అతడికి మరణ శిక్ష విధించారు"

ఒకనాడు పేపర్లో వచ్చిన ఈ వార్తలో స్టెంధాల్ కు కథావస్తువు దొరికింది. రచయిత దృష్టిలో అది వయ్యక్తిక కారణాల వల్ల చేసిన నేరం కాదు. సామాజిక అసమానతల పట్ల యువకుడు చేసిన తిరుగుబాటుకు సంకేతం.

కథానాయకుడు జూలిమెన్ సోరెల్ తండ్రి కార్మికుడు. అయినప్పటికీ ఉన్నత వర్గ సంస్కారం అలవడుతుందతడికి. సహజంగానే ధనవంతులంటే ద్వేషం. అన్ని కాలాల్లోనూ పేదవాళ్ల కోరిక ఒక్కటే. వర్గ రహిత సమాజం.

జూలిమెన్ అందగాడు మేధావి. (హత్యలు చేసిన వాడిపట్ల కూడా పాఠకులకు సానుభూతి కలిగేటట్టు రాయటం స్టెంధాల్ ప్రతిభకు గీటురాయి.)

అతడు ట్యూషన్ చెప్పిన పిల్లల తల్లి మదాంది రెనాల్. ఫ్రెంచి సాహిత్యంలోని గొప్ప పాత్రల్లో ఒకటి. రెనాల్ చవకబారు మనిషి కాదు. సంయమనం ఉన్న స్త్రీ. వివాహేతర సంబంధాలు అవాంఛనీయమని




అంగీకరిస్తుంది. అయినప్పటికీ, అనివార్యంగా ఆమెకూ, జూలిమెన్‌కూ మధ్య ప్రేమ చిగురిస్తుంది. వ్యక్తుల ప్రవర్తనలోని ఈ మిస్టరీని, మార్మికతను పట్టుకోగలిగిన రచయిత అవగాహన ప్రశంసనీయం. జూలిమెన్ ప్రేమకు మరో ముఖ్య కారణం- ఆమె ధనిక వర్గానికి చెందినది కావటం. ఆధిపత్యం లేదా కనీసం సమానత సాధించటానికి ఇదీ ఒక పద్ధతి.

రెనాల్ రహస్యాన్ని దాచలేదు. నలుగురికీ తెలుస్తుంది. జూలిమెన్ మత పాఠశాలకు వెళ్లాలి. ప్రీస్టు కావాలి, కాని త్వరలోనే ప్రీస్టులు కూడా చాలా విలాసవంతంగా బతకగలరని గ్రహిస్తాడు. అతడి మిత్రులు, పరిచయస్తులందరూ ధనికులే.

ఒకనాడు మతిల్డా అనబడే యువతి తన ప్రేమ ప్రకటిస్తుంది. ధనికవర్గం పట్ల జూలిమెన్‌కున్న ద్వేషమే ఆమెకు నచ్చింది. అది ప్రణయమో లేక మరే ఆకర్షణో స్టెంధాల్ స్పష్టంగా చెప్పాడు. మొత్తంమీద జూలిమెన్‌కు ఒక లేఖ పంపిస్తుంది. అర్ధరాత్రికి అందరూ పడుకున్నప్పుడు నిచ్చెన ఎక్కి తన గదికి రావాలి. (నిచ్చెన ఎందుకో తెలియదు. మామూలుగా నడిచివెళ్లచ్చు కాని 'నాటకీయత' అంటే అదే గదా!) జూలిమెన్, దారి మధ్యన, ఒక ఊళ్లో ఆగి నిచ్చెన కొనుక్కుని మరీ వెళతాడు.

ప్రేమ ఫలితంగా మాతిల్డా గర్భం దాలుస్తుంది. జూలిమెన్‌ను పెళ్ళి చేసుకోవటానికి ఇష్టపడుతుంది. ఆమె తండ్రి కూడా అంగీకరిస్తాడు. కథ సుఖాంతమవుతుందనుకున్న దశలో జూలిమెన్ వింతగా ప్రవర్తిస్తాడు. తనెంత మంచివాడో తెలుసుకోవాలంటే రెనాల్ నుండి "కారెక్టర్ సర్టిఫికేట్" తెప్పించుకోవాలని సూచిస్తాడు. ఆమె అతడి మాజీ ప్రేమికురాలు. వయోభేదం ఎంత ఉన్నా జూలిమెన్ మరొక స్త్రీని పెళ్లిచేసుకోవటం ఆమెకు నచ్చదు. ఆస్తికోసమే అతడే కుట్రపన్నాడని మాతిల్డా తండ్రికి ఉత్తరం రాస్తుంది. నిజానికి జూలిమెన్ ఆమెకు అపకారమేమీ చేయలేదు. పిల్లలకు చక్కగా పాఠాలు చెప్పాడు. ఇంట్లో అందరూ అతణ్ణి ఇష్టపడ్డారు. "రహస్య" ప్రేమ కలాపంలో కూడా అతడికన్నా, తన ప్రేమేయమే ఎక్కువ. ప్రేమకు కారణముండదనుకుంటే ద్వేషానికీ అంతేమరి. రెనాల్ లేఖ చదివిన మాతిల్డా తండ్రిలో జూలిమెన్ పట్ల జుగుప్స పెరుగుతుంది. వివాహం జరగటానికి వీల్లేదంటాడు. రెనాల్ చేసిన అభియోగాలు నిరాధారమైనవని జూలిమెన్ నిరూపించగలడు. అది స్త్రీ సహజమైన అసూయ అని తెలుసు. ఆమెకు ముప్పై తనకు పందొమ్మిది. ఎవరు ఎవర్ని వలలో వేసుకున్నారో నిరూపించటం కష్టమేమి కాదు. మాతిల్డా తండ్రి నిజం గ్రహించలేనంత అమాయకుడూ కాదు. కాని నిప్పులేంది పొగరాదని తెలుసు.

జూలిమెన్ పెళ్లికి ప్రాధేయపడలేదు. తన




అమాయకత్వాన్ని రుజువు చేసుకోవటానికీ ప్రయత్నించలేదు. మాతిల్డా తండ్రి (ఎం. దిలామోర్) కూడా అతణ్ణి నిలదీసి ప్రశ్నించలేదు. పైగా సైన్యంలో మంచి ఉద్యోగమిప్పించాడు. కొంత ఆస్తి రాసిచ్చాడు. దాని

మీద సాలీనా ఆదాయం కూడా వస్తుంది. మాతిల్డా గర్భస్రావానికి ఇష్టపడలేదు. పెళ్ల యినా కాకపోయినా అతడితోనే బతుకుతానం టుంది.

పరిస్థితులు చక్కబడ్డట్టేగద. సరిగ్గా అప్పుడే జూలిమెన్ ఒక మూర్ఖమైన పనిచేస్తాడు. (అప్పటిదాకా అతడికి గొప్ప ఆత్మ సంయమ నముందని చెబుతాడు రచయిత) రెనాల్ రాసిన ఉత్తరం చదివి, పిస్టల్స్ తీసుకుని, ఆమెను హత్య చేయ్యటానికి ప్రయాణమవు తాడు.

రెనాల్ మరణించదు. గాయపడుతుంది. (జూలిమెన్ వింత ప్రవర్తనకు కారణమేమిటో ఎవరికీ అర్థం కాదు) మెలోడ్రామాతో కథను మలుపులు తిప్పాలనే ఆచారం ఆనాటి నవ లారచయితల్లో ప్రబలంగా . ఉండేది. ముఖ్యంగా కథాంతంలో ప్రధాన పాత్రల్లో కనీసం ఒకటైనా మరణించాలి. అనేక విష యాలలో సాంప్రదాయాన్ని దిక్కరించిన స్టెంధాల్ ఇక్కడ మాత్రం తత్కాలీన "పాపు లర్ టేస్ట్"కు అనుకూలంగా రాయాలనుకు న్నాడా? మనుషుల్లో జీవశక్తి నిబిడీకృతంగా ఉంటుందనీ, మనం చేసే కొన్ని పనుల ద్వారా మాత్రమే అది ప్రకటితమవుతుందనీ స్టెంధాల్ విశ్వాసం. కథానాయకుని జీవశక్తి యిలా బహిర్గతమైందా? ఏదిఏమైనా హింసా ప్రవృత్తి వ్యక్తి చేతనలో ఒక భాగం- ఎవరూ దానికతీతులు కారు. రెనాల్ ఉన్న ఊరు (లేరిమెర్స్) పారిస్‌కు రెండు వందల యాభై మైళ్లు. ఎంత వేగంగా వెళ్ళినా కనీసం రెండు రోజులు పడుతుంది. ఉత్తరం చదివాక వచ్చింది తక్షణ కోపమైతే అప్పటికి తగ్గిపో వాలి.

ఇలాంటి లోపాలున్నంత మాత్రాన నవల గొప్పదనమేమీ తగ్గదు. తిరుగుబాటుదారులం దర్నీ విజయం వరించదు. (బాల్జాక్ నవ లల్లో కథనాయకులు గెలుస్తారు) జూలిమె న్‌కు మరణం ధ్రువం. కథ ముఖ్యం. మంచి కథ రాయాలంటే వాస్తవాన్ని మార్చక తప్పద నుకుంటాం. కాని నిజజీవితం మనల్ని కొన్ని

## స్టెంధాల్ (మారీ హెన్రి బేల్)

ఆధునిక యూరోపియన్ నవలలో మానసిక విశ్లేషణ ప్రవేశపెట్టిన తొలి తరం రచయిత స్టెంధాల్. అసలు పేరు మారీ హెన్రి బేల్. (Marie Henri Beyle)- వాల్టర్ స్కాట్, బాల్జాక్, గెతె వంటి మహా రచయితలకు సమకాలికుడు ఇతడు. యాత్రా కథనాలూ, ఆత్మకథ, ఇతర రచనలూ అనేకం చేసినా, ఇప్పటికీ వాసి తగ్గనివి మాత్రం రెండు నవలలు- ది రెడ్ అండ్ ది బ్లాక్ (1830); ది చార్టర్ హౌజ్ ఆఫ్ పార్మా (1839)- తత్కాలీన సామాజిక సంక్లిష్టతలను ప్రతిభావంతంగా చిత్రించిన రచనలు. దోపిడీ, అధికార దాహం, ధనికుల విశృంఖల విలాస జీవితాల వికృతత్వం కళ్ళక్కట్టినట్టు చూపిస్తాయి.

స్టెంధాల్ జననం ఫ్రాన్స్‌లోని గ్రెనోబుల్ నగరంలో. తండ్రి లాయరు. బాగానే సంపా దించాడు. తల్లి పుట్టింటివాళ్ళు సంపన్నులు. కొడుకంటే ప్రాణం. తల్లి మరణం తర్వాత ఆమె చెల్లెలి పోషణలో పెరిగాడు స్టెంధాల్. పిల్లాడు పాడైపోతాడని ఆంక్షలెక్కువ పెట్టటం వల్ల తండ్రి- పినతల్లి పట్ల అసహ్యం పెంచుకున్నాడు. అలాంటి కుర్రాళ్లేం చేస్తారు? వద్దన్న పనిచేస్తారు. తండ్రి నిషేధించిన పుస్తకాలన్నీ రహస్యంగా చదివాడు స్టెంధాల్.

చాలామంది, పెరిగిన తర్వాత చిన్ననాటి లోటుపాట్లను మరచిపోతారు. స్టెంధాల్ మాత్రం అలా కాదు. 53వ ఏట కూడా జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూనే ఉన్నాడు. 1789లో ఫ్రెంచి విప్లవం వచ్చింది. స్టెంధాల్ విప్లవాన్నిష్టపడటానిక్కారణం రాజభక్తుడైన తండ్రి పట్ల ఉన్న వ్యతిరేకతే.

సార్లు ఎంతగా ప్రభావితం చేస్తుందంటే, కథ కృతకంగా కనిపించినా సరే, ఉన్నది ఉన్నట్లు రాస్తాం. అది కథకుని మెళ్లో గుదిబండ. స్టెంధాల్ దాన్ని వదిలించుకోలేకపోయాడు. (ఇది అతడి నిజాయితీకి చిహ్నం కాదా? ) ఆంటాయిన్ బెర్తె కథ యథాతథంగా రాశాడు.

జూలిమన్‌కు మరణ శిక్ష విధిస్తారు. గిల టిన్ కింద తల పెట్టాలి. చివరి క్షణాల్లో అతడి ఆలోచనలిలా ఉంటాయి.

"ఏది సత్యం? మతం సత్యాన్నే బోధి స్తుంది. కాని ఏ మతం? క్రీస్తులు బోధించే ఈ మతం మాత్రం కాదు. బైబిల్ దేవుడు నాకక్కర్లేదు. ప్రశ్నించేతనాన్ని నేర్పిన వోల్టేర్ దేవుడు కావాలి... మానవ సౌభ్రాతృత్వాన్ని ప్రచారం చేసే మతం కావాలి... అడవిలో వేటగాడు తుపాకీ పేలుస్తాడు. జంతువు నేల కూలుతుంది. పరిగెత్తుతున్న వేటగాడు చీమల పుట్టను కూలుస్తాడు. వందల, వేల చీమలు చెల్లాచెదురై నలుదిశలా పరుగిడ తాయి. అవి ఎంత గొప్ప తాత్వికులైనా విధి తమనెందుకలా వంచించిందో ఎప్పటికైనా అర్థం చేసుకోగలవా? ఆ రాక్షసపాదం ఎందుకు తన అందాల హర్మ్యాన్ని నిష్కార ణంగా కూల్చేయ్యాలి? జీవితం, మరణం అనూహ్యమైన సంఘటనలు. వీటికి ఎవరూ ఏ వివరణా ఇవ్వలేదు. మన శరీర నిర్మాణ పరిమితులతో ప్రకృతి రహస్యాలనర్థం చేసుకో వటం అసాధ్యం... ఉదయం జన్మించిన ఈగ సాయంత్రానికల్లా మరణిస్తుంది. రాత్రి అంటే ఏమిటో దానికెప్పుడూ తెలియదు గదా... నా జీవితం మూడు గంటల ఇరవైనిమిషాలకు ముగుస్తుందట... 'ఎరుపు' విప్లవానికీ, 'నలుపు' రియాక్షనరీ మతఛాందసతకూ ప్రతీ కలుగా రచయిత వాడాడని విమర్శకుల అభి ప్రాయం.

స్టెంధాల్ రచనలు, ముఖ్యంగా "చార్టర్ హౌజ్ ఆఫ్ పార్మా"లోని వాటర్లూ, యుద్ధ దృశ్యాలను, టాల్‌స్టాయ్ "యుద్ధము-గాలి" రాసేటప్పుడు ఉపయోగించుకున్నాడట. ✦

---

స్టెంధాల్‌కు సాహిత్యం కన్నా గణితమంటే ఇష్టం. అందులో చాలా కృషి చేశాడు. ఇరవ య్యేళ్లప్పుడు పారిస్‌కు వచ్చాక అతడి జీవితం మలుపు తిరిగింది. నాటకాలంటే ఆసక్తి. రాసి, ప్రదర్శించాలనే కోరిక కలిగింది. ఆ గ్లామరస్ జీవితానికి ఆకర్షింపబడని యువకులుండరు. ధనిక స్త్రీలతో సంబంధాలు పెట్టుకోవటానికి ప్రయత్నించాడు. (కాస్త ఎర్రగా, బుర్రగా ఉన్న యువకులకు ఆ రోజుల్లో అదో వృత్తి). కాని శరీరం సహకరించలేదు. మనిషి లావుగా, పొట్టిగా ఉంటాడు. పెద్ద తలకాయ, చిన్న నోరు. కత్తి పట్టుకుంటే కందిపోయే చేతులు. మొహమాటం. కొత్త వాళ్లతో మాట్లాడలేడు. సంపాదన కావాలంటే ఉద్యోగం తప్పనిసరి. సుమారు పదేళ్ళు సైన్యంలో పని చేశాడు. అందరు జీనియస్సుల్లాగే స్టెంధాల్ కూడా ఎక్సెం ట్రిక్. తనలోని అనేక పరస్పర విరుద్ధమైన లక్షణాలు బహుశా సృజనకు సహకరించి ఉంటాయి. ప్రతిభావంతుడు. కార్యశీలి. స్నేహానికి ప్రాణమిస్తాడు. ధైర్యవంతుడు.

అలాగే స్వార్థపరుడు. మనుషుల్ని నమ్మడు. ఈ లోపాలన్నీ తనలో ఉన్నాయని స్టెంధాల్ తన 'ఆత్మకథ'లో రాసుకోవటం వల్లే మనకు తెలిసింది. అంటే, అతడిలో అంత 'నిజాయితీ ఉంది. అనేక పుస్తకాలు రాసినప్పటికీ, అతడు రచనను వృత్తిగా తీసుకో లేదు. జీవిత కాలంలో అంత గుర్తింపు కూడా రాలేదు. 'లూసియెన్ లూవెన్" అనే నవల రాస్తున్నప్పుడు మార్చి నెలలో హఠాత్తుగా గుండెపోటుతో మరణించాడు. ఇద్దరు మిత్రుల కృషి ఫలితంగా, తరువాతి కాలంలో అతడి సమగ్ర రచనలు 18 సంపుటాలుగా ప్రచురితమైనాయి.

# మాయ మబ్బులు

ఆదిరెడ్డి మావుళ్లు



"ఎక్సలెంట్! మార్వలెస్!!
అద్భుతంగా పాడావు.
నువ్వు అభినవ ఘంటసాలవి "
అని మిత్రులు పొగుడుతుంటే
ఎనలేని ఆనందం కలిగిందతనికి.
సినిమాల్లో పాడే అవకాశం ఇప్పిస్తానని
ఓ మిత్రుడు ఒకరికి పరిచయం చేయటంతో
తను అమర గాయకుడంతటి వాడిని
కాబోతున్నానన్న

అహంకారమూ కొంత పెరిగింది. ఫలితంగా చదువును పక్కకు పెట్టి ఊహల పల్లకిలో ఊరేగసాగాడా యువకుడు. తన తల్లి రెక్కలు ముక్కలు చేసుకుని తనను కష్టపడి చదివిస్తోందన్న విషయం మరిచే పోయాడు... ఆ తర్వాత...?

నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ప్రవేశించిన యువకులు పెడదోవ పడితే జీవితం ఏ గమ్యానికి చేరుతుందో, ఎలాంటి కల్లోలాన్ని సృజిస్తుందో వివరించిన **ఆదిరెడ్డి మావుళ్ళు** నవల **మాయమబ్బులు** ఈ నెల చతుర సమర్పణ.

అతనికి నిండా మూడు పదులయినా ఉండవు!

ఆ వయసుకే అతని జీవితంలో ఎన్నో అనుభవాలు! ఆ అనుభవాలలో తీపిగురుతులు కంటే చేదు గుళికలే ఎక్కువ! ఎన్నో ఆకలి రోజులున్నాయి! ఇంకెన్నో నిద్ర పట్టని రాత్రులు! అర్థాకలితో అలమటించిన సందర్భాలు!

అతను తరచూ తనను తాను ప్రశ్నించు కుంటాడు.

తన బాధలకు బాధ్యులెవరు? తన ఈ దైన్య స్థితికి కారణం ఏమిటి? తను చేసిన తప్పేమిటి? పేదవాడిగా పుట్టడమా? ఎంత తరచి చూసుకున్నా ఎంతగా ప్రశ్నించుకున్నా అతనికి తట్టే జవాబు ఒక్కటే! డబ్బు! ఆ డబ్బే ఉంటే అందరిలాగే ఆనందపు అంచులకు చేరేవాడు! ఆటపాటలతో హాయిగా సరదాగా కాలం గడిపేవాడు!

అవును! నిజమే! డబ్బే తన ప్రధాన సమస్య! డబ్బుంటే డాబుసరిగా తిరగొచ్చు మోటార్ బైక్‌లు నడపొచ్చు ఇష్టమొచ్చిన చోటికి ఇట్టే చేరుకోవచ్చు జీవితాన్ని ఆనందమయం చేసుకోవచ్చు ఆహ్లాదభరితంగా చీకూ చింతా లేకుండా గడపొచ్చు కానీ ఏదీ? ఆ డబ్బేది? ఎక్కడుంది? ఎలా సంపాదించాలి? ఏం చేస్తే తన సమస్యలన్నీ తీరుతాయి? ఏ విధంగా తన జేబుల్నిండా డబ్బులు చేరతాయి?

అన్నీ అంతుబట్టని ప్రశ్నలు! జవాబు దొరకని ప్రశ్నలు!

జేబులో చేయి పెట్టి వెతికాడు. చేతికి రూపాయి బిళ్ళ తగిలింది. బయటికి తీసి ఆశ్చర్యంగా చూసుకున్నాడు.

రూపాయి బిళ్ళ ఎక్కడిది? జేబులోకి ఎలా వచ్చింది? ఆ రూపాయి తన దగ్గరుందన్న సంగతి అతనికే తెలియదు.

ఎప్పుడో జేబు మూలలో దాక్కున్న రూపాయి. ఆ రూపాయిని చూడగానే పోతున్న ప్రాణం తిరిగొచ్చినట్టు అనిపించింది అతనికి.

ముందు రూపాయితో కడుపు నింపుకోవాలి! ఒక్క రూపాయితో కడుపు నిండిపోతుందా?

తన ఆలోచన, ఆశ తనకే నవ్వు పుట్టించాయి. ఈ రోజుల్లో రూపాయికేమొస్తుంది?

ఎదురుగా రోడ్డుకావల కాకా హోటల్ కనిపించింది.

బొగ్గుల కుంపటిపై సలసల మరుగుతూ పొగలు కక్కుతున్న టీ డొక్కు. 'హమ్మయ్యా! ఈ పూటకిది చాలు!' అనుకున్నాడు తృప్తిగా.

అంతే! అతనింక ఆలస్యం చేయదల్చుకో లేదు. అర్జంటుగా రోడ్డు కావలనున్న కాకా హోటల్‌కి చేరాలి అనుకుంటూ వడివడిగా అడుగులు వేశాడు. టీతో ఆకలి చల్లార్చుకోవాలన్న తాపత్రయం అతన్ని ముందు వెనుకలు చూడనివ్వలేదు. రోడ్డుకి అటూ ఇటూ చూసుకోకుండా పరిగెత్తుతున్న అతడికి వేగంగా వస్తున్న కారు కూడా కన్పించలేదు. అతణ్ణి ఢీకొట్టకుండా చూడడానికి కారు నడుపుతున్న వ్యక్తి ప్రయత్నిస్తూ పక్కకి తప్పించబోయేలోగానే జరగాల్సింది జరిగిపోయింది.

* * *

నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

తలంతా దిమ్ముగా ఉంది. భరించలేనంత భారంగా ఫీలయ్యాడు. బాధగా అన్పించి కళ్ళు మూసుకున్నాడు. రెండు నిమిషాల తర్వాత మళ్లీ కళ్ళు తెరిచాడు. నెమ్మదిగా చూపు తిప్పుతూ పరిసరాల్ని పరికించాడు.

అది అతి ఖరీదయిన గది. ఆడంబరంగా, అందంగా ఉంది. తను పడుకున్న మంచం వంక చూశాడు. ఖరీదైన ఫోం బెడ్.

అతనికి అంతా అయోమయం...

ఆశ్చర్యం... అగమ్య గోచరం!

మళ్ళీ భారంగా అన్పించి తల తడుముకున్నాడు. చేతికి కట్టు తగిలింది. మళ్లీ కళ్ళు మూసుకున్నాడు.

ఇక్కడికెలా వచ్చేడు! ఎందుకొచ్చేడు?

ఎవరు తీసుకొచ్చేరు? ! తల నెప్పిగా అన్పిస్తున్నా మనసు తన పని తాను చేసుకుపోతోంది. అతి ప్రయత్నంమీద ఆలోచిస్తే చిన్న మెరుపులా తట్టింది.

టీ కోసం రోడ్డు దాటబోతుంటే ఓ కారు

## రచయిత పరిచయం

ఆదిరెడ్డి మావుళ్ళు పుట్టింది విశాఖ పట్నం జిల్లా చోడవరంలో. ఆర్.టి.సి. లో ఉద్యోగం. ఇద్దరు కుమార్తెలు. సంగీత, సాహిత్యాలపై మక్కువ.
చిరుప్రాయంలోనే నాటక రచనకు శ్రీకారం చుట్టి 'అన్నదమ్ముల' అనుబంధం అనే నాటిక రాశారు. కథలు, కవితలు, నవలలు, నాటికలు, వ్యాసాలు మొదలైనవి అన్ని ప్రక్రియలలో పలు రచనలు భారతి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, యువ, ఆంధ్రభూమి, ప్రియదత్త పత్రికలలో ప్రచురితమయ్యాయి. మొదటి నవల 'డ్యూటీ' పొట్టి శ్రీ రాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం పొందింది. రెండో నవల ఆంధ్రభూమి ఆటాపోటీలో ఎంపికయ్యింది. ఇది మూడో నవల. రేడియోలలో అయిదు నాటికలు ప్రసారమయ్యాయి. ఒక వీధి నాటకం గూడా రాశారు.

**ఆదిరెడ్డి మావుళ్ళు**
డోర్.నెం. 18-853, బాలాజీ నగర్,
చోడవరం, విశాఖ జిల్లా.

స్పీడుగా వచ్చి.. సడన్‌గా...

"ఏరా...! ఎలా ఉంది? " ఎవరో అతి చనువుగా అడగడంతో తల మెల్లిగా పక్కకి తిప్పి చూశాడు.

తన ఈడున్న మనిషి. టక్ చేసుకుని నీట్‌గా నిండుగా... చిరునవ్వు ముఖంతో తనని సమీపించి-

"ఇదిగో... ఇది తాగు!" అంటూ గ్లాస్ అందించాడు.

"తీస్కోరా...!" అతను చనువుగా అంటుంటే...

లేచి కూర్చుని, గ్లాస్ అందుకున్నాడు.

"తర్వాత తీరుబడిగా నన్ను చూద్దువు గాని ముందు కాఫీ తాగు"

అతను నేల చూపులతో కాఫీ తాగుతున్నాడు కానీ మనసు ఆలోచిస్తూ ఉంది. ఇంత చనువుగా మాట్లాడుతున్న ఈ వ్యక్తి ఎవరు? ఎక్కడో, ఎప్పుడో చూసినట్లుగానే అన్పిస్తోంది. గొంతు కూడ ఎప్పుడో విన్నట్లే అన్పిస్తోంది. అయినా అతడి ఆలోచనల్ని బ్రేక్ చేస్తూ... అన్నాడా వ్యక్తి.

"రాము!" తన పేరు అతనికెలా తెలిసింది?

అతని పేరు సురేష్! ఎక్కడో విన్నట్టు బాగా పరిచయం ఉన్నట్టు... రాము ఇంకా ఆలోచిస్తున్నాడు.

అయినా, ఎంతకీ గుర్తు రావడం లేదు.

ఖాళీ గ్లాసు టీపాయ్ మీదుంచి యథాలా పంగా గది నలుమూలలా చూశాడు. అప్పుడు అతని కంటబడింది ఓ ఫొటో.

ఆ ఫొటోలోని వ్యక్తిని నిశితంగా పరిశీలించి చూస్తున్నాడు రాము.

సురేష్... బక్కపలచని శరీరంతో అమాయకపు చూపులతో,

"నువ్వు... మీరు నా క్లాస్‌మేట్ సురేష్! అవునా!" సంభ్రమంగా అన్నాడు రాము.

"ఒక్క క్లాస్‌మేటే కాదు! హాస్టల్ మేట్‌ని కూడా!" చిరునవ్వులు చిందిస్తూ అన్నాడు సురేష్ వెంటనే ఆనందోత్సాహాలతో.

సురేష్ ముఖంలోకి మరింత పరిశీలనగా చూస్తూ- ఒకప్పటి సురేష్‌కీ ఇప్పటి సురేష్‌కీ ఎంత తేడా? అస్సలు గుర్తు పట్టడానికి వీలు లేనంత మార్పు. లావెక్కి, నిండుగా, నిగనిగలాడే శరీరం... ఉబ్బిన బుగ్గలు, ఖరీదయిన బట్టలు. టక్ చేసి నీట్‌గా కనిపిస్తున్న అతణ్ణి అలాగే చూస్తూ ఉండిపోయేడు రాము. అంతలోనే ముఖం తిప్పేసుకుని నేల చూపులు చూస్తూ తనలో తానే కుంచించుకుపోయేడు.

రాము అవస్థను అర్థం చేసుకున్న సురేష్ "లేరా రాము! లేచి స్నానం చెయ్యి. ఈలోగా నేను బయటికెళ్ళి బట్టలు తీసుకొస్తాను" అన్నాడు.

"బట్టలా! ఎవరికి? !" అదోలా చూశాడు రాము.

"ఫూల్! ఎవరికేమిటి? నీకే! చూడు నీ బట్టలెంతగా మాసి పోయి ఉన్నాయో! చిరిగి పోవడా నికి సిద్ధంగా ఉన్నాయి" సురేష్ జాలిగా చూస్తూ అన్నాడు.

"ఒద్దు! సురేష్"

"ఒరేయ్, అంత మొహమాటం వద్దురా నా దగ్గర"

"అబ్బే! అదేం కాదు" నసుగుతు న్నట్టుగా అన్నాడు రాము.

సురేష్ రెండు క్షణాలు ఆలో చించి "సరే! ముందు లేచి స్నానం చెయ్"

రాము మౌనంగా లేచి బాత్రూమ్ వైపు అడుగులేసి ఆగిపోయాడు.

తల భారంగా అన్పించి మళ్ళీ తల తడు ముకున్నాడు. 'బాగా దెబ్బ తగిలి ఉంటుంది. అందుకే ఇంత కట్టు కట్టారు. ఇంత నెప్పిగా అన్పిస్తోంది' అనుకున్నాడు. అతడి ఆలోచన గ్రహించినట్లుగా, "మరీ పెద్ద దెబ్బేం కాదులే. త్వరగానే తగ్గిపోతుంది. నెప్పి ఓర్చుకుని స్నానం చేసిరా" అన్నాడు సురేష్.

ప్యాంట్ ఇచ్చాడు. రాము వెళ్ళి పది నిమి షాల్లో స్నానం చేసొచ్చాడు. "ఇవిగో ఇవి వేసుకో" అంటూ ఇస్త్రీ చేసిన టీషర్ట్, ప్యాంట్ ఇచ్చాడు సురేష్.

రాము జంకుతూనే వాటినందుకుని తొడు క్కున్నాడు.

వీడు అస్సలు మారలేదు. ఎప్పటిలాగే అదే బిడియం. జంకూను అనుకున్నాడు సురేష్.

"అవునూ రాము! ఇంకా పాడుతు న్నావా? నీ పాట విని చాలా ఏళ్లయిం దిరా! ఆ మధ్య రాము అనే వర్ధమాన గాయకుణ్ణి సినిమాలో పాడే అవకాశం ఇస్తు న్నట్టు ఒక మ్యూజిక్ డైరెక్టర్ పేపర్లో ప్రక టిస్తే నువ్వే అనుకున్నాను. అన్నట్టు కథలు కూడా ఇంకా రాస్తు న్నావా? మనం





హాస్టల్‌లో ఉన్నప్పుడెప్పుడో నీ కథ ఏదో మేగజైన్‌లో చదివినట్టు గుర్తు!," సురేష్ గడగడా మాట్లాడేస్తుంటే రాము మౌనంగా చూస్తూ ఉండిపోయేడు. అతనికంతా గజిబిజిగా, వింతగా ఉంది!

"ఏంటలా చూస్తున్నావు? ఆ ఫొటోలో ఉన్నది నా మిసెస్... ఎలా ఉంది? ఆమె పక్కన నేను గుమ్మటంలా లడ్డూలా అసహ్యంగా ఉన్నాను కదూ!" అని నవ్వి "నీలవేణి పుట్టింట్లో పురుడు పోసుకోవడానికి వెళ్లింది. నిన్ను తన దగ్గరకు తీసుకెళ్తాను. నువ్వంటే తనకు చాలా అభిమానం. అద్భుతమైన నీ గొంతు గురించి ఎన్నోసార్లు చెప్పాను. ప్రస్తుతం పాడుతున్న కొత్త సినిమా గాయకులు నీ ముందు ఎందుకూ పనికి

> అన్నట్టు నువ్వు కథలు కూడా రాస్తావని తెలిసి నీలు ఎంత పొంగి పోయిందో! తను కూడా ఏదో రాస్తుందిలే! కానీ ఒక్కటీ అచ్చు కాలేదనుకో ఇంతవరకూ

రారు. ఆ సంగతి నీలూతో చాలా సార్లంటే 'అంత గొప్పగా పాడతాడా మీ ఫ్రెండ్. అయితే అతన్నొకసారి మనింటికి తీసుకురండి' అని ఒకటే పోరు. పోనీ నీచేత తన ముందు ఒక పాట పాడించి ఆనందపరచాలంటే నువ్వెక్కడున్నావో, ఏం చేస్తున్నావో... తెలియలేదు. అన్నట్టు నువ్వు కథలు కూడా రాస్తావని తెలిసి నీలు ఎంత పొంగిపోయిందో. తను కూడా ఏదో రాస్తుందిలే! కానీ ఒక్కటీ అచ్చు కాలేదనుకో ఇంతవరకూ. మొత్తానికి వెతకబోతున్న తీగ కాలికి తగిలినట్టు రోడ్డు మీద హఠాత్తుగా ప్రత్యక్షమయ్యేసరికి పట్టలేనంత ఆనందం కలిగిందనుకో" సురేష్ నాన్ స్టాప్‌గా ఉద్వేగంతో మాట్లాడేస్తుంటే రాము అదోలా ముఖం పెట్టి మహామౌనిలా వింటూ ఉండిపోయాడు. తననీ, తనలోని ప్రతిభల్నీ పొగుడుతుంటే రాముకి ఎంతమాత్రమూ సంతోషం అనిపించడం లేదు. పైగా అతనిలో ఏదో తెలియని అసహ్యం, అసంతృప్తి. అవే మాటలు ఒకప్పుడు రాముని ఎంతో ఉత్తేజపరిచేవి. గర్వం కలిగించేవి. అందరూ తనను ఆకాశానికెత్తి పొగిడేస్తుంటే తబ్బిబ్బు అయిపోయేవాడు. తన్మయంతో తనను తానే మరిచిపోయేవాడు.

ఇప్పుడు... ఉహు... ఆ మాటలు వింటుంటే భయం కలుగుతోంది.

మాట మారుస్తూ, "సురేష్ నన్ను ఢీకొంది నీ కారేనా? "అనడిగాడు.

సురేష్ నవ్వుతూ, "కాదు" అన్నాడు.

"నేను ఆపోజిట్ డైరెక్షన్‌లో వస్తున్నాను. నువ్వు రోడ్డు దాటుతుంటే అటు వైపునుంచి వచ్చే కారు నిన్ను ఢీకొట్టడం చూశాను. నేను నా కారు సైడ్‌కి ఆపి వచ్చి చూస్తే నువ్వు. షాక్‌తో, తలకు దెబ్బతో దాదాపు స్పృహ కోల్పోయిన స్థితిలో ఉన్న నిన్ను ముందు గుర్తు పట్టలేదు. తర్వాత గుర్తు పట్టాను. నిన్ను ఢీకొన్న కారతను, నేను కలిసి హాస్పిటల్‌కి తీసికెళ్ళాం. అక్కడ నీకు కట్టు కట్టించాం. నువ్వు నా ఫ్రెండ్‌వని చెప్పినా ఆ కారతను కాదు కూడదంటూ డాక్టర్ ఫీజు చెల్లించి, మందులు తీసుకుని ఇచ్చి ఒకటికి పదిసార్లు సారీ చెప్పి వెళ్లాడు. పాపం అతడి తప్పేం లేదు. నువ్వే ఎటూ చూసుకోకుండా రోడ్డు దాటబోయావు" చెప్పాడు సురేష్.

రాము గదిలో ఉన్న డ్రెస్సింగ్ టేబుల్ అద్దంలో చూసుకున్నాడు. తల చుట్టూరా బ్యాండేజ్. మోచేతికి పెద్ద ప్లాస్టర్ ఉన్నాయి. తల వెనక బ్యాండేజ్ ఎత్తుగా ఉన్నచోట కాస్త గట్టిగా తడుముకున్నాడు. నెప్పిగా అన్పించి కనుబొమలు అదోలా ముడుచుకుంటూ 'అబ్బా' అన్నాడు.

"నువ్వు లక్కీవి. తలకు మరీ బలంగా దెబ్బ తగలలేదు. వెనక భాగంలో బాగా చిట్లింది. ఆరు కుట్లు దాకా పడ్డాయి" చెప్పాడు సురేష్.

రాము అతడి వంక చూసి "చాలా థాంక్స్ సురేష్. నన్నొక్కడే అలాగే రోడ్డు మీద ఒది

లేయకుండా ఇంతగా పట్టించుకుని శ్రమ తీసుకున్నావు" అన్నాడు.

"ఒరేయ్ డైలాగులొద్దు కానీ, నువ్వు సాయంత్రం దాకా రెస్ట్ తీసుకో. నేను ఆఫీసుకు వెళ్ళి వస్తాను. కుక్ ఉంది. నీకేం కావాలో, ఇవ్వాలో ఆవిడకి చెప్పి వెళ్తాను. అదిగో ప్రిస్క్రిప్షన్, మందులు అక్కడున్నాయి. ప్రిస్క్రిప్షన్ చూసి వేసుకో, సరేనా"

సురేష్ మాటలకు అలాగే అన్నట్లు తలూపాడు రాము.

"ఒకె. మరి నేవస్తా" అని సురేష్ వెళ్ళిపోయాడు.

రాము ప్రిస్క్రిప్షన్ తీసి చూశాడు. దాని ప్రకారం మందులు వేసుకుని పడుకున్నాడు.

మధ్యాహ్నం వంట మనిషి బీరకాయ కూర, చారుతో అన్నం పెట్టింది. తినేసి మళ్లీ పడుకున్నాడు.

పూర్తి విశ్రాంతి తీసుకోవడంతో సాయంత్రానికి ఒళ్లు నొప్పులు, తల భారం చాలావరకు తగ్గాయి.

చీకటి పడుతుండగా సురేష్ వచ్చి గంటసేపు కబుర్లు చెబుతూ కూర్చున్నాడు. పాలిటెక్నిక్ కాలేజి, హాస్టల్ కబుర్లే ఎక్కువగా దొర్లాయి.

మరుసటి రోజూ అలాగే గడచిపోయింది. ఆ సాయంత్రానికి రాము మరింత తేరుకున్నాడు. ఆ గది, ఆ ఇల్లు, ఆ సౌఖ్యం సురేష్ కాన్సర్న్ రాముకి చాలా రిలీఫ్ నిచ్చాయి.

కాని అతడిలో ఏదో న్యూనతా భావం.

తను ఆ రోజుల్లో సురేష్‌తో ఎలా ప్రవర్తించాడు? అయినా సురేష్ అదేమీ పట్టించుకోకుండా ఎంత ఆప్యాయంగా చూస్తున్నాడు.

ఆ రోజుల్లో ఆప్యాయంగా ఉన్నవాళ్లు ఆ తర్వాత ఎంత చులకనగా... అవమానంగా...

రాము మనసులో బాధ సుడులు తిరిగింది. కళ్ళు మూసుకున్నాడు. మనసులోని బాధ కన్నీటి బొట్లుగా రాలింది.

ఈనాటి తన దుస్థితి... సురేష్ ఉచ్ఛస్థితి... అయినా అతడి ఔన్నత్యం... రాముని సిగ్గు పడేలా చేశాయి. ఆ సిగ్గుతో మరింతగా బాధ రేగింది.

సురేష్ సాయంత్రం వస్తూనే రామూను "ఇంట్లో కూర్చుంటే మరీ బోర్ కొడుతుంది. పద అలా బయటికెళ్లి వద్దాం" అన్నాడు.

రామూ వద్దంటున్నా బలవంతం చేసి తీసికెళ్లాడు. కారు డ్రైవ్ చేస్తూ గలగలా మాట్లాడేస్తున్నాడు సురేష్.

ఆ రోజుల్లో నెమ్మదిగా, మౌనిలా, పుస్తకాల పురుగులా ఉండే సురేష్‌లో ఇంత చలాకీతనం, ఇన్నిన్ని మాటలు ఉన్నాయా అని రాము ఆశ్చర్యపోతున్నాడు.

సురేష్ మళ్లీ రాము స్వరం గొప్పతనం, అతడి పాటలోని మాధుర్యం గురించి ఏవేవో పొగడ్తలు గుప్పిస్తున్నాడు.

అవన్నీ అన్యమనస్కంగానే వింటున్నాడు తప్ప రాము ఎక్కువగా మాట్లాడడం లేదు.

ఆ పొగడ్తలే తనకీగతి పట్టించాయని బాధగా అనుకున్నాడు. ఎలాంటి పొగడ్తలవి... ఎలాంటి కలలవి...

"రామూ! యూ ఆర్ రియల్లీ గ్రేట్. నీ వాయిస్ అద్భుతం"

"నీలోని కల్పనాశక్తి అమోఘం"

"అవున్రా! నువ్వు టూ ఇన్ వన్‌వి. నీలో ఇద్దరు గొప్ప కళాకారులున్నారు! నువ్వెప్పటికైనా సినీ ఫీల్డ్‌ని ఏలుతావు"

"నువ్వు గాయకుడిగా ఘంటసాలకే మాత్రమూ తీసిపోవు. రైటర్‌గా మరో శరత్ అనిపించుకుంటావు" ఒకప్పుడు సహవిద్యార్థులు తనతో తరచూ అన్న మాటలు - రాము మదిలో మెదిలాయి ఒక్కసారిగా.

అదిగో! ఆ మాటలే, ఆ పొగడ్తలే తనని తెలియని ఆనందంలో ముంచెత్తేవి. ఊహాలోకంలో విహరించేలా చేసేవి. తనను అంతులేని, అవధుల్లేని సంతోషపు తీరాలకు తీసుకుపోయేవి ఒకప్పుడు.

కానీ.. ఇప్పుడు? ! అవే మాటలు తల్చుకుంటే విరక్తిని పుట్టిస్తున్నాయి! వెగటుగా, చేదుగా అనిపిస్తున్నాయి!

ఒకనాటి తన సుందరస్వప్నం ఏమైపోయింది? పొగడ్తలన్నీ ఎందుకు కరిగి కన్నీ



తప్పెక్కడ ఎందుకు జరిగిందో మననం చేస్కుంటున్నాడు.

తనపై తనకు జాలి కలిగే ఈ దౌర్భాగ్యపు స్థితికి కారణాలు వెతికేందుకు లోతైన ఆలోచనలు రాములో.

సురేష్‌తో కారులో ఎక్కడెక్కడికో తిరుగుతూ ఉంటే రాము మనసు మాత్రం గతం గనిలో కూరుకుపోతోంది. జరిగినవన్నీ కళ్ళ ముందు కలలా ప్రత్యక్షమవుతుంటే నెమ్మదిగా కళ్ళుమూసుకున్నాడు.

## 2

"నారాయణమ్మా! నువ్వు చాలా అదృష్టవంతురాలివి. నీ కొడుకు ఫస్ట్‌క్లాసులో పాసయ్యేడు. అంతే కాదు స్కూల్‌కి ఫస్ట్ నీ కొడుకే" అంట్లు తోముతున్న నారాయణమ్మ సుందరయ్య మాస్టారు మాటలకి కళ్ళు విప్పార్చి సంభ్రమంగా చూసింది.

"నీ కష్టం ఫలించింది. నువ్వు నమ్ముకున్న నీ కొడుకు నీ కల తీర్చుతాడు" సుందరయ్య మళ్ళీ అన్నాడు, నారాయణమ్మ ఆనందం చూసి మరింత ఉత్సాహంగా.

"అయితే నా బిడ్డ కలకటేరవుతాడా? పేద్ద ఆఫీసరుద్దోగం సేత్తాడా? బాబూ" నారాయణమ్మ చేస్తున్న పని కొన్ని క్షణాలు ఆపి ఆశగా చూస్తూ అడిగింది.

టీని మిగిల్చాయి!

అది తన తప్పా?

తనను ఆకాశానికి ఎత్తిపడేసిన స్నేహితుల గారడి మాటల మహత్యమా?

తనను తాను అతిగా అంచనా వేసుకుని వాస్తవాన్ని మరిచి కలల్లో తేలిపోయిన ఫలితమా, యిప్పటి యీ దుస్థితికి కారణం! తన తోటివారంతా ఊహించని ఉచ్ఛస్థితిని చేరుకుని సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్నారు. ఆర్థికంగా అందుకోలేని శిఖరాగ్రాలకు చేరిపోయేరు. అందుకు రాము అసూయపడడం లేదు. ఆత్మపరిశీలనలో పడిపోయేడు.

సుందరయ్యా చిన్నగా నవ్వి అన్నాడు, "రామూ చదవాల్సింది ఇంకా చాలా వుంది. ఆ తర్వాత నువ్వన్నట్టే గొప్పవాడవుతాడు"

"ఇంకా సాలా సదవాలా? ఏం? ఇప్పుడ వడా!? "

"ఈ చదువు చాలదు. పెద్ద చదువులు చదివింతర్వాత"

"అలాగే మేస్టు బాబూ! ఆడ్నింకా సదివిత్తాను. నా రెక్కలు ముక్కలు సేస్కోనైనా ఇంకో నాలుగిళ్ళలో పన్జేత్తాను. ఆడికోసమే బతుకుతున్నా. ఆడింగా సదివి ఆఫీసరయితే కళ్ళారా సూడాలనుంది బాబూ! దరిజాగా కుర్చీలో కూకుని ఇంగిలీసు మాటలాడితే అందరూ ఆడికి దండమెడుతుంటే సూడాలని నా కోరిక" నారాయణమ్మ మాటలకు సుందరయ్య మాస్టారుకి ముచ్చటేసి సన్నగా నవ్వాడు.

"తప్పకుండా! రామూ వృద్ధిలో కొస్తాడు. ప్రయోజకుడవుతాడు. నాకా నమ్మకముంది. ఈ చేతులతో రాముకు అక్షరాభ్యాసం చేశాను. ఇప్పటిదాకా వాడు అన్ని పరీక్షల్లోనూ ఫస్ట్ వచ్చాడు. ఇప్పుడు ఏకంగా స్కూల్ కే ఫస్టు వచ్చాడు" సుందరయ్యా మాస్టారు ఆనందంతో మురిసిపోతున్నారు.

"కూల్ పస్టంతే ఏటి బాబు? " నారాయణమ్మ అంట్లు తోమడం పూర్తిచేసి చేతుల్ని చీరకొంగుతో తుడుచుకుంటూ సుందరయ్యా మాస్టారు దగ్గరకు వచ్చి ఆయన కాళ్ళ దగ్గర నేలపై కూర్చుంది.

"స్కూల్ ఫస్ట్ అంటే అందరికంటే ఎక్కువ మార్కులు రావడం! అలాంటి వారికి ప్రభుత్వం ఆర్థిక సహాయం కూడా చేస్తుంది. పూర్తిగా కాకపోయినా ఎంతో కొంత సహాయం లభిస్తుంది. హాస్టల్ వసతి కూడా కల్పిస్తుంది"

సుందరయ్యా మాస్టారు ఆ ఊరిలోనే ఉన్న హైస్కూల్ కి హెడ్ మాస్టారుగా పని చేసి రెండేళ్ళ క్రితమే రిటయిరయ్యారు. పిల్లలకు ప్రైవేట్లు చెబుతూ కాలక్షేపం చేస్తున్నారు. రాములాంటి మెరిట్ విద్యార్థులెందరో సుందరయ్యా దగ్గర చదువుకుని ఉన్నత స్థానాల్లో ఉన్నారు ప్రస్తుతం.

చదువులో రాముకి మొదట్నుంచీ ఉచితంగా తర్ఫీదిస్తున్నారు. రాము భవిష్యత్తుకి రాచబాటలు వేస్తూ తోడ్పడుతున్నారు. అందుకు కృతజ్ఞతగా నారాయణమ్మ ఆ యింటి పనంతా చేస్తోంది.

* * *

రాముకి పాలిటెక్నిక్ కాలేజిలో సీటొచ్చింది.

ఎంట్రన్స్ టెస్ట్ లో మంచి ర్యాంక్ రావడంతో ఏ బ్రాంచ్ ని ఎంచుకోవాలో అర్థం కాలేదు. దేనికి అప్లై చేసినా సీట్ గ్యారంటని రాముకి గట్టి నమ్మకం. అయితే బ్రాంచ్ విషయంలో చాలా లోతుగా ఆలోచించాల్సి వచ్చింది.

రాబోయే కాలాన్ని కంప్యూటర్ శాసిస్తుంది. ఇప్పటికే కంప్యూటర్ చాలా రంగాలలో అడుగుపెట్టి ఊహించని మార్పులు తెచ్చింది. ఇది కచ్చితంగా కంప్యూటర్ యుగం. కాబట్టి ఆ కోర్స్ లో చేరమని సుందరయ్యగారు సలహా యిచ్చారు. ముందు ఆ తర్వాత మళ్ళీ ఆలోచించి నిర్ణయం తీసుకోవలసివచ్చింది.

అందరూ అదే కోర్సులో జాయిన్ అయితే పోటీ ఎక్కువవుతుంది. పైగా ఈ ట్రెండ్ యిలాగే కొనసాగుతుందా అన్న సంశయం కలిగింది. అందుకే మళ్ళీ ఆలోచించి అడుగువెయ్యాల్సిన అవసరం ఏర్పడింది. సుందరయ్యగారు తనకు తెలిసిన వారిని అడిగి ఆఖరికి మెకానికల్ ఇంజనీరింగ్ లో జాయిన్ చేశారు రామూని.

రామూకి పుస్తక జ్ఞాన తప్ప వేరే విషయాలు అంతగా తెలియవు. ఎప్పుడూ ఇల్లూ, స్కూలు అంతే! అందువల్ల అన్నీ తనే స్వయంగా చూస్కోవలసి వచ్చింది సుందరయ్యగారికి.

మాస్టారు రాముని వైజాగ్ తీసుకెళ్ళి జాయిన్ చేశారు. అలాగే హాస్టల్ లోనూ చేర్చారు. అన్ని జాగ్రత్తలూ చెప్పి చెప్పి చివరిగా ఒక మాటన్నారు సుందరయ్యా మాస్టారు. "రామూ! మీ అమ్మ నీపై చాలా

ఆశలు పెట్టుకుని చదివిస్తోంది. నీ మీద నాకు నమ్మకముంది. జీవితంలో మొదటిసారిగా కొత్త లోకంలోకి అడుగు పెట్టావు. బుద్ధిగా చదువుకో. ప్రలోభాలకు తేలిగ్గా లొంగిపోయే వయసు నీది జాగ్రత్త!" మాస్టారు మాటలకు రాము అలాగే అన్నట్లు తలూపేడు!

సుందరయ్య మాస్టారు చెప్పినట్టు పుట్టి బుద్ధెరిగింతర్వాత వేరే ఊళ్ళో అడుగుపెట్టడం రాము జీవితంలో ఇదే మొదటిసారి. పదో తరగతి వరకూ సొంత ఊరులోనే గడిచిపోయింది. ఏనాడూ ఊరు పొలిమేరలు కూడా దాటలేదు అనేకంటే దాటే అవకాశంగాని అవసరంగాని రాలేదని చెప్పడం సబబుగా ఉంటుంది. అందుకు ప్రధానంగా మూలకారణం ఆర్థిక స్థోమత లేకపోవడం. అలాగని రాముకి అలాంటి కోరికలు, ఆశలు లేవని అనుకోకూడదు.

ఆ వయసులో అందరిలాగే సహజంగా కోర్కెలు కలిగేవి రాముకి. ఎక్కడెక్కడికో వెళ్ళాలని, ఏవేవో చూడాలని, ఏదేదో చేసెయ్యాలని తపన పడేవాడు. అన్నింటినీ బలవంతంగా అణచివేసుకోవలసి వచ్చేది. ఆర్థిక సమస్యల వల్ల ఊళ్ళో వున్న నాలుగు సినిమా థియేటర్లే రాముకి ప్రధాన వినోదాలు. అది కూడా నెలకో రెండు నెలలకో! అంతే! అంతకు మించి ఎక్కువగా సినిమాలు చూసే అదృష్టం దక్కేది కాదు.

ఒకసారి అనకాపల్లిలో సైన్స్ ఎగ్జిబిషన్ జరిగింది. అప్పుడు రాము ఏడో తరగతి చదువుతున్నాడు. క్లాసులోని విద్యార్థులందరూ వెళ్ళారు రాము తప్ప.

తల్లిని డబ్బులడిగేడు. ఎగ్జిబిషన్‌కి అందరితో కలిసి తను కూడా వెళ్తానని ఆశగా తల్లికి చెప్పేడు. కొడుకు చిన్న కోరికను కూడా తీర్చలేకపోయినందుకు నారాయణమ్మ చాలా బాధపడింది. చేతిలో చిల్లిగవ్వలేదు. అప్పటికి రెండు వారాలుగా ఆరోగ్యం బాగుండక పనికి కూడా వెళ్ళలేదు నారాయణమ్మ. పూట గడవడమే కష్టమైపోతున్నప్పుడు డబ్బులిచ్చి కొడుకు

## స్థానం నరసింహారావు



రంగస్థలం పై స్త్రీపాత్రల్లో జీవించి, రసహృదయులు, సరసహృదయుల జేజేలందుకున్న స్థానం నరసింహారావు కళాకారులందరికీ స్మరణీయుడు. సత్యభామ కావచ్చు.. గురజాడవారి మధురవాణి కావచ్చు. కాదంటే చిత్రాంగో.. చింతామణో! ఏ పాత్రయితేనేం? తరుణీపరమైన హొయలతో పాటు తళుకుబెళుకుల్ని.. కులుకుల్ని ప్రదర్శించి ప్రేక్షకుల్ని తన్మయంలో ముంచెత్తేవారు.. ఎంతటి నటాగ్రేసర చక్రవర్తో అంతటి చిలిపికట్టె అయిన 'స్థానం' చమత్కారాలు ఆరోజుల్లో అందరినీ కడుపుచెక్కలయ్యేలా నవ్వించేవి.. వాటిలో కొన్ని..

**మా అమ్మాయి పెళ్ళికి రండి!**

'స్థానం' ఓ పల్లెటూళ్ళో నాటకప్రదర్శన కోసం వెళ్ళారు. అప్పుడు గ్రామాల్లో ఇప్పట్లా ఫ్యానులు లేవుగా.. మేకప్ వేసుకున్నాక గదిలో ఉక్కపోస్తోందని బయటకొచ్చి గడపమీద కూర్చుని విసనకర్రతో విసురుకుంటున్నారాయన. అంతలో పెళ్ళిపిలుపుకు ఆ ఇంటికి వచ్చిన పేరంటాళ్ళు కొందరు ఆయనను చూసి అమ్మాయే అనుకుని బొట్టుపెట్టి పెళ్ళికి రమ్మని ఆహ్వానించి మరీ పోయారట. ఈ విషయం మిత్రులకు తరచూ చెప్పి ముసిముసినవ్వులు నవ్వేవారు 'స్థానం'.

కోరికనెలా తీర్చగలదు?

అలా ఆనాడు అనకాపల్లికి కూడా వెళ్ళే అదృష్టం కలగలేదు రాముకి. అలాంటిది పుడు విశాఖ మహానగరంలోకి వచ్చేడు రాము. అందుక్కారణమైన సుందరయ్య మాస్టారుకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. మొదట నారాయణమ్మ కొడుకుని ఆర్థిక సమస్యల కారణంగా చదివించలేనంది. ఉన్న ఊర్లో కాబట్టి ఎలాగో అవస్థ పడి పదో తరగతి దాకా చదివించింది. కానీ పట్నంలో చదివించడం అంటే మాటలా. వేలకు వేలు ఖర్చు చెయ్యాలి. అది తనవల్ల జరిగే పనికాదని అంతటి ఆర్థిక స్థోమత తనకు లేదని నారాయణమ్మ చెప్పేసింది మాస్టారుతో. తన ఆశల్నీ, కలల్నీ బలవంతంగా చెరిపేసుకుంటూ మొదట్లో ఉన్న ఉత్సాహం ఆ తర్వాత నెమ్మదిగా సన్నగిల్లింది, తల్లి మాటలతో రాముకి.

"వృద్ధిలో కొచ్చే కుర్రాడు అలా అనకు నారాయణమ్మా! నువ్వు భయపడేటంతగా డబ్బు ఖర్చు కాదు. ప్రభుత్వం మీలాంటి వారికోసం ఎన్నో పథకాలు పెట్టి సహకరిస్తోంది. నువ్వు చెయ్యాల్సిందల్లా కొద్దిపాటి ఖర్చే" అన్నాడు సుందరయ్య మాస్టారు ధైర్యం చెబుతున్నట్టుగా.

సుందరయ్య మాస్టారుకి ముగ్గురు కూతుళ్ళు.



కొడుకులులేరు. చిన్న కమ్మల పాకలాంటి సొంత ఇల్లు తప్ప యితర ఆస్తిపాస్తులు లేవు. సర్వీసులో ఉన్నప్పుడు జీతం ద్వారా వచ్చిన దాంట్లో మూడొంతులు ముగ్గురు కూతుళ్ళ చదువులు, పెళ్ళిళ్ళకే వెచ్చించాల్సి వచ్చింది. కన్నబిడ్డల సుఖం కోసం అధిక మొత్తంలో కట్నకానుకలిచ్చి మంచి సంబంధాలే కుదిర్చాడు. అల్లుళ్ళు ముగ్గురూ ఉద్యోగస్తులే. ఉన్నదంతా ఊడ్చుకుపోయినా కూతుళ్ళ గురించి ఇంక ఆలోచించే అవసరం లేదు ఆయనకి.

ఇప్పుడొస్తున్న పెన్షన్ డబ్బులు భార్య జబ్బుకే చాలడం లేదు. అందుచేత నారాయణమ్మకు సుందరయ్య మాస్టారు సలహాలు తప్ప ఆర్థిక సహాయం చేయలేరు. అయితే ఒక మెరిట్ విద్యార్థి చదువు అర్థాంతరంగా ఆగిపోవడం ఇష్టం లేక నారాయణమ్మను పట్టుపట్టి ఒప్పించేరు. ఆఖరికి ఎలాగో నారాయణమ్మ సరే అంది. అప్పు చేసైనా కొడుకును చదివించాలని స్థిరనిశ్చయానికొచ్చింది.

* * *

అంతా కొత్త ప్రాంతం. కొత్త వాతావరణం. కొత్త ముఖాలు. రాముకి చాలా ఇబ్బందిగా వుంది హాస్టల్ వాతావరణం. ఊరుకి దూరంగా అడవిలాంటి ప్రదేశంలో ఉన్నాయి హాస్టల్ భవనాలు. ఆ భవనాలకు పేర్లు



కూడా ఉన్నాయి. నలంద, నాగార్జున హాస్టల్ వెనుక ఏవేవో చెట్లు గుబురు గుబురుగా పెరిగి ఉన్నాయి. చిన్నపాటి అడవిని తలపిస్తున్నాయి ఆ చెట్లు. వాటి వెనుకగా చాలా పెద్దకొండ.

కిటికీలో నుంచి చూస్తే సిటీలో ఉన్నట్టు లేదు. సొంత ఊరులో ఉన్న భ్రాంతి కలుగుతోంది రాముకి. అందుకే ఎక్కువగా అటే చూస్తూ తృప్తి పొందుతున్నాడు. బయటికొస్తే తోటి హాస్టలర్స్‌లో ఏదో తెలియని గుబులు - ఒంటరితనం.

వాస్తవానికి సొంత ఊరులో కూడా రాముకి స్నేహితులు లేరనే చెప్పాలి- ఒకరిద్దరు తప్ప. ఆ ఇద్దరూ కూడా కేవలం చదువుకి సంబంధించిన స్నేహితులే. ఏమైనా డౌట్స్ వస్తే అడిగి తెలుసుకునేవారు. అంతే అంతకు మించి వేరే విషయాలు ఉండేవి కావు. సినిమాల్లాంటి విషయాలు ప్రస్తావనకొచ్చినపుడు రాము శ్రోతగా మిగిలిపోయేవాడు వాళ్ళ దగ్గర. ఆటలు కూడా తక్కువే. అయితే రాము చాలా బాగా పాడగలడు. కానీ ఆ విషయం క్లాసులోని వాళ్ళకు కూడా తెలియదు.

రాముకి బిడియం ఎక్కువ. నలుగురిలోకి వెళ్ళడమే తక్కువ. ఇక వాళ్ళ ముందెలా పాడగలడు? పాడాలని ఉన్నా ఎవరైనా విమర్శిస్తారని భయంతో నోరు విప్పేవాడు కాదు. ఒంటరిగా ఉన్నప్పుడు ఎంచక్కా హాయిగా పాడుకునేవాడు.

స్కూల్ ఫైనల్ చదువుతుండగా స్కూల్ డే నాడు అందరికీ తెలిసింది రాము గొంతులోని మాధుర్యం సంగతి.

వార్షికోత్సవం సందర్భంగా పాటల పోటీ నిర్వహించినపుడు మొదట పేరు ఇవ్వడానికి జంకేడు. ఆ తర్వాత అందరూ పాడడం చూశాక తనూ పాడడానికి ముందుకొచ్చాడు రాము. ముందుగా పేరివ్వని కారణంగా మొదట నిరాకరించడం జరిగింది. ఆఖరికి ఎలాగో ప్రాధేయపడి పోటీలో పాడే అవకాశం దక్కించుకున్నాడు రాము.

అతడికే ప్రథమ బహుమతి వచ్చింది.

అంతకు ముందు వ్యాస రచనలో ద్వితీయ బహుమతి వచ్చింది. ఎప్పుడూ చదువు తప్ప అన్య విషయాలు తెలియని రాములో నటుడు కూడా ఉన్నాడని అప్పుడే అందరికీ తెలిసింది. ఒక నాటికలో ఓ చిన్న పాత్ర వేశాడు రాము. అవన్నీ గొప్ప అనుభూతులుగా మిగిలాయి రాము మదిలో.

టెన్త్ పరీక్షలకు ముందు రోజులు చాలా ఆనందంగా గడిచాయి. ఆట పాటల్లో పాల్గొనడం... నాటిక రిహార్సల్స్, స్టేజెక్కి బహుమతులందుకోవడం మరిచిపోలేని అనుభవాలు. హాస్టల్లో ఒంటరిగా గడపాల్సి వస్తోందిప్పుడు రాముకి. చాలా రోజులు అలాగే గడిచిపోయాయి. చుట్టూ తోటి విద్యార్థులున్నా ఒంటరితనం అనుభవించక తప్పలేదు. తను కూడా చొరవ చూపలేక పోతున్నాడు బిడియం, జంకు వల్ల.

అదృష్టమో దురదృష్టమో గాని అన్ని గదుల్లోనూ ఇద్దరేసి స్టూడెంట్స్ ఉంటే రాము ఒక్కడు ఒక గదిలో ఉండాల్సి వస్తోంది. అది ఒకందుకు ఆనందంగానూ మరొకందుకు బాధగానూ అనిపిస్తోంది. అన్నిటినీ మించి రాముని ఇబ్బంది పెడుతున్న పెద్ద సమస్య ఇంగ్లీషు మీడియం. పదోతరగతి వరకూ తెలుగు మీడియం చదివి యిప్పుడు ఇంగ్లీషులో చదవడమంటే చాలా ఇబ్బందిగా వుంటోంది రాముకి. అలాగని రాము ఇంగ్లీషు భాషలో పూర్ కాదు. టెంత్‌లో డెబ్బై అయిదు శాతం మార్కులొచ్చాయి. ఇంగ్లీషులో ఎస్సే రైటింగులో ఫస్టొచ్చాడు ఒకసారి. ఇందులో రాము గొప్పగా ఫీలయ్యే సందర్భం ఒకటుంది.

రమణ అనే విద్యార్థి తరచూ అన్ని పరీక్షల్లోనూ అందరికంటే ముందుండేవాడు. ఎక్కువ శాతం మార్కులొచ్చేవి రమణకి. రాము అతణ్ణి మించాలనే చదివేవాడు. ఎంత ప్రయత్నించినా రమణని మించలేకపోయేవాడు. ఒకటి రెండు మార్కుల తేడాతో రెండవ స్థానం వచ్చేది. ఎస్సే రైటింగ్‌లో మాత్రం రాము విజయం సాధించాడు. 'స్టూడెంట్స్ అన్‌రెస్ట్' అనే అంశంపై రాము రాసిన వ్యాసం ప్రథమ బహుమతి పొందితే రమణకి ద్వితీయ బహుమతి లభించింది. స్కూల్ ఫస్ట్ వచ్చినప్పుడు కూడా రాముకి అంత ఆనందం కలగలేదు. కారణం క్లాసు పుస్తకాలు చదివి ఫైనల్ పరీక్షల్లో ఫస్టొస్తే ఇంగ్లీష్ ఎస్సే రైటింగ్‌లో సొంత ఆలోచనలతో క్రియేటివిటీతో ముందున్నాడు. అందుకే ఆ విషయంలో ఎప్పటికీ గర్వంగా ఫీలవుతాడు రాము.

హాస్టల్లో చేరిన ఆరువారాల వరకూ స్కూలు జీవితంలోని అలాంటి తీపి జ్ఞాపకాలను మననం చేసుకుంటూ ఒంటరిగానే గడిపేవాడు రాము.

ఆ తర్వాతే అసలు కథ మొదలయ్యింది.

## 3



"హలో"

హాస్టల్ నుంచి కాలేజీకి నడుస్తున్న రాము ఎవరో పిలిచిన పిలుపు వినిపించినా వెనక్కి తిరిగి చూడలేదు. ఆ పిలుపు తన కంటే కాస్త ముందున్న స్టూడెంట్స్‌ని ఉద్దేశించిందేమోనని రాము కనీసం ఆగే ప్రయత్నం కూడా చేయలేదు.

"రాముగారూ మిమ్మల్నే" ఆ గొంతు బాగా తెలిసినట్టనిపించింది. పైగా పేరు పెట్టి పిలవడంతో ఆ పిలుపు తనకోసమే అని స్పష్టమైంది. వెంటనే ఆగి వెనక్కి చూసేడు. తన రూమ్ పక్కనుంటున్న వాళ్ళు, రాధాకృష్ణ, నాయుడు. ఇద్దరూ పరుగులాంటి నడకతో రాముని చేరారు.

పక్కరూమ్ వాళ్ళు అయినప్పటికీ పెద్దగా పరిచయాలు లేవు. తరచూ పేర్లు పెట్టి పిలు

చుకోవడం వల్ల పేర్లు మాత్రం తెలుసు. ముఖపరిచయం ఉన్నా మొహమాటం వల్ల ఎప్పుడూ వాళ్ళతో మాట్లాడలేదు. పైగా వాళ్ళు రాముకి సీనియర్స్.

"రామూ గారూ థాంక్స్" రాధాకృష్ణ చేయి చాచాడు షేక్‌హాండ్ కోసం.

రాము వెంటనే ప్రతిస్పందించలేకపోయేడు బిడియం వల్ల.

"కళాకారులకు అంత బిడియం ఉండకూడదు" అని నవ్వి బలవంతంగా రాము చేయిని అందుకున్నాడు రాధాకృష్ణ. ఆ వెంటనే నాయుడు కూడా షేక్ హ్యాండిచ్చేడు.

"ఏంటిలా వింతగా చూస్తున్నారు? మీ పక్కరూమ్‌లో ఉంటున్నాం. తెలియదా...?!

తెలుసునన్నట్టు సన్నటి నవ్వుతో తలాడించాడు రాము.

"థే... థేంక్స్ దేనికి? " రాము నోటి నుంచి ఆ మాటలు చాలా ప్రయత్నంతో వెలువడ్డాయి. అందుకే తడబడ్డాడు.

"రాత్రి నిద్రరాక అవస్థపడుతున్న మమ్మల్ని హాయిగా నిద్ర పోయేట్టు చేసినందుకు తరచూ మీరు పాడుతున్న పాటల్ని విని ఎంతో థ్రిల్ ఫీలవుతున్నాం. మీరు పాడితే మమ్మల్ని మేమే మరిచిపోతుంటాం. మీ గొంతులో అంత మాధుర్యం ఉంది. అసలు ఎవరో పాడుతున్నట్టు అనిపించదు. రేడియోలోనో, టేప్‌రికార్డర్‌లోనో వస్తున్న పాటలా ఉంటుంది. రాత్రి మాత్రం మీరు విశ్వరూపం చూపించేరు. ఏకంగా రెండు గంటలకు పైగా పాడిన పాటలు మమ్మల్ని పరవశుల్ని చేశాయి. రాత్రే మిమ్మల్ని కలవాలనుకున్నాం. కానీ ఏదో మత్తు మమ్మల్ని కమ్మేసి కదలనీయకుండా చేసేసింది. మీ పాటల్ని వింటూనే నిద్రలోకి జారుకున్నాం" రాధాకృష్ణ గడగడ మాట్లాడుతూ నాయుడు ముఖంలోకి చూసేడు.

నాయుడు 'అవున్నిజమే' అన్నట్టుగా నవ్వేడు.

చాలా రోజులుగా వాళ్లని రాము కూడా గమనిస్తున్నాడు. రాధాకృష్ణకి మాట లెక్కువ. ఎక్కువగా ఏదో ఒకటి మాట్లాడుతూనే వుంటాడు. మాటమాటకి నవ్వు తప్పనిసరి. నాయుడు తక్కువగా మాట్లాడినా రాములా బిడియస్తుడు కాడు. కలుపుగోలుగా కనిపిస్తాడు. ఎవరితోనైనా ఇట్టే కలిసిపోతాడు.

మొదటిసారిగా వాళ్లిద్దరూ తనతో ఆప్యాయంగా మాట్లాడటం రాముకి చాలా ఆనందంగా అనిపించింది. హాస్టల్లో అంతమంది ఉన్నా రాము ఎప్పుడూ ఏకాకిగా ఉండడం అలవాటుగా చేసుకున్నాడు. ఆ మాటకొస్తే రాము నైజమే అంత. మొదట్నుంచీ ఒంటరిగా గడపడం అనే అలవాటు హాస్టల్లో బాగా ఉపయోగపడుతున్నా ఒక్కోసారి ఎందుకో ఏదో తెలియని అసంతృప్తి అతణ్ణి వేధిస్తోంది. అలాంటప్పుడే తన గొంతుని సవరించుకుంటాడు. పాటలతో ఒంటరితనాన్ని ఇట్టే మరిచిపోతాడు.

"రాత్రి నాక్కూడా ఎందుకో నిద్రపట్టలేదు. పాటలతో కాలక్షేపం చేశాను" అన్నాడు రాము వాళ్లతో.

"అలాగా! అయితే ప్రతి రాత్రి మీకు నిద్ర రాకపోతే ఎంత బాగుంటుంది. హాయిగా మీ పాటలు రోజూ వినే భాగ్యం మాకు కలుగుతుంది" అని రాధాకృష్ణ ఫకాలున నవ్వాడు. అతని నవ్వులకి నాయుడు కూడా గొంతు కలిపేడు.

ముగ్గురూ మాట్లాడుకుంటూ కాలేజి వైపు నడిచారు.

మీదేవూరు? ఏ బ్రాంచి లాంటి మాటల నుంచి చాలా విషయాలు దొర్లాయి వారి మధ్య. రాముకి ఏదో తెలియని ఆనందం. పట్టలేని సంతోషం ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నాయి. అంతవరకూ అనుభవించిన ఒంటరితనం ఇట్టే మంత్రించినట్టు మాయమైపోయింది ఆ క్షణంలో.

"రామూగారూ..." అని రాధాకృష్ణ ఏదో అనబోతుంటే కలుగజేసుకుని అలా గారూ అని పిలిచి నన్ను మీకు దూరం చేయకండి" అన్నాడు, రాము తెచ్చిపెట్టుకున్న చనువుతో.

"సారీ....! అలాగే. రామూ నీది గంభీర

మైన గొంతు. నీ వాయిస్ బాలు పాటల కంటే ఘంటసాల పాటలకే బాగా సూటవుతుంది. ఘంటసాల పాటలే ప్రాక్టీసు చేయండి" మళ్ళీ 'అండీ' అనే మాట రాధాకృష్ణ నోట రావడంతో నాయుడు నవ్వేడు. ఆ వెంటనే రాధాకృష్ణ కూడా నవ్వడంతో రాముకి కూడా నవ్వొచ్చింది. ముగ్గురూ నవ్వుకున్నారు. ఆ తర్వాత బై చెప్పుకుని ఎవరి క్లాసులకి వాళ్ళు వెళ్లిపోయేరు.

రాముకి క్లాసులో ఉండబుద్ధి కాలేదు. అన్యమనస్కంగా పాఠం వింటున్నాడు. లెక్చరర్ ఎంతో శ్రద్ధతో చెబుతుంటే అంతకు రెట్టింపు శ్రద్ధతో స్టూడెంట్స్ వింటున్నారు. ముఖ్యమైన పాయింట్స్ నోట్ చేసుకుంటున్నారు.

రాముకి మాత్రం అసహనంగా ఉంది. చెవులు రిక్కించి వింటున్నా ఏమీ అర్థం కావడం లేదు. ఏ పాయింట్ నోట్ చేస్కోవాలో కూడా రాముకి తెలియడంలేదు. అసలు నోట్ పుస్తకం తెరవనే లేదంతవరకు.

"ఏయ్! ఎటు చూస్తున్నావ్" లెక్చరర్ లెసన్ ఆపి అరిచినట్టుగా అన్నాడు.

రాముకి గుండె దడదడలాడింది. కాళ్ళూ చేతులూ వొణకేస్తున్నాయి. ఒళ్లంతా చెమట్లు.

"నిన్నే! స్టేండప్"

రాము లేవాలనుకున్నా లేవలేకపోతున్నాడు. లెక్చరర్ డయాస్ నుంచి దిగి నేరుగా వస్తున్నాడు. రాముకి ప్రాణాలు పోయినంత పనయింది. ముఖానికి పట్టిన ముచ్చెమటని మోచేత్తో తుడుచుకున్నాడు.

"రాస్కెల్! లే! లేచినిలబడు" లెక్చరర్ కోపం తారాస్థాయికి చేరుకుంది. అతడి గొంతు హెచ్చడంతో క్లాస్ హాలంతా దద్ధరిల్లింది.

ఒక్కసారి నిశ్శబ్దం ఆవరించింది. రాముకి దిక్కుతోచడంలేదు. పరధ్యానంగా ఉండడం సార్ కనిపెట్టేసినట్టు రాముకిట్టే అర్థమైపోయింది. అంతలో తన వెనక కూర్చున్న స్టూడెంట్‌ని నిలబెట్టి అతని చేతిలోని పుస్తకం తీసుకున్నాడు లెక్చరర్ విసురుగా.

'హమ్మయ్య' అనుకున్నాడు రాము తృప్తిగా.

"ఫూల్ లెసన్ వినకుండా సినిమా బొమ్మలు చూస్తున్నావా? క్లాస్ పూర్తయ్యేదాకా అలాగే నిలబడు" అని ఆ సినిమా పుస్తకాన్ని చించి కిటికీలో నుంచి అవతలకు పారేశాడు.

లెసన్ ఎప్పుడు పూర్తవుతుందా అని ఆ నిలబడ్డ కుర్రాడు ఎంతగా అనుకుంటున్నాడో రాముకి తెలియదుగాని అతను మాత్రం కోటి దేవుళ్లని కొలుస్తున్నాడు. త్వరగా హాస్టల్ రూమ్‌కి పోదామని.

రాము మనసంతా రాధాకృష్ణ మాటలతో నిండిపోయింది. అతని రూపం మదిలో అదే పనిగా పదేపదే కదలాడుతోంది.

ఒక పొగడ్త.... స్కూలు యూనివర్సిటీ తర్వాత తొలి పొగడ్త చేసిన మాయాజాలం అది. పక్కపక్కనే ఉంటున్నా ఎవరికెవరో తెలియదు. అలాంటిది తనను పిలిచి పలకరించి తననూ తన పాటలనూ మెచ్చుకుని పొగిడేసరికి రాధాకృష్ణ, నాయుడుల మీద ఎక్కడలేని మమకారం, ప్రేమాభిమానాలు కలిగాయి రాముకి. మళ్ళీ వాళ్లతో మాట్లాడాలని గంటలు గంటలు గడపాలని ఉంది రాముకి. ఆ తపనే రాము పరధ్యానానికి కారణం.

సాయంత్రం నాలుగున్నరవగానే లాంగ్‌బెల్ మోగింది. హమ్మయ్య అని తేలిగ్గా ఊపిరి


రాముకి దిక్కుతోచడం లేదు. పరధ్యానంగా ఉండడం సార్ కనిపెట్టేసినట్టు రాముకిట్టే అర్థమైపోయింది. అంతలో తన వెనక కూర్చున్న స్టూడెంట్‌ని నిలబెట్టి అతని చేతిలోని పుస్తకం తీసుకున్నాడు లెక్చరర్ విసురుగా

పీల్చుకుని లేచాడు రాము అందరితో పాటు.

బయటి కొచ్చి రాధాకృష్ణ, నాయుడుల కోసం వెతికాడు. వాళ్ళను కలిసేదాకా తన మనసు కుదుటపడదని రాముకి ఎప్పుడో అర్థమైపోయింది.

స్టూడెంట్స్ బిలబిల మని నడుచుకుంటూ మాట్లాడుతూ ఎవరి దారిన వారు పోతున్నారు. పది నిమిషాల్లో క్లాసులన్నీ ఖాళీ అయిపోయాయి. అంతవరకూ నవయవ్వనంతో ఉన్న స్టూడెంట్స్ కేరింతలు గోలలతో కళకళలాడిన కాలేజీ వరండా ఒక్కసారి నిశ్శబ్దమైపోయింది.

"వీళ్లేమయ్యారు.? బహుశా హాస్టల్ కి పోయివుంటారు" అనుకుంటూ రాము హాస్టల్‌వైపు నడిచాడు.

ఒంటరిగానే రాము తన గదికి చేరాడు. పక్కగదికి తాళం వేసి వుంది. తన రూం తాళం తీసి లోపలికి వెళ్లాడు. మంచంపై కూలబడ్డాడు.

ఒక్కరోజు పరిచయంతో, ఒక్కసారి మాటలు కలవడంతో నిన్నటిదాకా లేని ఉత్సాహం ఉరకలెత్తిస్తోంది రాముని.

రాత్రి పదయినా రాలేదు. బయటికెళ్లిన రాధాకృష్ణ, నాయుడు. రాము నిరీక్షణతో నీరసించి పోయేడు. తెలియని ఆరాటం ఆకలిని కూడా చంపేసింది అతడిలో.

* * *

దబదబమని తలుపుమీద బాదుతున్న శబ్దానికి నిద్రాభంగమై తెలివిలోకొచ్చేడు రాము. వెంటనే లేచి తలుపు తీశాడు.

"గుడ్ మార్నిగ్..." రాధాకృష్ణ, నాయుడు ఒకేసారి విష్ చేశారు. బదులుగా మొద్దుముఖంతో చిరునవ్వులు చిందిస్తూ "రండి" అంటూ గదిలోకి ఆహ్వానించాడు రాము.

> ఘంటసాల గారూ! వంటసాల పిలుస్తోంది అని నవ్వాడు రాధాకృష్ణ అతడి నవ్వులతో నాయుడు శృతి కలిపాడు. జస్ట్ ఫైవ్ మినిట్స్ అంటూ టూత్ బ్రష్షూ టవల్ తీసుకుని బాత్రూమ్ వైపు హడావిడిగా వెళ్లాడు రాము

"పావుగంట నుంచే నిన్ను లేపే ప్రయత్నం చేస్తున్నాం. ఎంత పిలిచినా పలకరే. చదివి చదివి రాత్రి పొద్దుపోయాక పడుకున్నారా లేక మళ్లీ గాత్రకచేరి చేశారా" నాయుడు అన్నాడు రూమ్‌లో కొస్తూ.

"అబ్బే అలాంటిదేం లేదు" ఆవులిస్తూ అన్నాడు రాము బదులుగా "రాత్రంతా మీ కోసం తెగ ఎదురు చూశాను. ఏమయ్యేరు? !"

"టవున్లో చిన్నపనుంటే చూసుకుని తర్వాత సినిమాకి వెళ్ళాం" చెప్పేడు రాధాకృష్ణ. "ఏ సినిమా? " రాము ఉత్సుకతగా చూస్తూ, రాధాకృష్ణ సినిమా పేరు చెప్పి "సినిమా చూస్తున్నంతసేపూ నువ్వే గుర్తొచ్చావు. మ్యూజికల్ పిక్చర్. సంగీతం, పాటలు అద్భుతం" అన్నాడు.

"నువ్వు తప్పకుండా చూడాల్సిన సినిమా" నాయుడు వంత పాడాడు.

"మరి నన్నెందుకు పిలవలేదు. పిలిస్తే నేనూ వచ్చేవాణ్ణి" అన్నాడు రాము.

"పిలవాలనే అనుకున్నాం. నీ క్లాసకి వచ్చాం కూడా. తదేక దీక్షతో లెసన్ వింటున్న నిన్ను డిస్టర్బ్ చేయాలనిపించలేదు"

రాము నవ్వాడు తదేక దీక్ష అనే మాటకి. సరిగ్గా అప్పుడే మెస్‌బెల్ మోగింది.

"ఘంటసాల గారూ! వంటసాల పిలుస్తోంది" అని నవ్వాడు రాధాకృష్ణ అతడు నవ్వులతో నాయుడు శృతి కలిపాడు.

"జస్ట్ ఫైవ్ మినిట్స్" టూత్ బ్రష్షూ టవల్ తీసుకుని బాత్రూమ్ వైపు హడావిడిగా వెళ్లాడు రాము.

రాధాకృష్ణ రాము మంచం మీదున్న వీక్లీ మ్యాగజైన్ అందుకుని పేజీలు తిరగేస్తు

న్నాడు. నాయుడు రూమంతా పరిశీలనగా చూస్తున్నాడు. అలా చూస్తున్న నాయుడి దృష్టి గోడపై ఒకచోట ఆగిపోయింది.

"రాధా! అటు చూడు" అన్నాడు ఉద్వి గ్నంగా.

రాధాకృష్ణ మేగజైన్‌లో నుంచి తలెత్తి అటుగా చూశాడు.

గోడపై ఫ్రేము కట్టించిన స్త్రీ మూర్తి చిత్రం.

ఎలాంటి వార్నినైనా ఇట్టే ఆకట్టుకునేలా ఉందా చిత్రం. 'ఆర్ట్ బై రాము' అని బొమ్మకు అడుగుభాగాన కుడిపక్క రాసి ఉన్న అక్షరాలు రాధాకృష్ణ గమనించి రాముకి చిత్రలేఖనంలో కూడా ప్రవేశముందా అనుకుంటూ ఆశ్చ ర్యంగా చూశాడు.

"రాధా! ఇది చూడు" అంటూ రాధాకృష్ణ చేతిలోని వీక్లీని తీసి చూస్తూ ఒక పేజీని చూపించాడు నాయుడు.

కథ టైటిల్ పక్కన పి.రాము అని ఉంది.

అంతలో బాత్రూమ్ నుంచి వచ్చాడు రాము ఒళ్ళు తుడుచుకుంటూ.

"ఏంటలా చూస్తున్నారు? ఆ కథ నేను రాసిందే" అన్నాడు రాము తడి టవల్‌ని ఆర బెడుతూ.

"మరి ఆ గోడమీది బొమ్మా? !"

"నేనే వేశాను" చెప్పాడు రాము కాసింత గర్వాన్ని ఒలకబోస్తూ.

"నీలో ఇన్ని కళలున్నాయా? !" నమ్మలే నట్టు చూశాడు రాధాకృష్ణ.

"ఆ! ఏదో మూడ్ బాగుంటే... ఆ బొమ్మ సంవత్సరాల క్రితం వేసింది" చెప్పాడు రాము మెస్ హాల్లోకి ముగ్గురూ ప్రవేశిస్తుండగా

"ఇప్పుడేమైనా బొమ్మలు వేస్తున్నావా...? !" నాయుడు మాటలు పూర్తి కాకుండానే రాము అన్నాడు. "ఇప్పుడు బొమ్మలు వేయడం లేదు. నాలో ఆ ఉత్సాహం చచ్చిపోయి చాలా కాలమయింది"

"అంతటి ఆర్ట్‌ని బలవంతంగా చంపుకు న్నావా? " రాధాకృష్ణ అన్నాడు ముఖం చిట్లిస్తూ.

"నాకు నేనుగా చంపుకోలేదు. ఒక మహాను భావుడు చంపేశాడు"

"ఎవరు? !" ఇడ్లీ తింటూ అడిగాడు నాయుడు.

"డ్రాయింగ్ టీచర్"

"చాలా ఆశ్చర్యంగా ఉందే? !" రాము చెప్పిన సమాధానం విని నాయుడు ఆ ఆశ్చ ర్యాన్ని మాటల్లో వ్యక్తం చేస్తూ అన్నాడు.

రాధాకృష్ణా అంతే! అదే స్థితిలో ఉన్నాడు. రాము చెప్పింది నిజమా, అబద్ధమా అనే ద్వై ధీ భావంలో పడిపోయేడు.

ఒక గురువు తన శిష్యుడిలోని కళని కాల రాసి అంతం చేయడం ఏమిటి? ! ఇది నిజంగా ఘోరం. అన్యాయం అనుకున్నాడు.

"నమ్మలేకపోతున్నారు కదూ! కానీ ముమ్మాటికీ అది నిజం. ఈ బొమ్మను ఇప్పుడు వెయ్యమంటే అస్సలు వేయలేను. ఆ మాష్టారు వల్ల కలిగిన చేదు అనుభవం నన్నలా తయారుచేసింది. ఆ సంఘటన ఇప్ప టికీ నన్ను బాధిస్తుంది. అంతులేని ఆవేదన పుట్టిస్తుంది. నిరుత్సాహాన్ని కలిగిస్తుంది"

"అసలేం జరిగిందో వివరంగా చెప్పు" అన్నాడు రాధాకృష్ణ బలవంతపెడుతున్న ట్లుగా.

రాము మౌనంగా ఉండిపోవడంతో "చెప్పు రాము" తెలుసుకోవాలన్న ఉబలాటంతో అన్నాడు నాయుడు కూడా.

ఇక తప్పదన్నట్టు రాము చేయి కడుక్కుని చెప్పడానికి సిద్ధమయ్యాడు. రాధాకృష్ణ, నాయుడు రాము ముఖంలోకి ఆసక్తిగా చూశారు కాఫీ తాగుతూ.

* * *

సెవెన్త్ పబ్లిక్ పరీక్ష కావడం వల్ల ఆ సంవత్సరం చదువు తప్ప వేరే విషయాలపై దృష్టి పెట్టలేదు రాము. ఆటా పాటా అన్నీ కట్టిపెట్టేసి పూర్తిగా చదువుపై ధ్యాస పెట్టాడు. ఆ ఏడాది సినిమాలు కూడా మానుకున్నాడు. రాము సంవత్సరంలో నెలకొ క్కటి చొప్పున డజను సినిమాల కంటే ఎక్కువ చూసేవాడు కాదు. అందుకు బాధగా

అనిపించినా మంచి మార్కులు తెచ్చుకోవాలన్న తపన రాము అన్నిటిని బలవంతంగా పక్కన పెట్టేలా చేసింది. ఆఖరికి తనకి అత్యంత ప్రీతికరమైన చిత్రలేఖనాన్ని కూడా దూరంగా ఉంచాల్సి వచ్చింది.

ఎక్కడైనా, ఎప్పుడైనా ఏదైనా మంచి బొమ్మ కనిపిస్తే ఆ బొమ్మను అచ్చుగుద్దినట్టు గీసి అందరికీ చూపించి ఏదో తెలియని తన్మయత్వంలో గర్వంగా ఫీలయ్యేవాడు. ఆ బొమ్మను చూసినవాళ్ళు బాగుందని మెచ్చుకుంటే.

సెవెన్త్ అయ్యాక ఎనిమిదో తరగతిలోకి రాగానే రాము చేసిన మొట్టమొదటి పని దేవుడి బొమ్మ గియ్యడం. పట్టాభిషిక్తుడయిన రాముడు సతీసమేతంగా సింహాసనాన్ని అధిష్ఠించగా లక్ష్మణుడు వింజామరలు వీస్తూ సేవ చేయడం, హనుమంతుడు సీతారాముల పాద నమస్కార భంగిమలో భక్తి ప్రపత్తుల్ని ప్రదర్శించడం - ఇదీ రాము గీసిన బొమ్మ.

ఒకరోజు రాత్రంతా మేల్కొని ఉండి మరీ శ్రద్ధతో గీసిన బొమ్మది. మర్నాడు డ్రాయింగ్ క్లాసులో మాష్టారుకి చూపించి మన్ననలు పొందాలన్న కోరిక. కానీ ఆ బొమ్మను చూసిన డ్రాయింగ్ మాస్టారు రాముని ప్రోత్సహించకపోగా ఫడేలున చెంపమీద కొట్టాడు.

"ఈ బొమ్మ నిన్నెవడు వేయమన్నాడు. ముందు నేను వేసే బొమ్మల్ని గీయడం నేర్చుకో" అని రాముని కొట్టడమే కాక నానా చీవాట్లూ పెట్టి క్లాసులో నలుగురి ముందు కంటతడి పెట్టేలా చేశాడా డ్రాయింగ్

## కసరత్తు సరిపడదా... ఓకే!

'అదేమిటి వ్యాయామం చేయట్లేదా? ఇలాగయితే ఎలాగోయ్!' అని ఎవరైనా మీకు వ్యాయామం ఆవశ్యకత గురించి లెక్చర్ దంచేందుకు సిద్ధమైపోతున్నారా? అయినాసరే ఇకనుంచి మీరు భయపడనక్కర్లేదు. మీకు ఇష్టమైతే వ్యాయామం చేయండి. లేకపోతే అమెరికన్ యూనివర్సిటీ పరిశోధకులు కనుగొన్న ఈ విషయాల్ని స్వీట్లు తింటూ మరీ చెప్పండి. సరైన తిండి, తగిన వ్యాయామం ఆరోగ్యానికి 'షార్ప్ కట్' అన్న అభిప్రాయం అందరికీ పనిచేయదని ఆ పరిశోధకులు తేల్చిచెప్పన్నారు. వ్యాయామం అందరి ఒంటికి సరిపడదని, ఒంటికి సరిపడ వ్యాయామాన్ని గుర్తించి, దాన్ని అవలంబిస్తే ఫలితం కన్పిస్తుందని కనుగొన్నారు. శాస్త్రవేత్తలు 20 వారాల పాటు 742 మందిని పరిశీలించారు. వారి తిండిపై నియంత్రణ విధించారు. నిర్ణీతమైన వ్యాయామం చేయించారు. ఫలితాలను విశ్లేషించారు. ఈ 742 మందిలో ఎవరు కూడా ఈ పరీక్షలో పాల్గొనేముందు ఆరునెలల నుంచీ ఎటువంటి వ్యాయామం చేయలేదు. ఈ పరిశోధనల వల్ల ఆసక్తికరమైన అంశాలు వెలుగులోకి వచ్చాయి. పరిశోధనలో పాల్గొన్న 742 మందిలో కేవలం 40 శాతానికి మాత్రమే వ్యాయామం వల్ల ఆరోగ్యం అభివృద్ధి చెందింది. మిగతావారిపై ఎటువంటి ప్రభావం లేదు. కాబట్టి చెమటలు కక్కేట్టు వ్యాయామం చేసేసి వందేళ్ళు బతుకుతాననుకోవటం పొరపాటు. ముందు సరైన వ్యాయామం వెతుక్కోవాలి అంటున్నారు. అయితే ఎవరికి ఏ వ్యాయామం సరిపోతుందో, ఎలా తెలుసుకోవాలని అడిగితే... 'ఉండండి. మరి కొన్నేళ్ళు పరిశోధించి చెప్తాం' అని తప్పుకుంటున్నారా శాస్త్రవేత్తలు.



మాస్టారు.

ఏదేదో ఊహించుకుని అందరి ముందు శెభాష్ అనిపించుకోవాలని ఎదురు చూసిన రాముకి తీవ్రమైన భంగపాటు కలిగింది. భరించలేని అవమానం పొందాల్సి వచ్చింది. అందుకు చాలా చింతించాడు. కన్నీళ్ళు పెట్టుకున్నాడు. భోరున ఏడ్చెయ్యాలన్నంత బాధ కలిగింది. ఎలాగో ఉబికి వస్తున్న ఏడుపుని ఆపుకుని నిరాశతో వచ్చి తన సీట్లో కూలబడ్డాడు.

తను చేసిన తప్పేమిటో రాముకి అర్థం కాలేదు. డ్రాయింగ్ బుక్‌లో అలాంటి బొమ్మలు వెయ్యడం తప్పయితే అది చెప్పి మందలించొచ్చు కానీ మాష్టారు అలా చేయలేదు. గూబ గుయ్యిమనేలా కొట్టాడు. పెద్ద నేరం చేసినట్టు ఊహించని శిక్ష విధించాడు.

అదే రాము గీసిన ఆఖరి చిత్రం. ఆ తర్వాత బొమ్మలు గియ్యడమే మానేశాడు. మాస్టారు గియ్యమని చెప్పిన రేఖాచిత్రాల్ని యాంత్రికంగా అయిష్టంగా గీయడం తప్ప మరే బొమ్మా వేయాలన్న కుతూహలం కలిగేది కాదు రాముకి. ఆ విధంగా తనకిష్టమైన చిత్రకళను మరిచిపోవాల్సి వచ్చింది. బలవంతంగా అతనిలో ఒక కళ మొలకెత్తే దశలోనే చచ్చిపోయింది శాశ్వతంగా.

అయితే ఇప్పటికీ ఎప్పటికీ అంతుబట్టని ప్రశ్న రాము మనసులో ప్రశ్నగానే మిగిలిపోయింది. డ్రాయింగ్ మాస్టారు కోపానికి కారణమేమిటో ఎంతగా ఆలోచించినా అర్థమవదు.

చదువును పక్కన బెట్టి అనవసరపు బొమ్మలు గీసి సమయాన్ని వృథా చేస్తున్నాడనుకున్నా అది కూడా నిజం కాదు. ఎందుకంటే రాము బ్రిలియంట్ స్టూడెంట్ అని ఆ డ్రాయింగ్ మాస్టారుకీ తెల్సు. అప్పుడప్పుడు ఎవరైనా టీచర్ సెలవు పెడితే బదులుగా ఆ క్లాసు పీరియడ్‌ని డ్రాయింగ్ మాస్టారుకి అప్పజెప్పేవారు. డ్రాయింగ్‌కి సంబంధించిన



సామాగ్రి విద్యార్థులు తెచ్చుకోకపోవడం వల్ల అనుకోకుండా తరగతికి వచ్చినందువల్ల ఆ డ్రాయింగ్ మాస్టారు చిన్న చిన్న లెక్కలు, ఇంగ్లీషు గ్రామరు లాంటి ఇతర సబ్జక్టుల్ని చెప్పి కాలక్షేపంగా పీరియడ్ పూర్తి చేసేవాడు. అలాంటి సందర్భాల్లో రాము అందరి కంటే ముందుండడం, చెప్పిన లెక్కలు చిటికెలో చేసి చూపించడం ఆయనకు తెలుసు. మరి ఎంతో శ్రమకోర్చి ఒక బొమ్మను చూసి అలాంటిదే గీసి చూపిస్తే డ్రాయింగ్ మాస్టారుకి కోపం ఎందుకొచ్చింది? ! కొట్టి నిరుత్సాహపరచాల్సిన అగత్యం ఏమిటి?

ఇది రాము మనసుని పదేపదే తొలిచివేసే ప్రశ్న. "కారణం నేను చెబుతాను" అన్నాడు నాయుడు రాము చెప్పిందంతా విన్న తర్వాత.

"ఏమిటో చెప్పు? " రాధాకృష్ణ వెంటనే



అన్నాడు.

“చెబుతాను. ముందు నువ్విది చెప్పు. ఆ డ్రాయింగ్ మాస్టారు పేరేమిటి?” అడిగారు నాయుడు రామునుద్దేశించి.

“పూర్తిగా తెలియదుగాని జాన్ అని ఆఖరున వస్తుంది. ఆయన్ని అందరూ డ్రాయింగ్ మాష్టార్ అనిగాక జాన్ మాష్టార్ అని పిలిచేవారు”

“అదీ అసలు సంగతి. ఒక క్రిష్టియన్‌కి హిందూ మతదేవుణ్ణి చూస్తే కోపం రాదా” అన్నాడు నాయుడు.

“అక్కడ మతం కాదు చూడాల్సింది ఒక స్టూడెంట్‌లోని ప్రతిభని. ఆయన పేరులో జాన్ ఉన్నంత మాత్రాన మరో మతాన్ని ద్వేషిస్తాడంటే నేను నమ్మను. ఆయన కోపాన్ని మతపరంగా నేనంగీకరించను. బుద్ధున్న గురువు చేసేపని కాదది” అన్నాడు రాధాకృష్ణ.

“అయితే ఆయన బుద్ధిలేని మాస్టారనుకుందాం” అని బిగ్గరగా నవ్వాడు నాయుడు.

రాధాకృష్ణ, రాము కూడా నవ్వారు నాయుడు మాటలకి.

“ఏమైనా ఆయనలా చేయడం న్యాయం కాదు. అయినా ఒక మాస్టారు తెలివితక్కువతనంతో కొట్టినంత మాత్రాన నీలో ఉన్న కళ మీద ఆసక్తిని చంపుకోవడమూ కరక్ట్ కాదు” అన్నాడు రాధాకృష్ణ.

“నిజమే! కానెందుకో మళ్ళీ బొమ్మలు గియ్యాలని ఎంత ప్రయత్నించినా నాకు చేతకాలేదు. అందుకే ఈ స్త్రీ బొమ్మని ఇంత అందంగా ఒకప్పుడు నేనే గీశానంటే ఎవరూ నమ్మరు. ఎవరు నమ్మినా నమ్మకపోయినా ఒకనాటి నాలో తొంగిచూసిన కళకు నిదర్శనం ఈ బొమ్మ” అన్నాడు రాము మెస్ నుంచి రాగానే గోడమీది బొమ్మను చూస్తూ. “ఈ ఫొటో ఎవరిది?” ఆ బొమ్మ పక్కనే ఉన్న వేరొక ఫొటోని చూపిస్తూ అడిగాడు రాధాకృష్ణ.

వస్త్రాలు మాసిపోయి జుట్టు చిందరవందరగా తయారై పిచ్చివాడి వేషంలో ఉన్న రాము ఫొటో.

ఒక నాటికలో తాగుబోతు వేషం వేశాడు రాము. ఆ ఫొటో అదే.

“ఇది నువ్వా?!”రాధాకృష్ణ నమ్మలేకపోయేడు అతడు చెప్పింది విని.

నిండా పదహారేళ్ళు లేవు. అతడిలో ఇన్ని కళలా అనే ఆశ్చర్యం అది.

“నేను! టెన్త్ పరీక్షలకు ముందు జరిగిన ఫంక్షన్‌లో మా క్లాస్ వాళ్ళతో కలిసి వేసిన నాటకంలో వేషం అది. ఆ వేషం వేయడంలో కూడా ఒక గమ్మత్తయిన అనుభవం ఉంది” అన్నాడు రాము.

“ఏఁవిటది!” ఇద్దరూ చాలా ఆసక్తితో అడిగారు.

"ఇలా మనం కబుర్లతో పడిపోతే ఈ రోజు క్లాస్ యింతే సంగతులు అయిపోతుంది. అప్పుడు ఈ ఘంటసాలను మీరే ఆడిపోసుకుంటారు" నవ్వుతూ అన్నాడు రాము. ఘంటసాల అనే పదం అంటున్నప్పుడు అతడిలో కించిత్ గర్వం తొంగిచూసింది.

"అదీ నిజమే! పదండి!" అని తొందర చేశాడు రాధాకృష్ణ. నాయుడు పుస్తకాలతో సిద్ధమైపోయేడు మరు నిమిషంలో.

'మిగతా కథ సాయంత్రం చెబుతావా?' అన్నాడు రాధాకృష్ణ రాము ముఖంలోకి ఆసక్తిగా చూస్తూ. రాముని చూస్తుంటే అతడు తమ కంటే ఎంత గొప్పవాడనిపిస్తోంది రాధాకృష్ణకు.

"అలాగే" అన్నాడు రాము డ్రెస్ వేసుకుంటూ.

ముగ్గురూ కాలేజీకి వెళ్తున్నప్పుడు రాధాకృష్ణ రాముతో ఉద్విగ్నంగా అన్నాడు.

"కాలేజీ అయ్యాక సాయంత్రం అలా కొండకు దగ్గరగా వెళ్ళి కబుర్లు చెప్పుకుందాం. నీ పాటలే గొప్పనుకున్నాను. మాటలు మరీ బాగున్నాయి. ఇంతకాలం ఒంటరిగా, మౌనంగా, బిడియంగా ఉన్న నీలో ఇన్ని మాటలు కళలు ఉన్నాయా? నీ మాటల్లోని కథలు కవ్విస్తున్నాయి. ఈ సాయంత్రం మనం కొండకోనల్లో విహరిస్తూ హాయిగా గడపాలి. ఓ. కె"

"ఓ. కె" రాము నవ్వాడు. అతనిలో ఇదివరకటి ఒంటరితనం లేదు.

## 4



బతుకు జీవుడా అనుకుంటూ వర్క్‌షాప్‌లో నుండి బయటపడ్డాడు రాము. అంతవరకూ చాలా అసహనంగా, అశాంతిగా గడిపాడు వర్క్‌షాప్‌లో. నాలుగు ఎప్పుడవుతుందా ఈ నరకం నుంచి ఎప్పుడు బయటపడదామా అని తెగ ఆరాటపడిపోయాడు. ఇంజిన్ శబ్దాలు, చుట్టూ ఉన్న మెకానికల్ పరికరాలు అంతా అయోమయంగా, గందరగోళంగా అనిపించింది. తోటి విద్యార్థుల్లో ఉన్న ఆసక్తి ఆనందం తనలో వందోవంతు కూడా లేకపోవడం ఆశ్చర్యంగా అనిపించింది రాముకి. ఇష్టం లేని పనులు ఇలాగే ఇరకాటంలో పెట్టి తికమక పెడతాయని మొదటిసారిగా అనిపించింది అతడికి. క్లాసులు ప్రారంభమయ్యాక మొదటిసారిగా వర్క్‌షాపులో ప్రాక్టికల్స్.

ప్రాక్టికల్స్ అంటే ఏదో హాయిగా సరదాగా గడిపేయవచ్చు అనుకున్నాడు రాము. అందుకే థియిరీ క్లాసులు ఎప్పుడు ముగుస్తాయా అని క్షణమొక యుగంలా గడిపాడు. మధ్యాహ్నం రెండు గంటలయ్యేదాకా థియరీ క్లాసుల్లో చాల అనీజీగా గడిపాడు. కోర్స్‌లో జాయిన్ అయిన తర్వాత మొదటిసారిగా ప్రాక్టికల్స్ కోసం వర్క్‌షాప్‌లో ఎంతో ఉత్సాహంగా అడుగుపెట్టాడు. అక్కడి వాతావరణం ఎందుకో రాముకి నచ్చలేదు. ఆ రణగొణధ్వనులు, మధ్యలో వర్క్‌షాపు ఇన్‌స్ట్రక్టర్ ఏవేవో సలహాలు సూచనలు ఇవ్వడం అవన్నీ అర్థం కాక అయోమయంగా అనిపిస్తోందతడికి. సాంకేతిక విద్య అంటే ఇలాగే ఉంటుందా?

గోడౌన్ లాంటి పెద్ద హాలు. హాలునిండా యంత్రాలు తుప్పు పట్టి... ఆయిల్ వాసనలు. వాంతయ్యేలా వికారం కలిగిస్తున్నాయి. నాలుగయ్యేదాకా ప్రత్యక్ష నరకం చవిచూశాడు. అక్కడినుంచి ఎంత త్వరగా బయటపడదామా అని ఎంతగానో ఎదురు చూశాడు. మిగతా విద్యార్థుల్లా శ్రద్ధ చూపలేక పనిలో లీనం కాలేకపోతున్నాడు. సాంకేతిక పదాలు పరికరాల పేర్లు అర్థం కావడం లేదు. అడిగి తెలుసుకుందామంటే చెప్పే నాథుడు లేడు. ఇన్‌స్ట్రక్టర్ చెప్పేది చెప్పి పావుగంట విద్యార్థులందర్నీ పరిశీలనగా చూసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఇన్‌స్ట్రక్టర్ ఉన్నా ఆయన్ని ఏమడ

గాలి? దేన్ని గురించి అడిగి తెల్సుకోవాలి. తనకు ఫండమెంటల్స్ కూడా తెలియవు. అసలు తెలుసుకునే ప్రయత్నం చేద్దామంటే తన సందేహాలకు సమాధానాలు విపులీకరించి చెప్పేవాళ్ళు లేరు. తోటి విద్యార్థుల్లా ఏదీ వెంటనే అర్థం చేసుకోలేకపోతున్నాడు.

ఒకటి రెండుసార్లు వాళ్ళనడిగే ప్రయత్నం చేశాడు రాము. వాళ్ళు అతనికేసి అదోలా చూసి ఆఫ్టాల్ చిన్న విషయాలు కూడా తెలియవా అన్నట్టు తేలికభావంతో చూడడం రాము భరించలేకపోతున్నాడు. తన పరిస్థితికి కారణం ఏమిటో అతనికే అర్థం కావడంలేదు. బహుశా ముందుగా బుక్స్ రిఫర్ చేయకపోవడం వల్లనా? పుస్తకం తెరిస్తే దాన్నిండా ఉన్న సాంకేతిక పదాలు, వాక్యాలు తికమక పెట్టేస్తున్నాయి. అందుకే పుస్తకం పట్టుకోగానే నిద్ర ముంచుకొచ్చేస్తోంది. ఆ కునుకుపాట్లు వర్క్‌షాపులో ప్రాక్టికల్స్ చేస్తున్నప్పుడు కూడా తప్పడం లేదు. అన్యమనస్కంగా ఏదో కాలక్షేపం చేస్తున్నాడు తోటి విద్యార్థులు చేస్తున్నవి చూస్తూ.

ఎంచక్కా ఇంటర్మీడియట్‌లో చేరితే ఈ అవస్థలుండేవి కాదు. కాలేజీ లైఫ్‌ని హాయిగా ఎంజాయ్ చేసేవాడు. అసలు తన ఆలోచనదే. ఇంటర్ పూర్తయ్యాక బి.ఇ., బి.టెక్ లలో జాయిన్ అవాలని రాము ఆలోచన.

జీవితంలో త్వరగా స్థిరపడడానికి ఇదే మంచి మార్గమట. మాస్టారు చెప్పారు. ఇంటర్ చేశాక ఇంజినీరింగ్ చేసేకంటే ఇదే మంచి పద్ధతట. పైగా రెండు ఎకడమిక్ ఇయర్‌లు కలిసొస్తాయట. డిప్లొమో ఇంజినీరింగ్ చేసి ఉద్యోగంలో చేరి ఉద్యోగం చేస్తూ పార్ట్‌టైమ్‌గా బి.ఇ, బి.టెక్ పూర్తి చేస్తే అన్ని విధాలా మంచిదట. అమ్మకేం తెలియదు. ఆ ముసలి మాస్టారు ఏం చెబితే అదే చెయ్యమంటుంది. ఆయన చెప్పినట్టు విని ఆచరించమంటుంది. తనకు మాత్రం కాలేజీ లైఫ్ అనుభవించాలని ఆశ. ఇది కూడా కాలేజీ అయినా మామూలు కాలేజిలా అనిపించడం లేదు. తను విన్నట్లు ఆ కాలేజీల్లో ఉండే సరదాలు సంతోషాలు ఇక్కడ మచ్చుకి కూడా కనిపించడం లేదు. మొదటిసారిగా మాస్టారు మీద రాముకి అయిష్టత కోపం కలిగాయి. తన ఈ అవస్థలన్నిటికీ ఆయనే కారణమని రాముకి చెప్పలేని అసహ్యం కలిగింది. ఆ ముసలోడు తన ఎంజాయ్‌మెంట్‌ని హరించి వేశాడు. జీవితంలో త్వరగా సెటిల్ కావడం అంత ముఖ్యమా? మరి పాలిటెక్నిక్‌లో సీట్ రాక ఇంటర్మీడియట్‌లో చేరినవాళ్ళ మాటేమిటి? ఆలోచిస్తున్నకొద్దీ రాముకి అసహనం అధికమైపోతోంది. జవాబు లేని ప్రశ్నలు మనసుని కకావికలం చేసేస్తున్నాయి. అందుకే మనసులో సంఘర్షణ లేకుండా ప్రయత్నం చేస్తున్నాడు. అయినా ఈ మూడేళ్ళూ ఎలా గడపాలా అని అంతలోనే మనసులో దిగులు మొదలవుతూ వుంది. వెంటనే వర్క్‌షాపు నుంచి బయటపడాలి. ఎంచక్కా రాధాకృష్ణనాయుడులతో కాలక్షేపం చెయ్యాలి. వాళ్ళతో గడుపుతుంటే కాలమే తెలియడం లేదు. వాళ్ళు తనను కోరి పాడమనడం పాడాక వాళ్ళు ఆకాశానికెత్తేసి పొగడడం... తల్చుకుంటేనే ఎంతో థ్రిల్‌గా ఉంటోంది. తనలో అంత గొప్ప గాయకుడున్నాడని రాధాకృష్ణ వాళ్ళు చెప్పేదాకా తనకే తెలియదు.

"రాము! నీది అద్భుతమైన కంఠం. ఎట్టి పరిస్థితుల్లోనూ పాడడం ఆపేయవద్దు. నీకు మంచి భవిషత్తుంది. నువ్వు మరొక ఘంటసాలవవుతావు. మహ్మద్ రఫీలా యావద్దేశాన్నీ ఓలలాడిస్తావు. అంతర్జాతీయ ఖ్యాతిని పొందే యోగం నీకు ఉంది. మరొక సలహా. రామూ! నువ్వెప్పటికైనా సంగీతం నేర్చుకోవాలి. ఇది మాత్రం మరిచిపోవద్దు. రాధాకృష్ణ ముగ్గురిలోనూ పెద్దవాడు. చాలా తెలివితేటలున్నాయి. ప్రాపంచిక విషయాల పట్ల అతనికి చక్కటి అవగాహన ఉంది. అందుకే రాముకి రాధాకృష్ణంటే అంతటి అభిమానం. రాధాకృష్ణ చెప్పింతర్వాతే రాము పూర్తిగా ఘంటసాల పాటలకు అంకితమైపోయాడు. ఘంటసాల పాటలే పాడుతూ నిరంతర సాధన చేస్తున్నాడు.

"మీ కోసమే ఎదురు చూస్తున్నాం ఘంటసాల గారూ!" హాస్టల్‌కి చేరగానే రాధాకృష్ణ అన్నాడు.

రాము బదులుగా నవ్వేడు ఉత్సాహంతో. చేతిలోని పుస్తకాలని కిటికీ గుండా గదిలోకి విసిరేసి వాళ్ళతో కదిలాడు కొండవైపు.

కొంతదూరం నడిచాక ముగ్గురూ అనువుగా ఉన్నచోట కూలబడ్డారు.

"ఆ! ఇప్పుడు చెప్పండి ఘంటసాలగారూ!" నాయుడు ముందుగా అన్నాడు. రాము కొంతసేపు మౌనంగా ఉండిపోయేడు.

"అదేంటి రాముగారూ! ఇంతలోనే అంత డల్ అయిపోయారు" నాయుడు నవ్వాడు అలవాటుగా.

"మీరు అండీగిండీ అని నన్ను పరాయివాడిలా చూస్తున్నారు" రాము బేలగా ముఖం పెట్టి అన్నాడు.

"ఓ! సారీ! ఇకపై అలా పిలవను. చెప్పు!"

"ఏమిటి చెప్పేది? !"

"ఉదయం ఏదో చెప్పి సగంలో ఆపేశావు కదా. అది"

"ఓహో! స్టేజిపై తాగుబోతు వేషం గురించా? !"

"ఆ సంగతి తర్వాత! ముందు చక్కని పాటొకటి పాడు" రాధాకృష్ణ అన్నాడు.

'చక్కని పాట' రాము అలాంటి సందర్భాల్లోనే డోలాయమానంలో పడిపోతాడు. తనకు చాలా పాటొచ్చు వాటిలో చక్కని పాటేదో, చచ్చు పాటేదో తెలియదు. అందుకే అన్నాడు "ఏ పాట కావాలో మీరే చెప్పండి"

"అందమే ఆనందం. ఆనందమే జీవిత మకరందం"

రాము కొన్ని సెకండ్లు కళ్ళు మూసుకుని పాట ప్రారంభించాడు. పాట వింటున్న రాధాకృష్ణ, నాయుడు తన్మయంలో మునిగిపోయారు. ఒక పాట మరో నాలుగైదు పాటలకు ప్రేరణ కలిగించింది ముగ్గురిలోనూ.

ఉదయం నుంచి మధ్యాహ్నం దాకా చదువులో నిమగ్నమై విసుగెత్తిన వాళ్ళ హృదయాలు రాము పాటలతో సేదతీరి రీఛార్జి చేయబడిన బ్యాటరీల్లా అయ్యాయి.

రాము పాటలాపి మాటలు ప్రారంభించాడు.

"ఆ నాటిక పేరు 'తాత్పర్యం తెచ్చిన తంటా'. అందులో నాది తాగుబోతు పాత్ర. నా నటన ఎంత బాగా సాగిందంటే స్టేజిపైకి నేను వచ్చేసరికి ఒకటే గోల... అలజడి... ఈలలు యికయికలు పకపకలు.

నేచురాలిటీ కోసం నేను నిజమైన బ్రాందీ సీసానే పట్టుకున్నాను. బ్రాందీ రంగు కూడా అచ్చం బ్రాందీలాగే ఉంది.

నాటిక పూర్తయ్యేసరికి ప్రేక్షకులు ఆవేశాన్ని ఆపుకోలేక స్టేజీ పైకొచ్చి నన్ను చుట్టుముట్టి అభినందనల వర్షంలో ముంచెత్తుతున్నారు.

సరిగ్గా అప్పుడే వచ్చాడు అని చెప్పడం ఆపాడు రాము.

"ఎవరు? "ఇద్దరూ ముక్తకంఠంగా అన్నారు.

"మీ టీచరా"

"హెడ్మాస్టరా? "

"కాదు ప్యూన్"

"ప్యూనా! వాడెందుకొచ్చేడు. ఆటోగ్రాఫ్ కోసమా? !" అన్నాడు నాయుడు.

"కాదు! సీసాలో మిగిలిన బ్రాందీ కోసం" రాధాకృష్ణ మాటలకు రాము నవ్వేడు. నాయుడు కూడా శ్రుతి కలిపేడు ఆ నవ్వులకు.

"కాదు! ప్రిన్సిపాల్ నన్ను ఉన్నపళంగా రమ్మన్నారని చెప్పడానికి" చెప్పేడు రాము.

"అవునూ! నాదొక సందేహం. చెప్పు రాము నువ్వు చదివింది స్కూల్ ఫైనల్! మరి కాలేజీ, ప్రిన్సిపాలూ అంటున్నావేమిటి? !" రాధాకృష్ణ సందేహంగా అన్నాడు.

"హైస్కూల్‌కి జూనియర్ కాలేజీకి ప్రిన్స్‌పాల్ ఒక్కరే అధిపతి"

"అలాగా! సరే ఎందుకు కబురు చేశారు? !"

"ఏముంది! మనవాడి నటన నచ్చి ప్రత్యేకంగా మెచ్చుకుని అభినందించడానికి" నాయుడు అన్నాడు.

"నేను అలాగే అనుకున్నాను. ఆయన అభినందనలు అందుకోవడానికి హుషారుగా ఆయన గదిలోకి ప్రవేశించాను"

"ఈ వయస్సులోనే నీకు తాగుడు అలవాటుందా?" ప్రిన్స్‌పాల్ ప్రశ్నకు నాకు మతి పోయినంత పనయింది. ఊహించని ఆయన మాటలకి నిశ్చేష్టుణ్ణి అయిపోయాను.

"లేదు సార్"

"కాదు నువ్వు తాగి నటించావు" అంటూ నా చేతిలోని బ్రాందీ సీసా లాక్కున్నారు. ముక్కు దగ్గర పెట్టుకుని వాసన చూశారు. ప్యూన్‌కిచ్చి వాసన చూడమన్నారు"

"సరిగ్గా అప్పుడే మా నాటిక డైరెక్టర్ రామకృష్ణ అక్కడికొచ్చేడు. ఆయన విషయం తెలుసుకుని ప్రిన్సిపాల్‌కి అన్నీ వివరంగా చెప్పాడు. అప్పుడు ఆయన శాంతించి నన్ను ఆలింగనం చేసుకుని "మై డియర్ బాయ్! నీలో గొప్ప నటుడున్నాడు. చాలా వృద్ధిలోకి వస్తావు. కాస్త కృషి చేశావంటే సినిమా ఫీల్డ్‌కి కూడా వెళ్ళొచ్చు" అన్నాడు.

"మరి నీ పాట ఆయనికి వినిపించ లేదా?" రాధాకృష్ణ అడిగేడు.

"వింటే నటుడుగా కంటే గాయకుడిగానే ఫీల్డ్‌లో రాణిస్తావనేవాడు"అన్నాడు నాయుడు ఉత్సాహంగా.

"నీలాంటి గొప్ప కళాకారుణ్ణి ఇన్నాళ్ళూ పక్కనే ఉన్నా గుర్తించలేకపోయాం" అన్నాడు రాధాకృష్ణ మెరిసే కళ్ళతో రాముని అభినందిస్తూ.

"అవున్నిజమే! నీ పాటలు విని ఆనందించామే గానీ, నిన్ను పరిచయం చేసుకునే ప్రయత్నమైనా చేయలేదు" వెంటనే నాయుడన్నాడు.

వాస్తవానికి వాళ్ళకంటే ఎక్కువ బాధపడుతున్నాడు రాము. ఎందుకంటే అంతవరకూ అంత మంచి స్నేహితుల్ని చూసీ చూడనట్టుగా పట్టించుకోకుండా ఒంటరిగా గడిపేశాడు. బిడియంతో అనతికాలంలోనే మంచి మిత్రులయ్యేరు వాళ్ళు ముగ్గురూ.

వాళ్ళ సంగతేమోగానీ రాము మాత్రం ఒక్కక్షణం కూడా వాళ్లని విడిచి వుండలేకపోయాడు. వాళ్ళు కనిపించని క్షణాలు యుగాల్లా అనిపించేవి అతడికి.

ముఖ్యంగా రాధాకృష్ణ అంటే ఏదో తెలియని అభిమానం అతన్ని చూసినప్పుడల్లా చాలా ఏళ్ళుగా పరిచయమున్నట్టనిపిస్తుంది. ఇద్దరి మధ్యా విడదీయలేని స్నేహబంధం ఒక జన్మకాలంగా ఉన్నట్టు ఫీలవుతున్నాడు రాము.

"ఇంతకీ సినీఫీల్డ్‌లోకి వెళ్ళి మమ్మల్ని గుర్తుంచుకుంటావా లేక ఎవరు మీరు అంటావా?" అని జోక్ చేస్తూ అన్నాడు నాయుడు.

"ప్రిన్సిపాల్ అంతటి వ్యక్తి నీ నటనను నిజమనుకుని భ్రమలో పడ్డాడంటే నీలో ఎంత టాలెంట్ ఉందో అర్థమవుతుంది. పెద్దల ఆశీర్వాదాలు ఊరికే పోవు. అందుకే అన్నారు 'పెద్దల మాట చద్దన్నం మూట' అని. ఆయనకే కాదు నీలోని కళను చూసిన ఎవరైనా అలాగే స్పందిస్తారు. భవిష్యత్తులో పైకొస్తావని తప్పక నమ్ముతారు. మహామహులంతా ఒకప్పుడు నీలా ఈ దశలన్నీ దాటినవారే. వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకుని పెద్ద స్థాయికి చేరుకున్నారు. ఘంటసాల గొంతు బాగోలేదని మొదటి తిరస్కరించిన హెచ్.ఎమ్.వి. రికార్డింగ్ కంపెనీవారు ఆ తర్వాత బ్రహ్మరథం పట్టారు. తమ కంపెనీ గర్వించే గాయకుడుగా కొనియాడారు.

నీలోని కళను చూసిన ఎవరైనా అలాగే స్పందిస్తారు. మహామహులంతా ఒకప్పుడు నీలా ఈ దశలన్నీ దాటినవారే. వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకుని పెద్ద స్థాయికి చేరుకున్నారు

అంతెందుకు మొదట్లో చిన్నచిన్న విలన్ పాత్రలు వేసిన చిరంజీవి పరిశ్రమలో నిలదొక్కుకుని మెగాస్టార్ అనిపించుకుంటున్నాడు" అన్నాడు రాధాకృష్ణ.

అది అమాయకత్వమో, అర్థం చేసుకోలేని వయస్సు ప్రభావమో కానీ, చిరంజీవి అంతటి నటుడితో పోల్చేసరికి రాము ఉన్నట్టుండి

ఒక్కసారిగా ఉప్పొంగిపోయేడు. నిజంగా తనలో అంతటి ప్రతిభాపాటవాలున్నాయా అని కొన్ని క్షణాలు సంశయంలో పడిపోయేడు రాము. రాధాకృష్ణ ముఖంలోకి అలా చూస్తూ ఉండిపోయేడు బొమ్మలాగా.

"ఏంటలా చూస్తున్నావు! మేం నిన్ను ఊరికే ఉబ్బేసి మునగ చెట్టు ఎక్కించేస్తున్నామనుకుంటున్నావా? ఉండు ఎప్పటికైనా నా మాట నిజమవుతుంది. ఇంగ్లీషులో ఒక సామెతుంది 'ఎవ్విరీథింగ్ విల్ హేవ్ యిట్స్ ఓన్ టైం' అంటే ప్రతి ఒక్కరికీ తమకంటూ ఒకరోజు వస్తుంది. శ్రీశ్రీ మహాకవి ఏమన్నాడో తెల్సా? " అని ఆగాడు రాధాకృష్ణ.

"ఏమన్నాడు? "నాయుడు వెంటనే ప్రశ్నిస్తూ అడిగాడు. రాముకి ఆ సంగతి తెల్సినా రాధాకృష్ణ ఏం చెబుతాడా అని ఆసక్తిగా అతని ముఖంలోకి సూటిగా పరికించి చూడసాగాడు.

రాధాకృష్ణ మాటలు వింటూ రాము మనసు ఎక్కడికో వెళ్ళిపోయింది. ఊహల్లో ఊరేగింది. రంగుల కలల్లో తేలియాడింది. ఇంతకుముందు ఎవరూ తనను ఇంతగా పొగడలేదు

"ఈ దశాబ్దం నాది" అని సగర్వంగా ప్రకటించుకున్నాడు. ఆ ప్రకటనను సాహితీ జగతి యావత్తు అంగీకరించింది. ఊరికే అంగీకరించడమే కాదు. ఆయన అడుగులకి మడుగులొత్తింది" రాధాకృష్ణ మాటలు వింటూ రాము మనసు ఎక్కడికో వెళ్ళిపోయింది. ఊహల్లో ఊరేగింది. రంగుల కలల్లో తేలియాడింది. ఇంతకుముందు ఎవరూ తనను ఇంతగా పొగడలేదు. ప్రముఖులతో పోల్చి చెప్పలేదు. అసలు అలాంటి సందర్భమే ఎదురవలేదు. ఎందుకంటే ఎప్పుడో తప్ప తరచూ పాడడం జరగలేదు. జరిగినా అది గుట్టుగా ఏకాంతంలో సాగేది స్కూలు వార్షికోత్సవంలో స్టేజిపై బహుమతి అందుకునేదాకా తోటి విద్యార్థులకు కూడా రాము సంగతిగాని, అతనిలో దాగి ఉన్న కళల సంగతిగాని తెలియలేదు. వాళ్ళకు తెలిసిందొకటే. రాము మెరిట్ స్టూడెంట్. చదువులో ముందుండే విద్యార్థి, అంతే.

అప్పుడప్పుడు ఉత్సాహంతో గొంతెత్తి ఇంట్లో పాడుకునేవాడు రాము. తల్లి నారాయణమ్మ తన బిడ్డ బాగా పాడుతాడని లోలోన సంతోషించినా ఆటపాటల్లో పడి చదువు సంగతి మర్చిపోతాడేమోనని భయపడేది. "నాయనా ఎందుకొచ్చిన పాటలురా? పాటలు కడుపు నింపుతాయా? పిచ్చి పాటలాపి చదువుకోయ్యా" అని మందలించేది. కొడుకు గంటలకొద్దీ గళమెత్తి పాడుతుంటే మనసులో గర్వంగా భావించినా గాడితప్పి భవిష్యత్తుని నాశనం చేసుకుంటాడేమోనని భీతి చెందేది.

ఆమె భయపడినట్టు రాము చదువును అశ్రద్ధ చేయలేదు. ఒకటో తరగతి నుంచి పదో తరగతి దాకా చదువులో శెభాష్ అనిపించుకున్నాడు. తల్లి కలలు కల్లలు చేయకుండా బుద్ధిగా చదువుకుని ఫస్టొచ్చాడు.

ఇంజనీరింగ్ డిప్లొమా కోర్సులో చేరాక, అప్పటిదాకా తెలియని కొత్త ప్రపంచంలో అడుగుపెట్టాక రాము దిశ మారడం ప్రారంభించింది. తొలి రోజుల్లో రాము తన పాత ఒరవడి ప్రకారం సాయంత్రం కాగానే పుస్తకాలు తీసి ఒక్కొక్క సబ్జక్టువల్లె వేసేవాడు. అర్థం కాకపోతే అర్థం చేసుకోవడానికి తంటాలు పడేవాడు. ఆ తర్వాతే తనేమిటో తనే మర్చిపోయే స్థితికి చేరుకున్నాడనే కంటే చుట్టూ ఉన్నవాళ్ళే మార్చేశారనాలి.

ఇప్పుడు రాముకి తల్లి ఆవేదన గుర్తులేదు.

సుందరయ్య మాస్టారి హెచ్చరిక మర్చిపోయేడు.

రాధాకృష్ణ, నాయుడుల పరిచయం... వాళ్ళ పొగడ్తలు రాము రూటు మార్చేశాయి. పెడదారి పట్టేలా చేశాయి. వాస్తవానికి వాళ్ళు చెప్పేది కొంచమే అయినా రాము ఊహించుకునేదే ఎక్కువగా ఉండేది.

హాస్టల్‌లో క్రమంగా పాపులర్ అయిపో

యాడు. రాము గురించి తెలియనివాళ్ళని వేళ్ళపై లెక్కించొచ్చనడం అతిశయోక్తి కాదు.

కొద్దికాలంలోనే రాము అందరికీ సెంటరాఫ్ ఎట్రాక్షనయ్యేడు. తన కళానైపుణ్యంతో తోటి వారిని అలరించేవాడు. నాలుగు గోడల మధ్య ఉన్న అతని ఉనికి నలుగురి నోళ్ళలో నానేదాకా వచ్చేసింది. అందుకు దోహదం చేసింది రాధాకృష్ణ, నాయుడుల పరిచయమే. వారితోటి చేసిన స్నేహం అందరి దృష్టిలో పడేలా చేసింది. అందుక్కారణం కూడా బలీయంగా ఉండేది. రాము వాళ్ళని విడిచిపెట్టి క్షణం ఉండేవాడు కాదు.

ఆ ఇద్దరితో కలిసి మెలిసి తిరగడం... షికార్లు... సినిమాలు.

రాధాకృష్ణ కాస్త కలిగినింటి బిడ్డ. డబ్బు చాలా ఉండేది. ముగ్గురికీ ఖర్చులు అతనే భరించేవాడు. జూపార్క్, కైలాసగిరి, ఋషికొండ... ఇలాంటి వాటికి తరచూ వెళ్ళి జాలీగా గడిపేవారు ముగ్గురూ.

రాముకి పేదరికం వల్ల ఇన్నాళ్ళూ ఏం కోల్పోయేడో అర్థమవసాగింది. డాల్ఫిన్‌లాంటి స్టార్ హోటల్ ఆవరణలోకి అడుగుపెట్టే అర్హత కూడా లేని రాముకి ఆ ఆనందంలోని మజా రుచి మరిగాక జీవితమంతా అలాగే సాగిపోతే ఎంత బాగుణ్ణు అనేకునేవాడు.

రాము పేదరికం అతనికున్న అతిబిడియం అన్నీ తెలుసుకున్న రాధాకృష్ణ రాముమీద ప్రత్యేకాభిమానం కురిపించేవాడు. అవసరమొచ్చినపుడు బలవంతంగా రాము జేబులో డబ్బులు కుక్కేవాడు-రాము అడక్కపోయినా.

ఉదయం లేచింది మొదలు మళ్ళీ రాత్రి నిద్రపోయేదాకా రాము వాళ్ళను విడిచిపెట్టేవాడు కాదు. ఈమధ్య తన బెడ్డింగుని పక్క గదిలోకి మార్చేశాడు రాము. తనకి అవసరమైన వాటిని కూడా తెచ్చుకుని రాధాకృష్ణ గదిలో ఉంచుకున్నాడు. తన గదికి తాళం వేసి అనునిత్యం ఆ గదిలోనే గడిపేస్తున్నాడు.

ముగ్గురూ ఒకేసారి నిద్ర లేవడం... బాత్రూమ్‌కి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకోవడం... కలిసి మెస్‌కి వెళ్ళడం... కాలేజీకి ముగ్గురూ కలిసి వెళ్ళడం...రావడం. అయితే రాము జూనియర్, రాధాకృష్ణ, నాయుడు సీనియర్స్ కావడం వలన బ్రాంచ్‌లు ఒకటే అయినా వేరువేరుగా ఉండేవి తరగతులు. తను కూడా వాళ్ళతో కలిసి ఒకే క్లాస్ రూమ్‌లో ఉండాలని రాము ఉబలాటపడేవాడు. అది తీరే కోరిక కాకపోయినా తరచూ అలా అనుకుంటూ ఆశపడేవాడు. అది తప్ప మిగతా అన్నీ కలిసి చేసేవాడు.

అయితే వాళ్ళతో కలిసి చేయలేకపోతున్న పని మరొకటి తయారయింది. అది చదువు మొదట్లో చేసినట్లు వాళ్లతో పుస్తకం తెరిచి కూర్చోలేకపోతున్నాడు. పుస్తకం ముట్టుకోగానే నిద్ర ముంచుకొచ్చేస్తుంది. ఎంత ప్రయత్నించినా కళ్ళు మూతలు పడిపోవడాన్ని ఆపుకోలేకపోతున్నాడు రాము.

అందుకే ఆ సమయంలో రాధాకృష్ణ, నాయుడు చదువుకుంటూ ఉంటే రాము పాటలతో కాలక్షేపం చేసేవాడు. వాళ్ళు మాత్రం రాము గానామృతాన్ని సేవిస్తూనే చదువుకునేవాళ్లు.

తన తప్పు తనకు తెలిసినా పొగడ్తల మాయలోపడి తప్పుడు మార్గంలో సాగేవాడు రాము. క్రమంగా అదే వదిలించుకోలేని అలవాటుగా, బతుకును బుగ్గి చేసే జాడ్యంగా మారిపోయింది.

రాధాకృష్ణ ధనవంతుల ఇంటి నుంచి వచ్చినా చదువుపట్ల తన బాధ్యతను మరిచేవాడు కాదు. అందుకే నాయుడుతో మొదట్నుంచి కంబైన్డ్ స్టడీస్ చేసేవాడు. రాముని ఎంత ప్రయత్నించినా తమతో చదువుకు కూర్చోబెట్ట లేకపోయేవాడు రాధాకృష్ణ. రాము పూర్తిగా దారి మళ్ళిపోయేడని రాధాకృష్ణకు అర్థమయింది. కానీ, దానికి కారణం అతిపొగడ్తలని అతడికి తెలియవు. అందుకే అంతకుముందులా కోరి పాడించుకోవడం లేదు. అలాగని రాము సమయం సందర్భం లేకుండా పాడుతుంటే పాడొద్దని అడ్డు చెప్పేవాడు కాదు. నాయుడు కూడా రాధాకృష్ణ పద్ధతినే అవలంబించడం మొదలుపెట్టేడు.

రాధాకృష్ణ, నాయుడు ఫైనల్ ఎగ్జామ్స్ దగ్గర పడడంతో పుస్తకాలకు అతుక్కుపోయారు పూర్తిగా. కోర్సులన్నీ పూర్తికావడం వల్ల మొత్తం సమయాన్ని చదువుకే వెచ్చించేవారు.

రాము కూనిరాగాలాపనలు మాత్రం ఆపడం లేదు. రూమ్ బయటకొచ్చి హాయిగా పాడుకునేవాడు. మొదట్లో తప్పుచేస్తున్న భావన రాముకి కలిగేది. ఇప్పుడు అలాంటి భావన బాధ అస్సలు కలగడం లేదు.

ఊరంతా ఒకదారి ఉలిపిరి పిట్టదొకదారి అన్నట్టుగా అంతా పరీక్షలకు రేయింబవళ్లు చదువుతుంటే రాము పాటలు పాడటంలో మునిగిపోయేవాడు. నిత్యం తన లోకంలో విహరిస్తూ తనను తానే మరిచిపోయాడు. అందుక్కారణం కూడా లేకపోలేదు. మొదటి సంవత్సరం పరీక్షలు అంతగా ప్రాధాన్యం లేనివని ఒకరిద్దరనుకున్న మాటలు రాముపై బాగా ప్రభావం చూపాయి. అలాంటి తప్పుడు భ్రమలు, ఆలోచనలే రాముని పూర్తిగా మార్చివేశాయి.

## 5



ఆ రోజుతో పరీక్షలయిపోయాయి. అంతకుముందే ప్రాక్టికల్స్ ముగిశాయి. విద్యార్థుల మనసులు తేలికపడ్డాయి. ఆనందడోలికలలో తేలియాడుతున్నాయి. అంతులేని ఉత్సాహం ఉరకలు వేస్తోంది. కేరింతలు కొట్టించి వెర్రికేకలు పెట్టిస్తోంది. హాస్టలంతా ఒకటే సందడి. గుంపులు గుంపులుగా ఒక చోట కలిసి మాట్లాడుకుంటున్నారు స్టూడెంట్స్ అంతా.

కొందరు ముగిసిన పరీక్షల గురించి ఎవరెవరు ఎలా రాశారో చర్చించుకుంటున్నారు. మరికొందరు అయిపోయిన పరీక్షల సంగతి అప్పుడే మర్చిపోయి వేరే విషయాలపై మనసులు పెట్టి తలమునకలవుతున్నారు. రాబోయే రోజుల్లో చెయ్యబోయే పనుల గురించి ప్లాన్‌లు వేసుకుంటున్నారు. సెలవుల్లో ఏమేం చేయాలో, ఎక్కడెక్కడికెళ్ళాలో తర్జనభర్జనలు పడుతున్నారు.

కొందరు టౌన్లోకి వెళ్లే ప్రయత్నాలు చేస్తున్నారు. స్నానపానాదులు ముగించి ఇస్త్రీ బట్టలు ధరించి షోకిల్లా రాయుళ్ళయి రూమ్‌లకు తాళాలు వేసి ఉరకలు పరుగులతో హాస్టల్ కేంపస్‌లు దాటి ఎటో పోతున్నారు.

"ఏంటి ఘంటసాలగారూ? మీ ప్రొగ్రాం ఏమిటి? ఎక్కడికి వెళతారు? ఇంటికి - సొంత ఊరికి ఎప్పుడు పయనం? " రాధాకృష్ణ యధాలాపంగా రామునుద్దేశించి అన్నాడు.

రాము మౌనంగా ఎటోచూస్తూ ఆలోచిస్తున్నాడు. అతని వదనంలో ఏదో చింత. మనసులో కల్లోలం అందుకే రాధాకృష్ణ మాటలకు వెంటనే బదులు పలకలేకపోయాడు రాము.

"అరే! అదేంటి? అంతా సంతోషంలో మునిగి తేలుతుంటే నువ్వు దీనంగా కనిపిస్తున్నావు? పరీక్షలు సంతృప్తికరంగా రాయలేదా? డోంట్‌వర్రీ. కోర్స్ ప్రారంభంలో ఉన్నావు. అంత సీరియస్‌గా తీసుకోనవసరం లేదు" జబ్బలమీద చేతులు వేసి రాముని ఉల్లాసపరచే ప్రయత్నం చేశాడు రాధాకృష్ణ. నాయుడు కూడా రాము ముఖంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తున్న విచారాన్ని ఇట్టే పసిగట్టేశాడు. చలనం చెలాకీతనం కనిపించని రాముని నిశితంగా పరిశీలిస్తూ అతని ఆవేదనను అంతరంగాన్ని అంచనా వేసే ప్రయత్నం చేస్తున్నాడు నాయుడు.

"ఏయ్ రామూ! నిన్నే మాట్లాడవేం? " రాధాకృష్ణ స్వరం హెచ్చించి అన్నాడు.

"అబ్బే! ఏమీలేదు" అన్నాడు రాము నిర్లిప్తంగా

"ఏమీ లేకపోవడం ఏమిటి? నువ్వెంత దాచినా నీ మనసులో ఏదో బాధ ఉందని



యిట్టే తెలిసిపోతుంది" అన్నాడు రాధాకృష్ణ సూటిగా కళ్లల్లోకి చూస్తూ.

"నిజమే! నాకే తెలియని వేదన ఏదో నన్ను బెంగపెడుతోంది" రాము లోగొంతుకతో అన్నాడు నెమ్మదిగా. ఇద్దరూ రాముకేసి వింతగా చూశారు.

"బెంగెందుకు? మేముండగా?" అన్నారిద్దరూ ఏకకంఠంగా.

"ఈ రోజుంటారు. రేపూ ఉంటారా?" అన్నాడు రాము. కొన్ని క్షణాలాగి "మీ కోర్స్ పూర్తయింది. ఫైనల్ ఎగ్జామ్స్ ముగిశాయి. ఇకపై మీరు కనిపించరుగా!" అన్నాడు దైన్యంగా ముఖం పెట్టి.

"మేమే కాదు. కోర్స్ పూర్తయ్యాక రేపు నువ్వూ వెళ్లక తప్పదుగా" నాయుడు అనునయంగా అన్నాడు రాము వెన్నుతట్టి.

"మీతో ఇన్నాళ్లూ కలసిమెలసి ఉన్నాను. మనం ఒకరికొకరం బాగా దగ్గరయ్యాం. ఒకరి మనసులొకరు తెలుసుకుని తక్కువ కాలంలో ఎక్కువగా ఒకరిపై ఒకరం మమకారాన్ని పెంచుకున్నాం. ఇప్పుడు ఒక్కసారిగా విడిపోవడం"

"మహానుభావా! అదా నీ బాధ! చూడు మేము ఫైనల్ ఎగ్జామ్స్ మాత్రమే రాశాం. రిజల్టు రావాలి. సర్టిఫికెట్ తీసుకోవాలి. ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసులో రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. ఈ తతంగమంతా ఒకటి రెండు రోజుల్లో జరిగిపోయేది కాదు. మేం మళ్లీ మళ్లీ వస్తాం. వచ్చినప్పుడల్లా నిన్ను కలిసి నీతో ఒకటి రెండు రోజులు గడుపుతాం" అన్నాడు నాయుడు.

"ఏదీ! ఒట్టేసి చెప్పండి" అని రాము చేయిచాచాడు.

రాధాకృష్ణ, నాయుడు ఒకరి తర్వాత ఒకరు చేతిలో చెయ్యివేసి భరోసా ఇస్తున్నట్టు చూశారు.

"మన స్నేహం యింతటితో ఆగిపోదు. ఇది కడదాకా కొనసాగుతుంది. తరచూ కలుసుకుందాం. ఉత్తరాలు రాసుకుందాం"

వాళ్ల మాటలకు రాము మనసు కొంత శాంతించింది. ఇద్దరివైపు సంతృప్తిగా చూశాడు. ఆ రోజు ముగ్గురూ కలసి బయటి కెళ్ళి ముచ్చటగా గడిపేరు. సినిమా చూశారు. స్టార్ హోటల్లో బిరియాని తిన్నారు.

* * *

హాస్టల్‌లోని మొత్తం స్టూడెంట్స్‌లో మూడువంతులకు పైగా సొంత ఊళ్లకు వెళ్లి పోవడంతో పరీక్షలయిన రెండో రోజుకే హాస్టల్ వాతావరణం మారిపోయింది. స్టూడెంట్స్‌తో కళకళలాడిన పరిసరాలు బోసి పోయి నిశ్శబ్దంగా తయారయ్యాయి. హాస్టల్ గదులన్నిటికీ తాళాలు వేయబడ్డాయి. అక్కడక్కడ నాలుగైదు రూమ్‌లు మినహా. నలంద, నాగార్జున హాస్టల్ బిల్డింగ్‌లలో మొత్తం పదిహేను మంది స్టూడెంట్స్ మిగిలి ఉంటారు. వారిలో రాము ఒకడు. రేపటితో మెస్ కూడా మూసివేస్తారు.

ఇంటికి వెళ్లాలనిపించడం లేదు రాముకి. సెలవుల్లో హాయిగా టవున్‌లో గడపాలనుంది. అందుకే ముందు జాగ్రత్తగా ఇంటికి ఉత్తరం రాశాడు. వారం రోజులవుతుంది ఉత్తరం రాసి, బహుశా ఇవ్వాళో రేపో అమ్మ సమాధానమిస్తుంది. తను అడిగిన డబ్బు ఎమ్.ఒ చేస్తుంది. అందుకే, ఏ క్షణాన పోస్ట్ మేన్ వచ్చి డబ్బు చేతిలో పెడతాడా అని ఎదురు తెన్నులు చూస్తున్నాడు రాము.

ముందు అందరిలాగే రాము కూడా ఇంటికి పోవాలనుకున్నాడు. ఎందుకో మళ్ళీ మనసు మారింది. ఇంటికెళితే మళ్లీ ఒకనాటి తన పాత రోజులు గడపాలి. అమ్మ పనికి పోయి సాయంత్రం వస్తుంది. ఉదయం పనికిపోయే ముందు చారు అన్నం వంట చేసి ఉంచుతుంది. నంజుకోవడానికి తెలగపిండి వడియం తప్ప ఏమీ వుండదు. ఆ చప్పిడి కూడు తిని తిని రాముకెప్పుడో మొహం మొత్తింది. ఎప్పుడోగాని మాంసం కూర ఉండదు. ఎక్కువగా ఎండు చేపల ఇగురు చేస్తుంది. ఉప్పు చేప రుచిగానే ఉన్నప్పటికీ తరచూ తినాలంటే మనసొప్పదు. అన్నిటి కంటే చీప్‌గా దొరికేది కోడిగుడ్డు. సమయానికి ఏది దొరక్కపోతే దగ్గరిలో ఉన్న కిరాణ కొట్టుకుపోయి కొని రెండు గుడ్లు తెస్తుంది నారాయణమ్మ. ఒక్కోసారి డబ్బులేక ఒక గుడ్డే వండుతుంది. ఆ వొక్కటి కూడా తను తినకుండా కొడుక్కి పెట్టేస్తుంది.

"అమ్మా! నువ్వు సగం తీస్కో" అని రాము గుడ్డులో సగం ఇవ్వబోయినా నారాయణమ్మ తీసుకోదు. ఇగురుతో సరిపెట్టుకుంటుంది. తండ్రి బతికున్నప్పుడెలా ఉండేదోగాని రాముకి ఊహ తెలిశాక అదే పద్ధతి వండిందంతా కొడుక్కే పెట్టి మిగిలింది తింటుంది నారాయణమ్మ.

"నాకెందుకురా! రెండు మెతుకులు సాలు. గంజి కలుపుకుని ఉల్లిపాయతో సరిపెట్టుకుంటాను. ఎక్కువ తిన్నా అరాయించుకోలేను. జబ్బు శరీరం ఎక్కువ తింటే ఆసుపత్రికి పరుగెత్తాల. ఆ మందులకి డాక్టరకి డబ్బు పోసేకంటే రేపటి నీ చదువుకి దాస్తే మంచిది" అంటూ అరకొర అన్నంతో సరిపెట్టుకుంటుంది నారాయణమ్మ.

మొదట్లో తల్లిమీద జాలి కలిగేది రాముకి. ఆ తర్వాతర్వాత జాలికి బదులు చిరాకు అన్పించేది. తన యీడు పిల్లలు ఏమేం తింటున్నారో.... ఎలాంటి బట్టలూ జోళ్లూ తొడుక్కుని హాయిగా ఆనందంగా గడుపుతున్నారో తెలిశాక తనమీద తనకే జాలి. తల్లి పరిస్థితి తెల్సినా తన అవస్థకు బాధ కలిగేది రాముకి. ఆ నరకం నుంచి ఎప్పుడెప్పుడు బయటపడదామా అనిపించేది. పై చదువులు పుణ్యమా అని ఇప్పుడా తిప్పలు లేవు. అన్నీ వేళకు ఠంచనుగా పెడుతున్నారు. హాస్టల్ తిండి, వాతావరణం రాముని మార్చివేసి తెలియని సుఖానికి అలవాటు చేశాయి. అందుకే

యింటికెళ్లే ప్రయత్నం చేయలేదు రాము.

"నారాయణమ్మా! చూశావా రాముకి ఎంత ముందుచూపో. చదువు మీద రాము శ్రద్ధ చూస్తుంటే వాడు రేపు నిన్ను అద్దాల మేడలో కూర్చోబెట్టి నీ కలలన్నీ తీరుస్తాడని నాకు పూర్తిగా నమ్మకం కలుగుతోంది. సెలవుల్లో ఇక్కడికొచ్చి ఖాళీగా తిరిగేకంటే రెండో సంవత్సరం పుస్తకాలు ముందుగానే కొని హాస్టల్లోనే ఉండి చదువుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఎలాగైనా రాము తెలివైనవాడు" మాస్టారు అన్నారు నారాయణమ్మతో.

"అందుకే గదా మేస్టుబాబూ! ఆడ్ని తవరు సెప్పినట్టు అప్పుసేసయినా సదివిత్తన్నాను. ఇంతకీ ఆడడిగిన డబ్బు పంపించారా బాబూ. షావుకారుగారు అడగ్గానే అడ్డు సెప్పకుండా అడిగినంతిచ్చారు" నారాయణమ్మ దగ్గుతూ గచ్చు నేల తుడుస్తూనే అంది. ధూళిరేగి మొదలైన దగ్గు పదినిమిషాలదాకా నారాయణమ్మను ఊపిరిసలపనివ్వకుండా చేసేసింది. దగ్గి దగ్గి ఉన్నపళంగా అక్కడే కూర్చుండిపోయింది ఆయాసంతో.

"అలా అవస్థపడేకంటే ధర్మాసుపత్రికైనా వెళ్లి డాక్టర్‌కి చూపించుకొమ్మని ఎన్నిసార్లు చెప్పినా వినవు! ఇదిగో చూడు నారాయణమ్మా! ఇవ్వాళ మనం గవర్నమెంటు ఆసుపత్రికి వెళదాం. నేను తీసుకెళతాను"

"ఎందుకు బాబూ! ఎప్పుడూ ఉండే దగ్గే కదా! ఈ మాతరం దగ్గుకి డాట్రు దాకా ఎందుకూ? "

"అలా వొద్దంటూ చిట్కా వైద్యంతో జబ్బు ముదుర్చుకుంటున్నావు నారాయణమ్మా! కనీసం పని చేయడానికైనా ఒంట్లో శక్తి ఉండొద్దూ" అన్నారు సుందరయ్య మాస్టారు మొండిగా మాట్లాడుతున్న నారాయణమ్మను వారిస్తూ.

అయినా నారాయణమ్మ వినదు. ఆసుపత్రికి పోతే ఒక పూట పని మానుకోవాలి. పని మానేస్తే కొడుకు చదువాగిపోతుంది. తనవల్ల కొడుకు చదువాగిపోవడం నారాయణమ్మకిష్టం ఉండదు. అదే గాని జరిగితే

## కల్యాణానికి కోతులు.. నరసింహాలు!

తరుణ సాహితీ సంస్థ ఓసారి 'స్థానం' వారికి సన్మానం తలపెట్టింది. సన్మానకర్తలుగా ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, నరసింహదేవర సత్యనారాయణలను నిర్వాహకులు ఆహ్వానించారు.. ఆ సందర్భంగా హనుమచ్ఛాస్త్రి, మాట్లాడుతూ 'ఓవైపు తరుణీ పాత్రధారి 'స్థానం'... మరోవైపు తరుణసాహితీ! ఈ తరుణీ తరుణుల నడుమ ఆచార్యత్వం.. పౌరోహిత్యం నిర్వహించేది నేనూ.. నరసింహదేవర వారూ! ఎలా ముగుస్తుందో ఈ కళ్యాణం' అంటూ చమత్కరించారు. సన్మానం పూర్తయ్యాక 'స్థానం'వారు హనుమచ్ఛాస్త్రి గారి అనుమానం తీరిందనుకుంటాను... ఈ కల్యాణానికి మనుషులతోపాటు కోతులు, నరసింహాలు వచ్చినా అంతా సజావుగానే జరిగింది. 'స్థానబలిమి' ఉంటే ఏ అడ్డంకులురావు మరి' అంటూ సరసంగా ఓ చెణుకు విసిరారు. 'స్థాన' బలిమి అంటూ తనగొప్ప చెప్పుకుని కోతులు, నరసింహాలని తమను ఆటపట్టించినా హనుమచ్ఛాస్త్రి, నరసింహదేవర ప్రేక్షకులతోపాటు హాయిగా నవ్వుకున్నారు.



ఇన్నాళ్ళూ పడ్డ శ్రమంతా వృథా పోతుంది. పైగా ఒక్కపూట కూడా పని మానెయ్యనని షావుకారు దగ్గర మాటిచ్చి మరీ డబ్బులు తీసుకుంది.

"అన్నట్టు బాబూ! నా కొడుక్కి డబ్బులు పంపినారా?" అనడిగింది నారాయణమ్మ ముచ్చెమటల్ని చినిగిన నేత చీర కొంగుతో ముఖంమీద అద్దుకుంటూ.

"ఓ! నువ్విచ్చిన రోజే ఎమ్.ఓ. చేశాను. ఈ పాటికి అందే వుంటాయి" అన్నారు సుందరయ్య మాస్టారు. స్వయంగా తనే ఊరెళ్ళి రాముకి డబ్బిచ్చి వద్దామనుకున్నారాయన. కానీ శరీరం సహకరించక ఆ ప్రయత్నం మానుకున్నారు. పోస్టాఫీసుకెళ్ళి రావడానికే ఆయన చాలా అవస్థపడాల్సి వచ్చింది.

* * *

డబ్బులు చేతిలో పడగానే కొండంత బలమొచ్చినట్లయింది రాముకి. రోజుకెంత ఖర్చు చేయాలి? ఎక్కడెక్కడికెళ్ళాలి? ఏమేం చూడాలి? ఇదీ ప్రస్తుతం రాము తపన.

సినిమా కెళ్ళాలి! ఏ సినిమా?! 'సీతాకోక చిలుక'

"రాము నువ్వు తప్పకుండా చూడాల్సిన సినిమా" చాలా మంది గతంలో చెప్పిన సంగతి రాముకి బాగా గుర్తుంది. ఇప్పటిదాకా ఆ సినిమా తను చూడలేదు. ఆ సినిమాలోని పాటలు తరచూ తన చెవిన పడుతూ ఊరిస్తున్నాయి. ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాడు. కానీ కుదరలేదు. హాస్టల్‌లో ఆ సినిమా చూడనిది తనే. అందరూ చూసి ఆ సినిమా పాటలు హమ్మింగ్ చేస్తున్నారు. తరచూ ఆ సినిమాలోని సీన్స్ గురించి చర్చించుకుంటున్నారు. అది చూసి రాము న్యూనతాభావంలో పడిపోయేవాడు. తన ఆర్థిక పరిస్థితికి తనే తిట్టుకునేవాడు. అందరూ తమ తల్లిదండ్రులు ఇస్తున్న డబ్బులు ఖర్చు చేసుకుంటారు. ఆ అదృష్టం తనకు లేనందుకు ఎంతో బాధపడుతుంటాడు. ఈ మధ్య ప్రతి విషయంలో తన తోటి స్టూడెంట్స్‌తో పోల్చుకుని మరిమరి మనసు చిన్నబుచ్చుకోవడం అలవాటు చేసుకున్నాడు రాము. అందుకే ఈ శెలవుల్లో జాలీగా గడపాలని గట్టిగా నిశ్చయించుకున్నాడు. రాము సినిమా హాల్‌కి చేరుకునేసరికి జనం అప్పటికే బాగా చేరి ఉన్నారు. సూపర్ హిట్ కావడంతో టిక్కెట్లు కోసం జనం కుమ్ములాడుకుంటున్నారు. రెండు నెలలుగా ఆడి ఈ మధ్యనే అర్ధ శతదినోత్సవం పూర్తి చేసుకుని నూరు రోజుల పండుగకు పరుగులు తీస్తోంది. రోజు రోజుకీ జనాదరణ పెరుగుతూనే ఉంది గాని తరగడం లేదు.

టిక్కెట్లు ఈజీగా దొరుకుతాయని రాము నిదానంగా బయల్దేరాడు. మ్యాట్నీ తర్వాత ఫస్ట్ షో కూడా మరో సినిమాకి వెళ్ళాలనుకున్నాడు. కాని థియేటర్‌కి చేరేసరికి పరిస్థితి తారుమారయింది. టిక్కెట్ దొరకడం అసాధ్యమనుకున్నాడు. అందుకే యథాలాపంగా క్యూలో నిలబడ్డాడు నిరాశగా. క్యూ కదులుతున్న కొద్దీ రాముకి ఒకటే టెన్షన్! టికెట్ దొరకొచ్చన్న ఆశ.

కాని ఆఖరికి నిరాశే మిగిలింది.

దురదృష్టం! తన వంతు వచ్చేసరికి బుకింగ్ క్లోజయింది. ఆశలన్నీ ఒక్కసారి నిరాశయ్యి నీరుగార్చేశాయి. జేబు నిండా డబ్బులుండడం వల్ల బ్లాకులో ప్రయత్నం చేద్దామనుకున్నాడు. కాని అసలు రేటుకి ఆరు రెట్లు అధికంగా అడగడంతో అనవసరమనిపించింది- ఒక్క సినిమాకే అంత డబ్బు ఖర్చు చెయ్యడం. అప్పటికే షో మొదలయిపోయి అర్ధ గంటకు పైగా కావస్తోంది. ఫస్ట్ షోకి వెళ్ళొచ్చులే అనుకుని థియేటర్ బయటికొచ్చి దగ్గర్లో ఉన్న మంచి హోటల్లో దూరేడు రాము.

సినిమా చూసి హాస్టల్‌కి చేరేసరికి రాత్రి పదకొండు గంటలయింది.

కళ్ళు మూసుకోగానే నిద్రలోకి జారిపోయే రాముకి ఆ రాత్రి సరిగ్గా నిద్ర పట్టలేదు. సినిమా చూశాక ఏం తిన్నాడో హాస్టల్‌కెలా చేరుకున్నాడో అతనికే తెలియదు. సినిమా అంతలా ఆకట్టుకుంది అతన్ని కనికట్టు చేసినట్లు మనసంతా ఏదోలా తయా

రయింది. సినిమాలోని పాటలు, సంగీతం, కథ, కథనం అన్నీ అద్భుతంగా అనుకున్న దానికంటే వంద రెట్లు ఎక్కువ ఆకర్షణీయంగా ఉన్నాయి. అందుకే రిలీజయి అన్ని రోజులయినా కలెక్షన్లు పెరిగిపోతున్నాయి. సినిమా ఆద్యంతమూ మంత్రించినట్టు ఏదో కొత్త లోకంలోకి తీసుకుపోయింది రాముని. అంత మంచి సినిమాని ఇన్నాళ్లూ చూడలేక పోయినందుకు లోలోపల ఎంతో బాధనిపించింది రాముకి. సినిమా చూస్తున్నప్పుడే నిశ్చయించుకున్నాడు. ఆ సినిమాలోని సాంగ్స్‌ని ప్రాక్టీసు చెయ్యాలని.

ఆ సినిమాలో అన్నిటికంటే ఎక్కువగా రాముని ప్రభావితం చేసింది హీరోయిన్ అందచందాలు. రూప లావణ్యాలు. కళ్ళు మూసినా తెరిచినా ఆమె ముఖారవిందమే మనసులో కదలాడుతోంది. ఏవేవో తీపిలోకాలలో తేలియాడేట్టు చేస్తోంది. మధురోహలతో, మత్తులో ముంచెత్తుతోంది. గతంలో ఎప్పుడూ ఇలాంటి అనుభూతి కలగలేదు. అందమైన అమ్మాయిలను చూసి కొన్ని నిమిషాలు మంత్రముగ్ధుడై ఆ తర్వాత మరిచిపోయేవాడు రాము. కానీ ఆ సినిమాలోని హీరోయిన్ అందం రాముని హిప్నటైజ్ చేసేసింది. మరువలేని మరో లోకాలకు తీసుకుపోయింది.

అలాంటి అప్సరస, అందాల రాశి అద్భుత సౌందర్యం తన సొంతమైతే? తనకు భార్య అయితే? తన జన్మ ధన్యమై పోదూ! అంతకు మించిన వరం జీవితంలో ఇంకేముంటుంది? ఆమె కోసం ఆ అందం కోసం ప్రాణాలయినా త్యాగం చెయ్యాలనిపిస్తోంది రాముకి.

మళ్ళీ ఆ సినిమా చూసి తీరాలని నిర్ణయించుకున్నాక గానీ మనసు తేలిక పడలేదు.

## ఆ గరళమే అమృతం

ఆత్మవిశ్వాసముంటే విషాన్ని గూడా అమృతంగా మార్చవచ్చంటారు పెద్దలు. ఆలోచన ఉంటే శంఖు నత్తల విషం పిండి ఔషధాలు తయారు చేయవచ్చని మెల్బోర్న్ యూనివర్సిటీ అసోసియేషన్ ప్రొఫెసర్ 'బ్రూస్ లివెట్' నిరూపించాడు. ఈయన, ఇతర శాస్త్రవేత్తలతో కలసి శంఖు నత్తలు కక్కే విషంపై పరిశోధనలు చేశాడు. సంవత్సరానికి ముప్పయిమంది సగటున ఈ నత్తలు వెదజల్లే విషానికి బలవుతారని అంచనా. ఈ నత్తలు వెదజల్లే విషం మనిషి నరాల్లో ప్రవేశించి ఓ రకమైన మత్తుని, హాయిని కలిగిస్తుంది. దాంతో మరణించే ముందరి చివరి క్షణాలు ఎంతో హాయిగా, నొప్పి అన్నది తెలియకుండా గడుస్తాయి. నత్తల విషంలోని ఈ లక్షణం శాస్త్రవేత్తలను ఆకర్షించింది. మత్తు కలిగించి నొప్పి తెలియనీయని పదార్థాన్ని నత్త విషం నుంచి వేరుచేశారు. ఈ మత్తు కలిగించే పదార్థానికి 'ఏసివి 1' అని పేరు పెట్టారు. ఇప్పుడు ఈ ఏసివి 1తో డయాబిటిస్, ఆర్థ్రైటిస్‌ల వల్ల కలిగే నొప్పులకు ఉపశమనం కలిగించే మందు తయారీని ఆరంభించారు. ఇంకా ఎపిలెప్సీ, అల్జీమియర్ వ్యాధుల తీవ్రతను తగ్గించవచ్చని కూడా శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. ఈ 'ఏసివి 1' వల్ల మామూలు మత్తుమందుల వాడకం వల్ల వచ్చే సైడ్ఎఫెక్ట్ కూడా ఉండవని అంటున్నారు. ఇది వింటుంటే ఏమనిపిస్తోంది? సృజనాత్మకత ఉంటే విషం కూడా అమృతమవుతుందని అనిపించడంలా? !



క్షణ క్షణానికి రగులుతున్న మోహావేశం చల్ల బడలేదు. ఆక్రమించుకున్న మనసులోని కోరి కను తీర్చుకోవాలన్న తపనకు అడ్డు తగిలే అవకాశం లేదు. పైగా మనసు తృప్తి పర్చుకో వడానికి సరిపడా డబ్బుంది జేబులో.

మర్నాడు రాము మరో ఆలోచన లేకుండా రూమ్‌కి తాళం వేసి రోడ్డు మీదకొచ్చాడు. ఉన్న వాటిలో మంచి బట్టల్ని తొడుక్కు న్నాడు. ఎందుకో రాముకి ఇన్‌షర్ట్ చేయాల నిపించింది. ప్రాక్టికల్స్‌లో తప్ప ఎప్పుడూ టక్ చేయని రాము ఇప్పుడు టిప్‌టాప్‌గా తయారయ్యాడు.

ఎవరో ఆత్మీయుల్ని చూడడానికి వెళ్తున్నట్టు అనిపిస్తోంది. రాత్రంతా విరహవేదనతో వేగి పోయిన హృదయం థియేటర్ చేరాకగాని చల్లబడలేదు. దూరమైన వ్యక్తికి దగ్గరయిన భావన. పోగొట్టుకున్నదేదో మళ్లీ పొందిన ఆనందం. వెతుకుతున్న మనిషి కళ్లముందు ప్రత్యక్షమైనట్టు... రాము తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

థియేటర్‌కి చేరింతర్వాత గాని రాముకి తెలియలేదు మార్నింగ్ షో ప్రారంభం కావ డానికి చాలా సమయముందని. ఇంకా మెయిన్ గేటు కూడా ఓపెన్ చెయ్యలేదు. ఆత్రంలో సమయం కూడా చూస్కోలేదు. పదకొండు గంటలకు మొదలయ్యే మార్నింగ్ షోకి తొమ్మిది గంటలకే థియేటర్ చేరుకు న్నాడు. రెండు గంటలు రెండు క్షణాల్లా జరి గాయి రాముకి. ఏమాత్రం విసుగనిపించ లేదు. పైగా తన ఊహా సుందరిని మళ్లీ చూడబోతున్న ఉత్సాహం.

పది గంటలకు మెయిన్ గేటు తెరిచారు. అప్పటికే జనం పోగయ్యారు. గేటు తియ్య గానే ఒక్కసారిగా ప్రవాహంలా థియేటర్ ప్రాంగణంలోకి ప్రవేశించి బుకింగ్ కౌంటర్ దగ్గర నిలబడి క్యూ కట్టడం ప్రారంభించారు. క్యూని అరికట్టే మనిషి లేకపోవడంతో మొదట జనం కౌంటర్ దగ్గరకు ఎగబాకుతూ తోపులాటలు మొదలు పెట్టారు. ఆ తోపులా టలో... జనం మధ్య ఇరుక్కుని నలిగిపో యాడు రాము. కొన్ని క్షణాలు ఊపిరి అందక గిలగిలలాడిపోయాడు. ప్రాణం కొట్టు కున్నంతగా భయపడ్డాడు. ఎలాగో మొత్తానికి టికెట్ సంపాదించేసరికి పోతున్న ప్రాణం లేచివచ్చినట్టయి చెప్పలేని ఆనందం కలిగింది. చేజారిపోతున్న ప్రియురాలి పొందుని అందు కున్నంత తృప్తి. ఠీవిగా హాల్లోకి ప్రవేశించి సీట్లో కూర్చున్నాడు. టిక్కెట్ కోసం నిన్నటి కంటే ఎక్కువ ఆపసోపాలు పడాల్సి వచ్చినా హాల్లోకి చేరగానే అవన్నీ ఇట్టే చెరిగిపో యాయి. చూసిన సినిమాయే అయినా మళ్లీ కొత్తగా చూస్తున్నట్టుంది రాముకి. నిన్నటి కంటే రెట్టించిన ఉత్సాహం అతనిలో ప్రవేశిం చింది. షో మొదలవుతున్నందుకు సూచనగా బెల్ మోగింది. రాము గుండెల్లో ఏదో తెలి యని గుబులు. అలా సెలవులు ముగిశాయి- ఆనందంగా హాయిగా.

6



కాలేజీ పునః ప్రారంభమైంది. మొదటి రెండు రోజులూ స్టూడెంట్స్ పూర్తిగా హాజరు కానం దున క్లాస్‌లు సరిగా జరగలేదు.

హాస్టల్స్ విద్యార్థులతో మళ్ళీ కళకళలాడు తున్నాయి. మెస్ కూడా ప్రారంభం కావ డంతో యధాతథంగా అన్నీ ఏర్పాటవుతు న్నాయి. ఉదయం ఏడున్నరగంటలకు టీ, టిఫిన్. మధ్యాహ్నం భోజనం నాలుగ్గంటలకి టీ. రాత్రి మళ్ళీ భోజనం.

సెలవుల్లో ఇంటి దగ్గర సకల సదుపాయా లతో సుష్టుగా భోంచేసే విద్యార్థులకు మళ్ళీ హాస్టల్ తిండి అనేసరికి అసంతృప్తిగా అనిపి స్తోంది. మళ్ళీ ఈ చప్పిడి కూడా.. సాంబారు మెతుకులు తినాలంటే సగం ఆకలి చచ్చిపో

తుంది. అయినా తప్పదన్నట్టుగా ఏదో తిన్నాంలే అనుకుంటున్నారు. ఇంట్లో అయితే రెండు మూడు కూరలు. రుచికరమైన పచ్చళ్ళు గడ్డపెరుగు.

కానీ రాములాంటి విద్యార్థులకు హాస్టల్ భోజనమే విందు భోజనంలా ఉంటుంది. హోటల్ భోజనం మరీ పసందుగా అనిపిస్తుంది. అందుకే సెలవుల్లో ఇంటికెళ్ళలేదు. హాయిగా ఎంజాయ్ చేశాడు. మిగతా వాళ్ళు తిండికోసం హాస్టల్లో చేరకపోయినా మూడు సంవత్సరాలూ ఎలాగోలా అడ్జస్టై కోర్స్ పూర్తి చేసెయ్యాలని తాపత్రయపడి చదువుతున్నారు. రాము మాత్రం మూడేళ్ళ తర్వాత తన గతి మామూలే అని ఇప్పట్నుంచే బెంగపడుతున్నాడు. ఒక ఏడాది గడిచిపోయింది అప్పుడే. ఇక రెండేళ్ళే యీ హాస్టల్ భోజనం అనుకుంటూ మరుక్షణాన మనసుని బలవంతంగా మార్చుకుంటున్నాడు రాము. ఇకపై ఈ రెండేళ్ళూ ఆనందం తప్ప వేరే ఆలోచనలతో మనసు బాధ పెట్టుకోకూడదని దృఢ నిర్ణయం చేసుకున్నాడు రాము.

"మీదేవూరు? " తన గదిలోకి కొత్తగా చేరిన స్టూడెంట్ సురేష్‌ని మాటల్లో దింపుతూ అడిగాడు రాము.

సురేష్ చదువుతున్న పుస్తకంలోనుంచి తల పైకెత్తి రాముకి సమాధానం చెప్పి మళ్ళీ చదువులో పడిపోయాడు. తనను కూడా ఏదైనా అడిగి మాటా మాటా కలిపే ప్రయత్నం చేస్తాడని రాము ఎదురు చూశాడు. కాని అతను వచ్చిన దగ్గర నుంచీ పుస్తకం వొదిలి పెట్టడం లేదు. అదే పనిగా చదువుతూ అదే ధ్యాసలో పడిపోతున్నాడు. పుస్తకాల పురుగులా ఉన్నాడు గురుడు అనుకున్నాడు రాము, సురేష్ వాలకాన్ని నిశితంగా గమనించి.

భోజనం ఊసెత్తడు. అరకొరగా నిద్రపోతాడు. కొంపలంటుకుపోతున్నట్టు ముఖంపై కాస్త నీళ్ళయినా జల్లుకోకుండా నిద్రలేవగానే పుస్తకం అందుకుంటాడు. గంటల కొద్దీ చదువుతాడు. చిన్నసైజు దుప్పటిలాంటి గుడ్డను నేలపైనే పర్చుకుని పడుకుంటాడు. వేసుకున్న లుంగీని అవసరమైతే కప్పుకుంటాడు. ఎప్పుడూ ఒకే ప్యాంటు, చొక్కా తొడుక్కుంటాడు. రెండో జత లేనట్టుంది. తనకంటే కటిక దరిద్రుడిలా కనిపించాడు సురేష్ రాము కంటికి. పుస్తకాలు మాత్రం లెక్కలెనన్ని షెల్ఫ్ నిండా ఉన్నాయి చిందరవందరగా. ఎప్పుడూ ఏ పుస్తకం తీస్తాడో... ఏ పేజీ ఎందుకు తిరిగేస్తాడో... చూస్తుంటే రాముకి పిచ్చెక్కినట్టు అనిపిస్తోంది. సురేష్ గురించి చూచాయగా మాత్రమే తెలుసు. సురేష్‌ది ఎలక్ట్రికల్ బ్రాంచి రెండో సంవత్సరం.

ఫస్టియర్ ఎవరో దూరపు బంధువులింట గడిపాడట. అక్కడ చదువు అనుకున్నంతగా సాగక హాస్టల్లో చేరాడు. సినిమాలు అంతగా అలవాటు లేదట. సురేష్‌కున్న ఒకే ఒక్క అలవాటు రోజూ పేపర్ చదవడం. హాస్టల్ లైబ్రరీకి రోజుకొక్కసారైనా వెళ్ళి చదువుతాడు. అది కూడా అర్థగంట మాత్రమే. రోజూ ఒకే టైమ్‌కి కాకుండా వీలున్నప్పుడే వెళతాడు.

కొన్ని రోజులు ఇద్దరూ ఒకే టైమ్‌కి టీ, టిఫిన్, భోజనం వగైరాకి వెళ్ళినా, తర్వాత సురేష్ సున్నితంగా తిరస్కరిస్తూ మీరెళ్ళండి నేను తర్వాత వస్తాను అనేవాడు రాముతో. అలా ఆ తర్వాత సురేష్ రాముల దారులు వేరయ్యాయి.

ఖాళీ అయిన పక్కగదుల్లో ఎవరెవరో కొత్త వాళ్ళు చేరారు. రాముకి విసుగ్గా, చిరాగ్గా ఉంటోంది. గదిలో ఇద్దరున్నా మళ్ళీ ఒంటరివాడిలా ఫీలవుతున్నాడు. యాంత్రికంగా క్లాసులకి హాజరుకావడం, పరధ్యానంగా పాఠాలు వినడం రాముకి చెప్పలేనంత చిరాగ్గా వుంటోంది. సెలవుల్లో చేసిన స్వేచ్ఛా విహారం పదేపదే గుర్తుకొస్తూ ఊరిస్తోంది. ఆ మజా మళ్ళీ అనుభవించాలని మనసు ఉబలాటపడుతోంది. చేతిలో డబ్బులుంటే అలాగే చేసేవాడు. సరిగ్గా అప్పుడే హాస్టల్ విద్యార్థులకి ప్రభుత్వం రాబోయే ఎలక్షన్స్‌ని దృష్టిలో పెట్టుకుని ప్రత్యేక స్కాలర్‌షిప్‌లను గ్రాంటు చేసింది. రాము ఉత్సాహంగా ఆ డబ్బు అందుకుని సిటీకి పోయి కనీసం రోజుకి

రెండు సినిమాల చొప్పున చూస్తూ మళ్ళీ ఎంజాయ్ చేశాడు. వేళకి తిండి దొరకు తోంది. తనివి తీరా పడుకోడానికి గది, గదిలో చక్కని బెడ్... జీవితమంతా ఇంకా యిలాగే సాగిపోతుందన్న భ్రమలో పడిపో యాడు రాము. ఆ తరుణంలో ఆ వయసు వేడిలో అలా గడపడం తప్పని చెప్పేవాళ్ళు గాని, మందలించి మార్గాన్ని మార్చే అవ కాశం గాని లేకపోవడం వల్ల రాము అలాగే గడిపేశాడు. ఆ సమయంలో జరిగిన కొన్ని సంఘటనలు రాము భావాలకు బలం చేకూ ర్చేలా చేశాయి. మరింత ఉత్సాహంగా ముందుకు దూసుకుపోయేలా చేశాయి.

* * *

కాలేజీ డే సందర్భంగా సాంస్కృతిక పోటీలు జరిగాయి. ఆటలతో పాటు పాటల పోటీ కూడా జరిగింది.

పోటీ ముందురోజున రాత్రి పన్నెండు దాకా రాము తన గళాన్ని విప్పి పాటలు ప్రాక్టీసు చేశాడు. ఎన్నో పాటలు పాడగల గడం వల్ల ఏ పాట పాడాలో అర్థం కాలేదు. అప్పుడే సురేష్ సలహా ఇచ్చాడు 'మదన మనోహర సుందర నారీ' అనే సాకీతో ప్రారం భమయ్యే పాట. రాము కూడా అదే బాగుం టుందని భావించి భావగాంభీర్యంగా మర్నాడు పాటల పోటీలో పాడాడు. పాడిన నంత సేపూ హాల్లో ఉన్న శ్రోతలు మైమరిచి పోయారు. కాలేజీ లైబ్రేరియన్ ఒక్కడే జడ్జిగా వ్యవహరించాడు.

అయితే ఏదో మొక్కుబడిగా పెట్టిన పాటల పోటీ చివరిలో ఊహించని చిచ్చురే పింది. అందరూ అనుకున్నట్టుగా అద్భుతంగా పాడిన రాముకి సెకెండ్ ప్రైజ్ ఇచ్చి చప్పగా పాడిన ఒకరికి ప్రథమ బహుమతి ప్రకటించ డమే అందుక్కారణం. విద్యార్థులంతా ఏకమై లైబ్రేరియన్ జడ్జిమెంట్‌ని తిరస్కరించారు. అరుపులు కేకలతో అల్లరి చేయడం ప్రారం భించారు.

"రాముకి ఫస్ట్ ప్రైజివ్వాలి"

"అవును! అదే కరెక్ట్" స్టూడెంట్స్ ఏక కంఠంగా అరిచారు.

అలజడి తారా స్థాయికి చేరి కాలేజీ ప్రిన్సిపాల్ దాకా వెళ్ళింది. లైబ్రేరియన్ ప్రిన్సిపాల్‌కి వివరణ ఇచ్చాడు. రాముకి సెకెండ్ ప్రైజ్ ఎనౌన్స్ చేయడానికి కార



ణాన్ని చెప్పాడు. రాము పాడింది యుగళ గీతం. సోలో సాంగ్స్ పోటీలో యుగళగీతం పాడకూడదని చెప్పి తన తప్పేం లేదని రూల్ ప్రకారమే జడ్జ్ చేశానన్నాడు ప్రిన్సిపాల్‌తో. ప్రిన్సిపాల్‌కి అతను చెప్పింది సమంజసంగా అనిపించింది. సరిగ్గా అప్పుడే ఓ స్టూడెంట్ అందరికంటే ముందుకొచ్చి "సార్! అసలు పోటీ ఏమిటి?!" ప్రిన్సిపాల్‌గారికేసి చూస్తూ అన్నాడు.

అదేం ప్రశ్న అన్నట్టు ప్రిన్సిపాల్‌గారు ఆ విద్యార్థిని అసహనంగా చూశాడు. "సాంగ్స్ కాంపిటీషన్"

"అంటే పాటల పోటీ అంతే కదా"! అని కొన్ని క్షణాలు లైబ్రేరియన్ ప్రిన్సిపాల్‌గార్ల ముఖాలలోకి దీక్షగా చూశాడు. ఆ కుర్రాడు.

"ఏం? సాంగ్స్ కాంపిటీషన్ అంటే ఏమిటో మాకు తెలియదనుకుంటున్నావా?" ప్రిన్సిపాల్ కోపంగా చూస్తూ అన్నాడు. అతనికేసి గుర్రుగా చూస్తూ.

"అహఁ! నా ఉద్దేశ్యం అదికాదు సార్! సర్క్యులర్‌లో మీరు ప్రకటించింది 'పాటల పోటీ' అనే కదా! అంటే పోటీదార్లు ఏ పాటయినా పాడొచ్చు అది యుగళ గీతమా, సోలో సాంగా అనేది కాదు ముఖ్యం. కేవలం మీరు పాటల పోటీ అని మాత్రమే అన్నారు. కాబట్టి ఏ పాటయినా అర్హమైనదే. ఆఖరికి ఏ భాషలోనైనా పాడొచ్చు ఎందుకంటే మీరు



కనీసం పోటీ ప్రారంభంలోనైనా ఫలానా పాట మాత్రమే పాడాలని నిబంధన విధించ లేదు" ఆ విద్యార్థి మాటలు జాగ్రత్తగా విని ప్రిన్సిపాల్ లైబ్రేరియన్ ముఖంలోకి తీక్షణంగా చూశాడు. లైబ్రేరియన్ 'నిజమే సార్' అన్నాడు తన తప్పిదాన్ని ఒప్పుకుంటూ.

"అలా అయితే స్టూడెంట్స్ చెప్పిందే కరెక్ట్. ఫస్ట్‌ప్రైజ్ రాముకే ఇవ్వాలి" అని నిర్ధారిస్తూ ప్రిన్సిపాల్ తుది తీర్పుగా అన్నాడు.

విద్యార్థులంతా ఒక్కపెట్టున హర్షధ్వానాలు చేశారు. ప్రిన్సిపాల్‌గారి మాటలతో సంతృప్తి చెంది చప్పట్లు చరిచారు.

అందరూ రాముని అభినందించారు. ఆ తర్వాత రీజనింగ్ తీస్తూ ఎదిరించి సాధించిన ఆ విద్యార్థి సాహసాన్నీ, ధైర్యాన్ని మెచ్చుకుంటూ "థేంక్స్ గురూ! మొత్తానికి అదరగొట్టేశావు. ధైర్యంగా వాదించి సాధించావు" అని పొగడ్తల్లో ముంచెత్తారు. షేక్‌హ్యాండిచ్చి వెన్నుతట్టేరు.

రాముకి చెప్పలేనంత ఆనందంగా ఉంది. గర్వంతో ఛాతీ ఉప్పొంగింది.

"మీ మేలు మర్చిపోలేను" రాము కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ అతడితో అన్నాడు.

"మీ పేరు?!" ఆ విద్యార్థినుద్దేశించి అడిగాడు.

"సూర్యారావు. అంతా సూర్యం అని పిలుస్తారు. సివిల్ బ్రాంచి సెకండియర్. నన్ను ఇంతకు ముందు చూడలేదా?" సూర్యం చలాకీగా చూసి అన్నాడు.

"చూసినట్టే ఉంది" అన్నాడు రాము.

"వారం రోజులయింది హాస్టల్లో చేరి. నలంద హాస్టల్ రూమ్ నెం. 42"

"అరె! నేనూ అందులోనే ఉంటున్నాను. రూమ్ నెం. 13" అన్నాడు రాము.

"నేను మీకు తెలియకపోయినా మీరు నాకు తెల్సు. మీరు బాగా పాడతారని ఇంతకు ముందు చాలా మంది చాలా సార్లు చెప్పుకుంటే విన్నాను. కానీ ఇంత అద్భుతంగా పాడతారనుకోలేదు. మీలో గొప్ప గాయకుడున్నాడు. మీకు మంచి భవిష్యత్తుంది కంగ్రా

చ్యులేషన్స్. మీ పాట విని నన్ను నేనే మర్చిపోయాను. తన్మయంలో తేలిపోయాను" అన్నాడు సూర్యం.

"థాంక్స్! మెనీ మెనీ థాంక్స్. మీ వల్లనే నాకీ రోజు పాటల పోటీలో ఫస్ట్‌ప్రైజొచ్చింది" రాము మెరిసే కళ్ళతో సూర్యం ముఖంలోకి చూశాడు ముచ్చటగా.

"ఇందులో నేను చేసిందేమీలేదు. మీ ప్రతిభే మిమ్మల్ని నెంబర్ వన్ చేసింది"

"మీరు ముందుకొచ్చి వాదించి మరీ నాకు న్యాయం చేశారు"

ఇద్దరూ హాస్టల్ వైపు నడుస్తూ మాట్లాడుకుంటున్నారు. మధ్యలో ఇతర హాస్టలర్స్ రాముకి అభినందనలు చెబుతూనే ఉన్నారు.

"అదరగొట్టావు గురూ"

"దంచి పారేశావు బ్రదర్"

"మన హాస్టలర్స్ పరువు నిలబెట్టావు"

"నువ్వు ఎప్పటికైనా సినిమా ఫీల్డ్‌లో రాణిస్తావు"

"అవున్నిజమే! నీలో ఆ టాలెంట్ వుంది. నీ పాట వింటే ఘంటసాల కూడా ఆశ్చర్యపోయేవాడు. ప్రయత్నం చెయ్ పైకొస్తావు"

అభినందనలతో రాము ఉక్కిరిబిక్కిరైపోయాడు.

రెట్టించిన ఉత్సాహం అతన్ని నేలపై నిలబడనివ్వడంలేదు. ఉత్సాహోతిరేకంతో ఆ రాత్రి రాముకి నిద్రపట్టలేదు సరిగ్గా.

* * *

"ఒరే! జగ్గు ఈ రోజు కాలేజీలో చాలా గమ్మత్తయిన ఇన్సిడెంట్ జరిగిందిరా!' ' అప్పుడే బయటినుంచి హాస్టల్‌కొచ్చి గదిలోకి ప్రవేశిస్తూ అన్నాడు సూర్యం.

పుస్తకం చదువుకుంటున్న జగ్గు ఆసక్తిగా చూశాడు - సూర్యం ముఖంలోకి

సూర్యం బట్టలు విప్పుకుని, లుంగీ తొడుక్కుని చాపపై జగ్గు పక్కనే కూర్చుని గోడకు జారిగిలపడి ఆ పుస్తకాన్ని అందుకున్నాడు. "లవ్ ఎట్ ఫస్ట్ సైట్.. టైటిల్ బాగుంది. ఎక్కడ కొట్టేశావురా? "

పుస్తకాన్ని విసురుగా సూర్యం చేతిలో నుంచి లాక్కుని "ముందు నువ్వు చెప్పాలనుకున్నది చెప్పు" అన్నాడు జగ్గు.

జగ్గు సూర్యానికి హాస్టల్‌మేటే కాదు క్లాస్‌మేట్ కూడా. ఇద్దరూ ఒకే ఊరు నుంచి వచ్చారు.

సూర్యం ఎప్పుడూ ఏదోపని పెట్టుకుని ఊర్లు తిరిగితే జగ్గు నవలలు చదువుతూ ఊహాలోకాల్లో ఊరేగుతుంటాడు.

సూర్యం పాటల పోటీ చివర జరిగిన సంఘటన గురించి చెప్పాడు వివరంగా.

"పాపం! ముందుగా ఫస్ట్ వచ్చిన తనెంత బాధపడ్డాడో" అన్నాడు జగ్గు కాస్త బాధని మిళితంచేస్తూ.

"అక్కడే నువ్వు పప్పులో కాలేశావు" అన్నాడు సూర్యం.

"పప్పులోనో.. ఉప్పులోనో... లేకపోతే తప్పులో కాలేశాననుకో" అన్నాడు జగ్గు విసుగ్గా ముఖం పెట్టి.

"అబ్బో! నీ క్యాడా ప్రాసొచ్చేసిందిరోయ్. చదివిన నవలలు ఊరికే పోతాయా! నువ్వు కూడా ఎప్పుడో ఒకప్పుడు గొప్ప కవి అయిపోయి అద్భుతమైన నవలలు రాసేస్తావు" అన్నాడు సూర్యం నవ్వుతూ.

"ఏడిశావులే! కవులు కవిత్వం రాస్తారు. నవలలు రాసేవారిని రచయితలంటారు"

"అంటే! కవులు నవలలు రాయకూడదని, రాయలేరని రూలేమైనా ఉందా? " అంటూ రీజనింగ్ తీశాడు సూర్యం.



జగ్గు చిరాగ్గా వాచీ చూసి "బాబూ! టైం పది దాటింది. నన్నొది లేసెయ్ నిద్ర తన్నుకొస్తోంది" అన్నాడు ఆవులిస్తూ.

"అయితే ఈ రోజు జరిగిన సంఘటన పూర్తిగా వినవా? " అన్నాడు సూర్యం జగ్గుతో.

జగ్గు ఆ రోజు ఒంట్లో నలతగా ఉందని కాలేజి ఎగ్గొట్టి హాస్టల్‌లోనే వుండిపోయాడు.

ఊర్లో అక్కడా ఇక్కడా తిరుగుతూ సూర్యం రోజూ ఏదో విషయాన్ని గాని సంఘటన గాని తెలుసుకుని కథలు కథలుగా చెబుతాడు. జగ్గు అతని మాటల్ని ఆసక్తిగా వింటూ ఎంజాయ్ చేస్తాడు. సూర్యం అంత చక్కగా వర్ణిస్తూ మాటలతో ఆకట్టుకుంటాడు ఎవర్నైనా. అయితే సూర్యం సూటిగా ఏదీ చెప్పడు. అదే జగ్గుకి విసుగు కలిగిస్తుంది. ఒక విషయం మొదలుపెట్టి మధ్యలో ఆపి సస్పెన్సులో పెట్టి మరో విషయంలోకి పోతాడు. అదే జగ్గుకి చిరాకు కలిగిస్తుంది. అసహనానికి గురి చేసి ఆసక్తిని చంపేస్తుంది.

"వింటావ్రా వింటాను. నీతో కలసి రూమ్‌లో ఉంటున్న ఖర్మకి వినక చస్తానా? !' ' అన్నాడు జగ్గు చిరాగ్గా ముఖం పెట్టి.

"అయితే నోర్మూసుకుని విను" అన్నాడు సూర్యం తలకిందనున్న తలగడని సర్దుకుంటూ

"నువ్వనుకున్నట్టు పాటల పోటీలో మొదటి ఫస్ట్‌ప్రైజ్ వచ్చినవాడు బాధపడలేదు. సంతోషించాడు. సెకెండ్ ప్రైజ్ తీస్కోడానికి అంగీకరించాడు కూడా"

"అంగీకరించక అడ్డు చెప్పగలడా ప్రిన్సిపాల్ తుది తీర్పు ఇచ్చాక" అన్నాడు జగ్గు వెంటనే.

"అదిగో! మళ్ళీ పొరబడుతున్నావు. అసలు నీకో సంగతి తెల్సా" అన్నాడు సూర్యం జగ్గుని మళ్ళీ సస్పెన్స్‌లో ముంచెత్తుతూ.

"బాబూ! బుద్ధి గడ్డితిని నీ గదిలో వున్నాను. రేపే ఖాళీ చేసేసి వేరే గదిలోకి పోతాను" అన్నాడు విసుగ్గా జగ్గు.

"రేపటిదాకా ఎందుకు! ఆ పనేదో ఇప్పుడే చేసెయ్" అన్నాడు సూర్యం జగ్గుని ఉడికిస్తున్నట్టుగా.

జగ్గు రోజుకి నాలుగు గంటలు తక్కువ కాకుండా ఎక్సర్‌సైజులు చేస్తాడు. ఉదయం రెండు గంటలు సాయంత్రం రెండు గంటలు. అతడి దైనందిన చర్యలలో వ్యాయామం ముఖ్యమైంది.

జగ్గు సంగతి సూర్యానికి బాగా తెలుసు. జగ్గు బలహీనతలూ, భయాలూ అన్నీ చిన్నప్పట్నుంచీ తెలుసు. స్కూల్ ఫైనల్ దాకా ఇద్దరిదీ ఒకే క్లాసు. ఇద్దరూ ఒకే వీధిలో ఆటపాటలతో పెరిగారు.

జగ్గు పేరుకు తగ్గట్టుగా బయటికి బండగా కనిపించినా మనసు చాలా సున్నితం. పిరికితనం ఎక్కువ. ఏదీ స్వతంత్రంగా చేయలేడు. తన తోడు లేకుండా హాస్టల్ మెయిన్‌గేటు దాటే సాహసం కూడా జగ్గు చెయ్యలేడని సూర్యానికి తెలుసు బాగా.

జగ్గు కాస్త నలుపురంగులో ఉన్నా అతనిది కండలు తిరిగిన శరీరం. రోజుకి నాలుగు గంటలు తక్కువకాకుండా ఎక్సర్‌సైజులు చేస్తాడు. ఉదయం రెండు గంటలు సాయంత్రం రెండు గంటలు. జగ్గు దైనందిన చర్యలలో వ్యాయామం ముఖ్యమైంది. ఏది చేసినా చెయ్యకపోయినా వ్యాయామం మాత్రం క్రమం తప్పడు. జగ్గు తన శరీర సౌష్టవానికి దారుఢ్యానికి ఇచ్చే ప్రాముఖ్యం దేనికీ ఇవ్వడు ఇవ్వలేడు. ఏళ్ళతరబడి చేసుకున్న అలవాటు అది.

ఒకపూట భోజనం చేయకపోయినా జగ్గు బాధ పడడు కాని వ్యాయామం మాత్రం

చేయడం మానడు. ఆఖరికి చదువు కూడా వ్యాయామం తర్వాతే. ఒకరోజు కాలేజీ ఎగ్గొట్టడం కూడా జగ్గుకి చాలా సాధారణమైన విషయమే. కాని వ్యాయామం ఒక్కపూట మానేస్తే ఏదో కోల్పోయినట్టు... పెద్ద పొరపాటు చేసినట్టు ఫీలయిపోతాడు. అలాంటి జగ్గు ఏదైనా పని తగిలితే సూర్యం సాయం లేకుండా చేయలేడు.

జగ్గుని చూసి అందరూ పక్కకు తప్పుకుంటారు. కండలు తిరిగిన శరీరం.. ఠీవైన నడక చూసే వారికి కాస్త జంకు, భయం కలుగుతాయి. కాని జగ్గు జనపిరికని, నలుగుర్లోకి వెళ్ళడానికి కూడా బిడియపడతాడని సూర్యానికి మాత్రమే తెలిసిన రహస్యం.

అందుకే సూర్యం తరచూ జగ్గుని ఆటపట్టిస్తాడు. నీ గురించి అందరికీ చెప్పేస్తానని భయపెడతాడు.

'ఓరేయ్ సూరి! ప్లీజ్ రా.. నీకు దండం పెడతాను. నీ కాళ్ళు పట్టుకుంటాను. అంత పని చెయ్యకురా' అంటూ జగ్గు సూర్యాన్ని బతిమిలాడుతాడు. నువ్వు చెప్పింది చేస్తానని చెప్పినట్టు వింటానని కాళ్ళ బేరానికొస్తాడు. ఇది ఇద్దరి మధ్యా జరిగే నిత్యకృత్యం.

జల్సాగా, హుషారుగా ఎక్కడెక్కడికో వెళ్ళి ఎంజాయ్ చేసే సూర్యానికి రూములో ఉంటే జగ్గుతో మంచి కాలక్షేపం. జగ్గు బలహీనత సూర్యానికి గొప్ప బలాన్నిస్తుంది. అందుకే మాటలతో భయపెట్టి ఆటలాడిస్తాడు జగ్గుని. వాస్తవానికి జగ్గు కంటే సూర్యం ఒక ఏడాది చిన్న. పైగా జగ్గులాగ బలమైన శరీరం కాదు. జగ్గు గట్టిగా తల్చుకుని ఒక దెబ్బ వేస్తే సూర్యం 'అమ్మా' అంటాడు. కానీ ఇంతవరకూ అలాంటి సాహసం జగ్గు చేసి ఎరుగడు. బహుశా చిన్నప్పట్నుంచీ సూర్యంపై ఒక రకమైన భావాలు ఏర్పడిపోవడం కారణం కావొచ్చు ముఖ్యంగా జగ్గులోని డిపెండెన్సీ, మెంటాలిటీ అతణ్ణి వెనక్కి తగ్గేలా చేసేస్తుంది.

"అయితే మొత్తానికి నీ వాదనలతో ఫస్టొచ్చిన గాయకుణ్ణి సెకెండ్ ప్రైజ్ సింగర్ని చేసేశావన్న మాట" అన్నాడు జగ్గు ఆఖరిగా.

"మరేంటనుకున్నావు. వీడు తల్చుకుంటే చేయలేనిది లేదు" సూర్యం గర్వంగా పోజు పెట్టి మీసం మెలేశాడు. ఆ సంగతి చెప్పిన తర్వాత సూర్యం ఇంకా బోల్డన్ని విషయాలు మాట్లాడాడు. జగ్గు తప్పదన్నట్టు అన్నీ ఆలకించాడు.

## 7



"నారాయణమ్మా! రాము ఉత్తరం రాశాడు" సుందరయ్య మాస్టారుగారు అప్పుడే వచ్చి అంట్లుతోమే పని ప్రారంభిస్తున్న నారాయణమ్మతో అన్నారు. కొడుకు ఊసెత్తగానే నారాయణమ్మ ముఖం వెలిగిపోయింది. ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది.

"ఏం రాశాడు బాబూ? బాగా సదూకుంటన్నాడా?!"

సుందరయ్య గారి వైపు ఆసక్తిగా చూస్తూ అడిగింది నారాయణమ్మ.

పగలంతా పనిలోకి పోయి సాయంత్రం బాగా పొద్దుపోయేక ఇంటికొస్తుంది నారాయణమ్మ. అందుకే రాముకి తన ఎడ్రస్ ఇచ్చారు సుందరయ్యగారు. తొలి రోజుల్లో రాము నేరుగా తల్లికే ఉత్తరం రాసేవాడు. పోస్ట్‌మెన్ ఉత్తరాన్ని నారాయణమ్మ లేకపోవడంవల్ల గుడిసెలోకి విసిరి వెళ్ళిపోయేవాడు. గుడిసె ముందు భాగంలో ఉన్న చిన్న మట్టి వాకిలిలో ఉత్తరం చూసి నారాయణమ్మ ఉత్తరం పట్టుకుని సుందరయ్య వద్దకు వెంటనే పరుగు పరుగున వచ్చి మాస్టారు చేత చదివించుకునేది. రాము రాసిన కొన్ని ఉత్తరాలు చాలా సార్లు నారాయణమ్మకు అందేవి కావు. అక్కడే ఆడుకుంటూ ఉండే పిల్లలు వాకిలి

లోని ఉత్తరాన్ని చూసి అదేదో పనికిరాని చిత్తు కాగితంలా భావించి చించిపారేశేవారు. ఒక్కోసారి కాగితం పడవలు తయారు చేసు కునే వారు. అలా చాలా ఉత్తరాలు నారాయ ణమ్మ దాకా రాలేదు. ఒకవేళ ఉత్తరం పిల్లలు కంటపడకుండా ఉంటే పనిలోనుంచి రాగానే ఉత్తరాన్ని చూసి పరుగున మాస్టారు గారి దగ్గరకు తీసుకొని వచ్చి చదివించుకునేది నారాయణమ్మ. అందులో, అంతకు ముందు తల్లికి రాసిన ఉత్తరాల సంగతి ప్రస్తావించే వాడు రాము. జవాబు ఎందుకు రాయడం లేదోనని మాస్టారు ఇంటి అడ్రస్‌కి రాసి అడి గేవాడు. ఆ తర్వాత రాము నేరుగా మాస్టా రుకే రాయడం మొదలెట్టాడు. తల్లి ఇంటి పని కోసం వచ్చాక మాస్టారు చదివి విషయం చెబుతారన్న ఉద్దేశ్యంతో.

"మొదటి సంవత్సరం పాసయ్యాడట" సుందరయ్య అన్నారు.

"నా కొడుకు పరీచ్ఛ పేసయ్యాడా? " అని నారాయణమ్మ మురిసిపోతూ "ఇంకా ఏవని రాసేడయ్యా? " అనడిగింది.

"ఏముంది. మామూలే. డబ్బులు పంప మని రాశాడు"

"అలాగే పంపిత్తాను. నా కొడుకు దూరంగా ఉన్న ఊర్లో డబ్బుల్లేక ఇబ్బంది పడకూడదు" అంటూ నారాయణమ్మ అంట్లు పనవగానే ఇంటికెళ్ళి కొంత డబ్బు తీసుకొచ్చి సుందరయ్యగారి చేతికిచ్చింది.

"నారాయణమ్మా! నీలాంటి తల్లి కడుపున పుట్టడం రాము అదృష్టం. కొడుకు కోసం నీ ఆరోగ్యాన్ని కూడా లెక్క చేయకుండా కాయ కష్టం చేసి చదివిస్తున్నావు. ఇప్పుడు నువ్విచ్చే డబ్బుకి వంద రెట్లు సంపాదించి నీ చేతిలో పెడతాడు"

"ఆడిచ్చే డబ్బులు నేనేం సేసుకుంతాను? ఇచ్చింది తిరిగి తీసుకోడానికా ఈ కర్సంతా! నా కొడుకు బాగా సదూకొని పైకొత్తే నాకంతే సాలు. అయ్యా! నాకు తెలీకడుగుతాను. నా కొడుకు సదివి ఏం సేత్తాడు? "

సుందరయ్యగారు చిన్నగా నవ్వారు నారా యణమ్మ మాటలకు.

"చెప్పాను కదా! పెద్ద ఉద్యోగం చేసి వేలకు వేలు సంపాదిస్తాడు"

"ఇంతకీ ఆడు సేసే ఉజ్జోగం ఏటయ్యా!"

"ఇంజినీరు. ఇంజినీరవుతాడు"

"అంటే ఏటండి? "

నారాయణమ్మ ప్రశ్నకు మాస్టారు కొన్ని క్షణాలు మౌనం వహించారు. ఆమెకెలా చెప్పాలో ఆయనకు అర్థం కాలేదు.

"తమరిలాగ పెద్ద మేస్త్రవుతాడా? !"

ఆయనకు మళ్లీ నవ్వొచ్చింది నారాయ ణమ్మ మాటలకి.

"రాము కొచ్చేది ఇంజినీరుద్యోగం. నేను చేసిన ఉద్యోగం పిల్లలకు పాఠాలు చెప్పడం. రాము పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో ఉద్యోగం చేస్తాడు. ఆ ఉద్యోగం నా కంటే చాలా పెద్దది. వేలకు వేలు జీతమొస్తుంది. నా జీతం ఏపాటిది? నేను రెండు నెలలు పని చేస్తే వచ్చిన జీతం రాము ఒక్క నెలకే సంపాదిస్తాడు"

ఆ మాటలకు నారాయణమ్మ ఆనందంతో తబ్బిబ్బయి పోయింది. అంతులేని సంతో షాన్ని పట్టలేక కళ్లనుండి ఆనంద భాష్పాలు రాల్చుకుంది. మాస్టారు కంటే పెద్ద ఉద్యోగం అనేసరికి నారాయణమ్మ తెగ సంబరపడిపో యింది. కొడుకుని అంత పెద్ద ఉద్యోగస్థుడిగా తనివి తీరా చూడాలని ఆమె అంతరంగం ముచ్చటపడి పోతోంది. ఆ రోజు కోసం కలలు కంటోంది.

* * *

పోస్ట్‌మేన్ దగ్గర డబ్బులు తీసుకుని ఒక టికి పది సార్లు నోట్లు లెక్క పెడుతూ మురి సిపోతున్నాడు రాము. అది గమనించిన సురేష్ "అన్నిసార్లు లెక్క పెడుతున్నావేంటి రాము. ఇంటిదగ్గర్నుంచి మీ అమ్మ పంపిందా? " అన్నాడు.

"ఇంత డబ్బు ఇంటి నుంచి ఎప్పుడైనా వచ్చిందా? ! ఇది నా స్వార్జితం. స్వయం ప్రతి భతో సంపాదించుకున్నది" అన్నాడు. రాము గర్వంగా ముఖం పెట్టి.

"ఎక్కడైనా పార్ట్ టైం పని చేస్తున్నావా?!" అడిగాడు సురేష్.

"పార్ట్ టైం పనా? నీ కంటికెలా కనిపిస్తున్నాను. అడ్డమైన పనులు చేసే అలగాగాడిననుకుంటున్నావా?! మనది జీనియస్ బుర్ర. అందరూ నన్ను 'కవిగాయక' అని పిలవడం నువ్వు వినలేదా? అవున్లే. నువ్వెలా వింటావు? అస్తమానం పుస్తకాల్తో కుస్తీలు పడుతుంటావు. నీకెలా తెలుస్తుంది? మనం రాసిన కథకి వచ్చిన పారితోషికం ఈ సొమ్ము" అంటూ రాము గర్వంగా మీసం మెలి వేస్తున్నట్టుగా అభినయం చేశాడు. ఈ మధ్య రాము మాట తీరులో విపరీతమైన మార్పు వచ్చింది. అది సురేష్ గమనిస్తూనే ఉన్నాడు.

"నువ్వు పాటలు పాడటమే కాదు. కథలు కూడా రాస్తావన్న మాట! వెరీ గ్రేట్" సురేష్ సంభ్రమంగా రాము వైపు చూస్తూ అన్నాడు. తన రూమ్మేట్ లో ఇంతటి ప్రతిభావంతుడైన కళాకారుడున్నాడని చాలా ఆలస్యంగా గ్రహించినందుకు సురేష్ బాధ పడ్డాడు. రాముని మనస్ఫూర్తిగా అభినందించాడు.

"కథలేం ఖర్మ. కవితలు కూడా రాస్తాను. నీకొక విషయం తెల్సా? స్కూలు ఫైనల్ లో స్టేజి ఎక్కి నటించాను. అప్పుడు అందరూ నన్నెంతగా పొగిడారో తెల్సా? మంచి నటుడ్నంటూ అప్పుడే ఆకాశానికెత్తేశారు"

"అంటే నువ్వు ఆల్ ఇన్ ఒన్ ఆర్టిస్టువన్న మాట"

"ఇప్పటికైనా తెల్సుకో. మనమెంత గొప్పో" ఠీవిగా కాలర్ ఎగరేస్తూ అన్నాడు.

తన కథకి బహుమతి రావడంతో రాము ఇంకా ఇంకా రాయాలని నిశ్చయించుకున్నాడు. అప్పట్నుంచీ కొనిగాని, లైబ్రరీకెళ్ళి అన్ని మ్యాగజైన్లూ చదవడం మొదలు పెట్టాడు. క్లాసు పుస్తకాలు పక్కన పెట్టేసి చాలా రోజులయ్యింది. ఇప్పుడు రాము మనసులో కొత్త ఆశ, ఆశయం చోటు చేసుకుంది. త్వరలో ఒక నవల కూడా రాసి అందరి మెప్పు పొందాలన్న తపన మొదలయ్యింది. అందుకే ఊళ్ళోకెళ్ళి లెండింగ్ లైబ్రరీలో నవలలు అద్దెకు తెచ్చుకుని దీక్షగా చదవడం ప్రారంభించాడు. ఆ క్షణాల్లో రాము తన చదువు అటకెక్కుతుందని ఇసుమంతయినా గ్రహించలేక పోయాడు. తన విద్యార్థి దశ గాడి తప్పి తప్పుడు మార్గంలో పడిందని గుర్తించలేక పోయాడు. తోటి విద్యార్థుల పొగడ్తలు, ప్రశంసలు ఆఖరికి రాముని వాస్తవానికి దూరంగా నెట్టి పారేశాయి. దాంతో రాము తన తప్పేంటో తెలుసుకునే స్థాయి దాటిపోయాడు. పైగా అందరికంటే తనొక ప్రత్యేకమైన వ్యక్తిగా భావించుకునే భ్రమల్లో పడిపోయాడు.

* * *

"నమస్కారం సార్!" మెస్ హాల్ లోకి ప్రవేశించగానే తనకేసి అభిమానంగా చూసి నమస్కరించిన వ్యక్తి వైపు చూశాడు రాము. మెస్ సూపర్‌వైజర్ గోవిందరావు.

అంత మందిలో తనను ప్రత్యేకంగా చూడడం, అభిమానం కురిపించడంతో రాము ఏదో తెలియని గొప్పతనం ఫీలయ్యాడు. తోటి విద్యార్థులంతా తన దగ్గర చాలా అల్పులుగా అగుపించారు. ఎవరిలోనూ మచ్చుకైనా లేని గొప్పతనం తనలో ఉన్నందుకు గర్వంగా ఫీలయ్యాడు.

"పాటల పోటీలో ఫస్ట్ ప్రైజ్ ప్రిన్సిపాల్ చేతులమీదుగా అందుకోవడం మొన్న ఫంక్షన్ లో చూశాను. స్టేజిపై మీరు అద్భుతంగా పాడిన పాట కూడా విన్నాను. ఎక్సలెంట్. ఎప్పటికైనా మీరు సినీ సింగర్ అయి తీరుతారు" పొగుడుతూ అన్నాడు గోవిందరావు.

'ఒక్క సినీ సింగర్‌నే కాదు. సినీ రైటర్నీ, నటుడ్నీ కూడా అవుతా'నని చెప్పాలనిపించింది రాముకి.

భోజనం ముగిసేదాకా గోవిందరావు రాము దగ్గరే నిలబడి అన్నీ స్వయంగా సర్వర్‌లను కేకలు వేసి మరీ వొడ్డించేట్టు జాగ్రత్త పడ్డాడు.

"సార్! నాకూ పాటలంటే చాలా ఇష్టం. నేనూ కొద్ది కొద్దిగా పాడతాను"

అలాగా అన్నట్టు చూశాడు రాము గోవింద

రావు ముఖంలోకి.

"ఆ రోజు స్టేజి మీద పాడిన పాట నాకు నేర్పండి!"

"అలాగే" అంటూ రాము లేచాడు భోజనం ముగించి.

* * *

"ఎక్సలెంట్... మార్వలెస్... నీలో ఇంత ఆర్ట్ ఉందనుకోలేదు. కాలేజ్ డే కాంపిటీషన్లో పాల్గొనలేదా?" రాము ఆశ్చర్యంగా చూస్తూ నాగరాజుని అడిగాడు. రాము చేతిలో నాగరాజు వేసిన కలర్ పెయింట్ ఉంది.

"లేదు" నాగరాజు జవాబు.

"చాలా తప్పు చేశావ్. పోటీలో పాల్గొంటే తప్పకుండా నీకే ఫస్ట్ ప్రైజ్ వచ్చేది" పెయింట్ కేసి చూస్తూ అన్నాడు రాము.

"అలా బుద్ధి చెప్పండి సార్" నాగరాజు రూమ్మేట్ సాంబ అన్నాడు.

"నేనెంత చెప్పినా విన్లేదు. పైగా పోటీలంటే భయమట"

"భయమెందుకు? ప్రైజ్ రాదనా!?"

"అది కాదు! పరీక్షలు కదా! పెయింటింగ్లో పడిపోతే చదువు దెబ్బతింటుందని..." నాగరాజు అన్నాడు.

"అంటే రాముగారికి స్టడీస్ ఉండవా? పరీక్షలకు నువ్వొక్కడివే అటెండవుతున్నావా?!" అన్నాడు సాంబ వెంటనే.

"చూడు నాగరాజు! దేని పని దానిదే... నేను పరీక్షలూ రాశాను. పోటీల్లోనూ పాల్గొన్నాను! కళ ఉన్న వాడు దాన్ని దాచిపెట్టకూడదు. అయినా అది దాచేస్తే దాగేది కాదనుకో. మనమెంత మట్టు పెట్టినా బయట పడుతుంది. అవకాశం వచ్చినప్పుడు కళను ప్రదర్శించడం కళాకారుడి ప్రథమ కర్తవ్యం. అప్పుడే ఆ కళకు సార్థకత" అన్నాడు రాము సీరియస్గా ముఖం పెట్టి. తన మాటలకు తనే గొప్పగా ఫీలవుతూ.

"నా పిచ్చి గీతల సంగతి పక్కన పెట్టండి. ఇంతవరకూ మీ పాట వినే అవకాశం, అదృష్టం నాకు దక్కలేదు. ఒక పాట పాడండి" నాగరాజు ప్రాధేయపడుతూ అన్నాడు.

"ఇవి పిచ్చి గీతలా? చక్కటి కళాఖండాలు"

నాగరాజు ఆ సంవత్సరమే మెకానికల్ బ్రాంచి ఫస్టియర్లో జాయినయ్యాడు. సాధారణంగా జరిగే యూనిట్ టెస్ట్ల కోసం పెయింటింగ్ కాంపిటీషన్ మిస్సయ్యాడు.

నాగరాజు గిరిజనుడు అయినా అతన్ని చూస్తే ఎవరూ అలా అనుకోరు. తెల్లని మేని ఛాయ. చిన్న చిన్న ఉంగరాలతో నల్లగా నిగనిగలాడే గుబురు జుట్టు. అందంగా, ఆరోగ్యంగా, నీట్గా ఉంటాడు.

"ఫస్టియర్లో మనం అంతగా చదవాల్సిన పని లేదు. నేనయితే అస్సలు పుస్తకమే ముట్టలేదు. అయినా పాసయ్యాను. నువ్వు అస్సలు ప్రాధాన్యం లేని యూనిట్ టెస్ట్ల కోసం మంచి అవకాశం పోగొట్టుకున్నావు. ఇంకెప్పుడూ అలా చెయ్యనని మాటివ్వు

కళ ఉన్నవాడు దాన్ని దాచిపెట్టకూడదు.
అయినా అది దాచేస్తే దాగేది కాదనుకో.
మనమెంత మట్టుపెట్టినా బయట
పడుతుంది. అవకాశం వచ్చినప్పుడు కళను
ప్రదర్శించడం కళాకారుడి ప్రథమ కర్తవ్యం

నాకు" అని చేయి చాచాడు రాము. నాగరాజు భరోసా ఇస్తున్నట్టుగా రాము చేతిలో చెయ్యి వేశాడు. తర్వాత మళ్లీ అర్థిస్తున్నట్టుగా ముఖం పెట్టి "ఒక్క పాట పాడరా" అనడిగాడు.

రాము గొంతు సవరించుకుని పాటందుకున్నాడు. ఒక పాట అనుకుంటే పది పాటల దాకా పాకింది పాట కచేరి. రాము పాడటం మొదలు పెడితే అంతే. వినేవాళ్ళకి ఓపికుండాలి గాని అతని గొంతుకి అలుపూ అదుపూ ఉండదు. చాలా రోజులుగా నాగరాజు రాముని తన రూమ్కి రమ్మని ఆహ్వానిస్తునాడు. రాము ఆ ఆహ్వానాన్ని పెద్దగా పట్టించుకోలేదు. అడవిలో పుట్టి పెరిగిన ఒక గిరిజనుడి ఆర్ట్ చూడడానికి ప్రత్యేకంగా రూమ్కి వెళ్లడం ఏమిటని నిర్లక్ష్యం చేశాడు. తీరా వెళ్లాక తన

ఆలోచన ఎంత తప్పో అర్థమయింది.

అంతకు ముందు, భోజనం ముగించుకొని బయటికొచ్చిన రాముని చూసి నాగరాజు పల కరించాడు.

"ఈ రోజెలాగైనా మీరు నా రూమ్‌కి రావాలి" నాగరాజు అభ్యర్థనగా అన్నాడు.

"ఎందుకు? నీ బొమ్మలు చూడటాని కేనా? " అన్నాడు రాము.

"అవును".

రాము అతని వెంట నడిచాడు అయిష్టం గానే. వీడు బొమ్మలు గీయడమేమిటి? ఆ బొమ్మలు చూడడానికి తను స్వయంగా వెళ్ల డమేమిటి? ! ఒకప్పుడు తన గాత్రాన్ని ఇతర గాయకుల ముందు ప్రదర్శించడానికి తెగ ఆరాటపడేవాడు. తన గొప్ప తనాన్ని నలుగు రికీ చాటి చెప్పాలని ఏ కళాకారుడైనా తాపత్ర యపడతాడు. అందుకే నాగరాజు బాధనర్థం చేసుకుని బలవంతంగా అతడి గదికి వెళ్లాడు.

మొదట ఆ బొమ్మలు చూసి ఆశ్చర్యపోతూ "నిజంగా ఈ బొమ్మలు నువ్వు వేసినవేనా? " అని నాగరాజు ముఖమ్మీదనే అడిగేశాడు. నాగరాజు మనసు చివుక్కుమంది. ఆ వెంటనే తేరుకుని కాగితం పెన్సిల్ తీసుకుని రాము చూస్తుండగానే ఒక బొమ్మను అలవో కగా గీశాడు. అది చూసి రాము ఆశ్చర్యపో యాడు. నాగరాజునీ అతని ఆర్ట్‌నీ ఇన్నాళ్లూ తక్కువగా అంచనా వేసినందుకు లోలోన బాధ పడ్డాడు. ఆ రోజునుంచీ నాగరాజుతో స్నేహం పెంచుకున్నాడు రాము.

8



ఎవరో తలుపు తడుతున్న శబ్దానికి దీక్షగా చదువుకుం టున్న సురేష్ అసహనంగా లేచి వెళ్ళి గొళ్లెం తీశాడు.

ఎదురుగా సూర్యం నవ్వుతూ కనిపించాడు.

"మళ్లీ మీరేనా! ఎవరో అనుకున్నాను. రాము ఇంకా నిద్ర పోతూనే ఉన్నాడు! ఆయ నంతే! మెలకువగా ఉంటే పాటలు లేకుంటే నిద్ర. అఫ్‌కోర్స్ ఆ రెంటికీ మధ్య ఆయన చేసే పని ఇంకొకటుందనుకోండి" అని నవ్వుతూ సూర్యంని లోపలికి ఆహ్వానించాడు సురేష్ గడగడా మాట్లాడేస్తూ.

"ఏంటా పని? " అన్నాడు సూర్యం కూర్చుంటూ.

"పుస్తకం చదవడం. అహఁ! క్లాసు పుస్తకం కాదు లెండి" అని మళ్లీ నవ్వేడు.

సూర్యం అతని కోసం రావడం ఇది మూడోసారి. నిద్ర లేపడం ఎందుకులే అను కుంటూ రెండుసార్లు వెనక్కి తిరిగి వెళ్లిపో యాడు.

"సాధారణంగా రాము తనంతట తాను నిద్ర లేవడు. ఎవరో ఒకరు లేపాలి! పడుకునే ముందే చెప్పేస్తాడు తనను డిస్టర్బ్ చేయొ ద్దని" అన్నాడు సురేష్ పుస్తకం మడిచి.

"మరి టిఫిండీ, కాలేజీ? " అన్నాడు సూర్యం ఆశ్చర్యంగా ముఖం పెట్టి.

"కాలేజీ సంగతి అటుంచితే టిఫిండికి మాత్రం ఖచ్చితంగా లేపమని చెబుతాడు" సురేష్ నవ్వుతూ చెప్పాడు.

ఇన్నాళ్లూ పాటలు పాడటం ఒక్కటే రాము ఎక్కువగా చేసే పని అనుకున్నాడు సూర్యం. కానీ ఇప్పుడు తెలిసింది రాము మొద్దు నిద్ర గురించి. ఆ సంగతి మొదటిసారి వచ్చినప్పుడే తెల్సుకోలేక పోయినందుకు సూర్యం తనను తానే నిందించుకున్నాడు.

గాఢ నిద్రలో ఎవరో పిలిచి తట్టి లేపుతు న్నట్లనిపిస్తే రాము చిరాగ్గా అటు ఇటు కది లాడు.

"రామూ... నేను, సూర్యాన్ని" అంటూ అరుస్తున్న సూర్యంని సురేష్ బలవంతంగా పక్కకు లాగేశాడు. దాంతో సూర్యం పట్టు తప్పి కింద పడ్డాడు. ఆ దెబ్బకి 'అమ్మా' అని అరిచేడు సూర్యం. "ఏంటండీ! అలా తోసే

# చతుర భాషితాలు

✦ ఎవరైతే విద్యుక్త ధర్మాన్ని తన లక్ష్యంగా తీసుకుంటాడో అతడు సత్క్రమ పథంలో సంచరించేందుకు దోహదం చేసే భగవంతుని కృపపై ధైర్యంగా నమ్మకం పెట్టుకోవచ్చు. – బ్లైసీ పాస్కల్

✦ అందంగా లేమని అద్దాన్ని నిందించడం వంటిదే పరిస్థితుల మీద నెపం వేసి తప్పుడు పనులు చేయడం! – మైకేల్

✦ నీ రహస్యాన్ని గాలికి చెప్పావనుకో- గాలి దాన్ని చెట్లకు చెప్పిందని నీవు ఆరోపించకూడదు. – ఖలీల్ జిబ్రాన్

✦ సానుభూతి సంపాదించుకునేందుకు నీవు ప్రాణులలోకి చేరి ఉండాలి. ప్రశంస పొందేందుకు అందమైన వస్తువుల్లో చేరాలి. వాటిని చూడగలగాలి. – రస్కిన్

✦ సత్యాన్వేషి ధూళి కంటే వినయంగా ఉండాలి. ప్రపంచం తన పాదాల కింద ధూళిని తొక్కుతుంది. అటువంటి ధూళి కూడా తనను తొక్కేందుకు సత్యాన్వేషి వినమ్రతతో సిద్ధం కావాలి. – మహాత్మాగాంధీ

✦ ఒకళ్ళనొకళ్ళు చూచుకోవటం కాదు - ఇద్దరూ కలిసి ఏకోన్ముఖంగా చూడటమే 'ప్రేమ' అనిపించుకుంటుంది. – ఎక్స్ ఫెరీ

✦ గొప్ప అదృష్టం (భాగ్యం) కలసి వచ్చినపుడు నీవు అమితంగా సంతోషించటం కానీ, దురదృష్టం వెంటాడినపుడు అత్యంత విషాదం అనుభవించటం కానీ ఉండదు. కారణం లౌకిక స్థితి అశాశ్వతం. – సోక్రటీస్

✦ సత్యము మీకు సాక్షాత్కరించకపోవచ్చు కానీ సత్యాన్వేషణ మిమ్మల్ని స్వాతంత్ర్యోపాసకునిగా నిలుపుతుంది. – క్లారెన్స్‌డారో

శారు?" అన్నాడు కాస్త కోపంగా.

"లేకపోతే ఇంతకంటే పెద్ద దెబ్బే తగిలి ఉండేది".

"ఏం ఎందుకని? !" ఆశ్చర్యంగా చూశాడు సూర్యం.

"ఎందుకో నేను చెప్పడం కంటే మీకు మీరే ప్రాక్టికల్‌గా తెల్సుకుంటే బాగుంటుంది" నవ్వుతూ అన్నాడు సురేష్.

ఆ మాటలు మొదట అర్థంకాక అయోమయంగా చూశాడు. ఆ తర్వాత బల్బ్ వెలిగింది.

"అర్థమయ్యింది! కాళ్లవైపు నిలబడి లేపితే ఒక తాపు తంతాడు. అంతేనా?" అన్నాడు సూర్యం నవ్వుతూ.

"మామూలుగా కాదు! గాడిద తన్ను తంతాడు. ఆ దెబ్బకు ఎవరైనా అబ్బా అనాల్సిందే".

"అహా! అంత పవర్‌ఫులా? గురుడుకి ఆ విద్యలో కూడా ప్రావీణ్యం ఉందన్నమాట" అని నవ్వి సూర్యం నీళ్ళు తీస్కుని రాము ముఖంపై చిలకరించాడు.

రాము లేచాడు. సూర్యాన్ని చూస్తూ ఆవులించాడు.

"హమ్మయ్యా! బతికి పోయాం. 'కౌసల్యా తనయా' అంటూ మేల్కొలుపు పాడితేగాని లేవవనుకున్నాను. అభినవ ఘంటసాలవి కదా!" ఎగతాళిగా అన్నాడు సూర్యం.

"ఏంటి విశేషం" అన్నాడు రాము మళ్లీ ఆవులిస్తూ.

"చాలా పెద్ద విశేషమే! ముందు లేచి కార్యక్రమాలన్నీ పూర్తి చెయ్" తొందర చేశాడు సూర్యం.

అర్ధగంటలో స్నానపానాదులు పూర్తి చేసి "ఇప్పుడు చెప్పు?" అన్నాడు రాము.

"ఇక్కడ కాదు. ఎలాగూ కాలేజీ లేదుగా! రా! అలా బయటికి పోయి మాట్లాడుకుందాం"

ఇద్దరూ రూములోనుంచి బయటికొచ్చారు. అలా హాస్టల్ వెనుక్కి వెళ్లారు.

చల్లని చిరు చిరు గాలులు మనసుల్ని ఆహ్లాదపరుస్తున్నాయి. కొన్ని క్షణాలు ప్రకృతి సుఖానికి పరవశులై ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

ఆ తర్వాత ముందుగా సూర్యం మాట్లాడాడు. "నీకొక శుభవార్త చెప్పాలి!"

"శుభవార్తా? ! ఏమిటి?" రాము ఆశ్చర్యంగా చూశాడు.

"రాష్ట్రస్థాయిలో నీ గాన కళా ప్రతిభను ప్రదర్శించే అవకాశం"

"నిజంగానా? ఎప్పుడు? ఎక్కడ? అలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు రాము ఆత్రంగా.

రాష్ట్ర స్థాయి పాటలపోటీలో తన ప్రతిభను చాటి చెప్పాలని రాముకి చాలా కాలంగా నలుగుతున్న కోరిక.

సూర్యం చిన్న రసీదు కాగితాన్ని జేబులో నుంచి తీసి రాము చేతికిచ్చాడు.

"ఏమిటిది?"

"సరిగ్గా చూడు! నీకే తెలుస్తుంది"

రసీదులో ఇరవైరూపాయలు చెల్లించినట్లు సంతకం చేసి ఉంది. అందులో పోటీ ఎక్కడో, ఎప్పుడో కూడా వున్నాయి.

"పోటీ ఎల్లుండే ఎలా?" దిగాలుగా అన్నాడు రాము.

"ప్రాక్టీసు గురించేనా నీ బెంగ? !"

రాము అవునన్నట్టు తలూపాడు.

"నిరంతరం ప్రాక్టీస్ చేసే నీకు వేరే ప్రాక్టీస్ కావాలా?"

"అలా అని కాదు. ఇది రాష్ట్రస్థాయి పోటీ. ఎందరో ఉద్దండ పండితులొస్తారు"

"నిన్ను మించిన స్వరం గలవాడు ఉన్నాడంటే నేనొప్పుకోను. విజయం నీదే. పోటీకి సిద్ధంగా ఉండు"

సూర్యంకేసి కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు రాము. తన మీద అతను చూపిస్తున్న అభిమానానికి, నమ్మకానికి ఎంతో పొంగిపోయాడు. వెంటనే జేబులో ఉన్న ఇరవై రూపాయల నోటు తీసి ఇవ్వబోయాడు. సూర్యం నిరాకరించాడు.

ఆ తర్వాత ఇద్దరూ కలిసి ఆలోచించారు.

ఏ పాట పాడాలోనని. రాము తనకొచ్చిన సోలో సాంగ్స్ కొన్ని పాడి వినిపించాడు. వాటిలో 'నీ సుఖమే నే కోరుతున్నా' అనే పాటను సూర్యం ఎంపిక చేశాడు. రాము కూడా అదే పాట పాడాలనుకుంటున్నాడు.

అక్కడికక్కడే ఆ పాటను మళ్ళీమళ్ళీ పాడి వినిపించాడు రాము.

రాము పాడుతుంటే సూర్యం తాదాత్మ్యం చెందిపోతూ కళ్ళు మూసుకుని విన్నాడు. తనకు ఊహ తెలిసినప్పట్నుంచీ రాము పాటలు పాడుతున్నాడు. ఎంతో మంది తన గాత్రాన్ని మెచ్చుకున్నారు. పొగిడారు. కానీ ఇంతగా స్పందించే వ్యక్తి, ప్రోత్సహించే మనిషి ఇంతవరకూ రాముకి తారసపడలేదు. అదే విషయాన్ని రాము సూర్యానికి చెప్పాడు.

"నీ ప్రోత్సాహం నాలో వెయ్యి రెట్లు బలాన్నిస్తోంది. నీలాంటి వాడు నాకు ఆప్తమిత్రుడయినందుకు చాలా ఆనందంగా ఉంది సూర్యం"

"నువ్వు మట్టిలో మాణిక్యానివి. నిన్ను సానబెట్టి మెరిసేలా చేసేవాడు లేకపోతే అజ్ఞాత గాయకుడిగా మిగిలిపోతావు. చూస్తూండు. నిన్ను గొప్పవాణ్ణి చేస్తాను. నీ ప్రతిభ నలుదిశలా వ్యాపించేలా చేస్తాను" సూర్యం మాటలకు రాము తననుతానే మర్చిపోయాడు.

ఆ రాత్రి రాముకి నిద్రపట్టలేదు. మంచం మీద అటూ ఇటూ అసహనంగా కదులుతున్నాడు. పాటల పోటీకి సంబంధించిన ఆలోచనలతో మనసంతా నిండిపోయింది.

"ఫస్ట్ ప్రైజ్ నీదే. నీ కంటే బెస్ట్ సింగర్ ఉంటాడంటే నేను నమ్మను. స్టేట్ లెవెల్ సాంగ్స్ కాంపీషన్లో నువ్వు అదరగొడ్తావు. నీ మీద నాకు నమ్మకముంది. చూస్తూవుండు. నీ టేలంట్‌ని నలుదిశలా వ్యాపింపజేసి, నిన్ను గొప్పగాయకుణ్ణి చేస్తాను." సూర్యం మాటలు పదే పదే రాము మనసులో ప్రతిధ్వనిస్తున్నాయి.

సూర్యం మాటలు రాము మస్తిష్కాన్ని తొలిచివేస్తున్నాయి. మత్తులో ముంచెత్తుతు

## సత్యభామ సమయస్ఫూర్తి

ఓసారి శ్రీకృష్ణ తులాభారం నాటకం వేస్తున్నారు.. 'మీరజాలగలడా..' అంటూ సత్యభామ వేషంలో 'స్థానం' ప్రేక్షకుల్ని ఉర్రూతలూగించారు. ఆనందంలో ఉక్కిరిబిక్కిరి చేశారు. చివరి సీనులో రుక్మిణి 'ఫలమో.. ఘనరసంబో..' పద్యం చదివి త్రాసులో తులసి ఆకును వేయాలి.. అవతలివైపు కృష్ణుడు కూర్చున్న త్రాసుపళ్లెం పైకిలేవాలి. అలా లేవడంకోసం పైన ఓకప్పీ. తాడు ఏర్పాటుచేసి పైకి లాగడానికి ఇద్దరు మనుషుల్ని పెట్టారు నాటకం కంపెనీవాళ్లు. అయితే ఆ రోజు రుక్మిణి పద్యంపాడి.. తులసీదళం వేసినా కృష్ణుడున్న పళ్లెం పైకిలేవలేదు. కారణం తాడు కప్పీలో చిక్కుకుపోయింది. జనం ఘొల్లున నవ్వారు. వెంటనే స్థానం 'అక్కా...నాథుడు మనకు కాకుండా పోతాడేమోనన్న ఆందోళన నీ భక్తిలోని ఏకాగ్రతను భంగపరిచినట్లుంది.. మరోమారు ప్రయత్నించు' అని సమయస్ఫూర్తితో సొంత డైలాగు చెప్పారు. ఈసారి రుక్మిణి పద్యం పాడుతుండగానే కప్పీలో ఇరుక్కున్న తాడు తొలగించిన పై నున్న వ్యక్తులు తటాలున పళ్లాన్ని పైకిలాగేశారు. మళ్లీ రసాభాస! వెంటనే 'స్థానం' 'అక్కా! ఆపు..నీ భక్తి పరాకాష్ఠకు చేరింది. ఆకు పళ్లెంలో వేస్తే నాథుడే మనకు దక్కకపోవచ్చు' అంటూ పద్యాన్ని ఆపించి పరిస్థితిని సమయోచితంగా సరిదిద్దారు.



న్నాయి. సూర్యం అంటే రాముకి ఎనలేని గౌరవం, ఆత్మీయత, అభిమానం. సూర్యం అన్నట్టు నిజంగా తనలో అంత గొప్పతనం ఉందా!? రేపు పోటీలో విజయం తననే వరిస్తుందా? తనలోని కళాకారుడు గతంలో చాలా మంది పొగడ్తలు పొందాడు. పరవశాన్ని అనుభవించి ఆనందపుసంద్రంలో మునిగి తేలాడు. కాని ఇప్పటి అనుభూతి అన్నిటికీ అతీతమైనది. సూర్యం మాటలు ఎందుకో తనను ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్నాయి. ఊపిరి సలపనివ్వకుండా ఊపేస్తున్నాయి.

"ఏంటి రాము! నువ్వింకా నిద్రపోలేదా? పక్కమీద చేరగానే గుర్రు పెడ్తావు. ఈరోజేంటి ఇంకా అటూ ఇటూ దొర్లుతున్నావు?" టేబుల్‌లైట్ వెలుతురులో ఓ మూల కూర్చుని చదువుకుంటున్న సురేష్ రామువైపు దృష్టి సారించి అన్నాడు.

రాము ఆలోచనల్లో నుంచి ఇంకా తేరుకోలేదు. సురేష్ మాటలు రాముకి వినిపించీ వినిపించనట్టున్నాయి. అందుకే మౌనంగా చూస్తూ ఇంకా దీర్ఘాలోచనలోనే ఉన్నాడు. సురేష్ పలకరింపు

అతడిలో కనీసంగానైనా చలనం కలిగించలేదు.

"రామూ! నిన్నే" ఈ సారి స్వరం హెచ్చించి పిల్చాడు సురేష్.

అప్పుడు గాని ఈ లోకంలో పడలేదు రాము. ఇటు తిరిగి సురేష్ వైపు చూశాడు సీరియస్‌గా.

"లైట్ తీసెయ్యనా?"

"ఎందుకు?" నెమ్మదిగా అడిగాడు రాము.

"లైట్ వెలుతురు నీకు ఇబ్బందిగా ఉందేమో? అందుకే నీకు నిద్రపట్టడం లేదు. అవునా?" సురేష్‌కి రాము నిద్ర గురించి బాగా తెలుసు. గదిలో లైట్ వెలుగుతున్నా అతడు క్షణాల్లో నిద్రలోకి జారుకుంటాడని. రాము నిద్రని గదిలో వెలిగే లైటే కాదు ఏ శక్తి ఆపలేదు. అతని మొద్దు నిద్ర అలాంటిది. రాము నిద్రని ఆపడమే కాదు. ఆ నిద్ర నుంచి లేపడం కూడా ఎవరితరమూ కాదని గతంలో చాలా సార్లు అనుభవపూర్వకంగా గ్రహించాడు సురేష్.

"అదేం లేదు! నువ్వు చదువుకో" అనేసి అటువైపు తిరిగాడు రాము.

"ఏం? నువ్వు చదువుకోవచ్చు కదా! పరీక్షలు దగ్గర పడుతున్నాయి" ఆ మాటలు సురేష్ పెదవులదాకా వచ్చి ఆగిపోయాయి. అలాంటి మాటలకు రాము విలువనివ్వడని సురేష్‌కెప్పుడో అర్థమైపోయింది. వృథా అయిపోయే ఉచిత సలహాలివ్వడం సురేష్ కిష్టం లేదు. ఎవరిష్టాలు, సరదాలూ వారివి. ఇది హాస్టల్. ఇక్కడ ఎవరి స్వేచ్ఛకూ మరొకరు భంగం కారు, కాలేరు. ఒకడు రోజంతా ఎక్కడెక్కడో తిరిగి ఏ అర్ధరాత్రికో వస్తాడు. ఇంకొకడు సినిమా మీద సినిమా చూస్తాడు. కొందరు పేకాటల్లో మునిగితేలుతారు. మరి కొందరు అమ్మాయిల వెంటపడి కాలక్షేపం చేస్తారు. రోజులు తరబడి షికార్లు కొడుతూ హాస్టల్ సంగతే మర్చిపోతారు. వచ్చిన సంగతి పక్కన పెట్టి కాలేజీ ఎగ్గొట్టి, చదువుకి నామం పెట్టి ఏదేదో చేస్తారు. తమకు తెలియకుండానే బిజీ అయిపోతారు. ఎవరినీ ఎవరూ నియంత్రించలేరు. హాస్టల్ వార్డెన్, ఆఖరికి గూర్ఖా కూడా అడ్డు చెప్పలేడు. అడ్డుపడితే జరిగే పరిణామం ఏంటో గూర్ఖాతోసహా అందరికీ తెలుసు. అందుకే ఎవరూ ఎవరిజోలికీ వెళ్ళరు.

"సురేష్! నేను త్వరలో రాష్ట్రస్థాయి అవార్డ్ అందుకోబోతున్నాను తెల్సా?" రాము ఉత్సాహంగా అన్నాడు తలెత్తి సురేష్‌కేసి చూస్తూ.

"ఎందులో" అని తను అడక్కపోయినా రాము చెబుతాడని సురేష్‌కి బాగా తెలుసు. రాము పాటలపోటీకి ప్రాక్టీస్ చేస్తున్నట్టు సురేష్‌కి చూచాయగా ఇంతకుముందే తెల్సు. అనుక్షణం అదే తపనతో ఆలోచనలతో రాము గడుపుతున్నట్టూ తెల్సు. అసలు నిద్రపోకుండా నిరంతరం అదే తలపులతో ఉంటున్నాడనీ సురేష్‌కి తెలుసు.

"దేనికని అడగవేం?!" రాము గద్దిస్తున్న

ట్టుగా సురేష్ ముఖంలోకి చూస్తూ అన్నాడు.

సురేష్ సమాధానం చెప్పలేదు. అసలు ఆ విషయంపై కనీసపు ఆసక్తి కూడా కనబరచలేదు. పుస్తకంలో నుంచి తల పైకెత్తనేలేదు. చదువులో పూర్తిగా నిమగ్నమైపోయాడు. అది రాముకి అవమానంగా అనిపించింది. భరించలేని బాధకు గురిచేసింది.

తననీ, తనలోని కళనీ తక్కువగా చూసినందుకు రాముకి అతడిపై చెప్పలేనంత కోపం కలిగింది. అందరూ తననొక ప్రముఖ వ్యక్తిగా, గొప్ప కళాకారుడిగా కీర్తిస్తూ ప్రత్యేకాభిమానం, ఆప్యాయతలు కురిపిస్తుంటే ఈ సురేష్ నిర్లిప్తంగా ఏమీ పట్టనట్టుండడం భరించలేకపోతున్నాడు. లోతుగా ఆలోచిస్తే అతనికి తట్టిన విషయం ఒక్కటే-సురేష్‌కి తన సత్తా పూర్తిగా తెలియకపోవడమే అనిపించింది.

అప్పుడే గట్టిగా ఒక నిశ్చయాన్ని ఏర్పరచుకున్నాడు రాము. సురేష్‌తో కూడా మనస్ఫూర్తిగా శెభాష్ అనిపించుకోవాలని నిర్ణయించుకున్నాడు. అందుకే ఎల్లుండి జరగబోయే రాష్ట్రస్థాయి పాటల పోటీని ఒక ఛాలెంజ్‌గా తీసుకున్నాడు. ఎలాగైనా ప్రైజ్ కొట్టి సురేష్ మన్ననలు పొందాలని దృఢంగా అనుకున్నాడు. అంతే కాదు ఆ క్షణం వచ్చే దాకా తనకు మనశ్శాంతి లేదనే నమ్మకాన్ని మనసులో బలంగా ఏర్పరచుకున్నాడు.

మర్నాడు సూర్యం దగ్గరకెళ్ళి ప్రాక్టీస్ ప్రారంభించాడు రాము.

సూర్యం గది చాలా సందడిగా ఉంది. చాలా మంది స్టూడెంట్స్ ఆ గదిలో చేరారు. వాళ్ళంతా రాము పాడే పాటల్ని బాగా ఎంజాయ్ చేస్తున్నారు. ఆనందంతో చిందులు వేస్తున్నారు. రేపే పాటల పోటీ. రాము రేపు పోటీలో పాడబోయే పాటను ఒకటికి పదిసార్లు పాడి వినిపిస్తుంటే సూర్యం మధ్యలో ఏవో సూచనలు, సలహాలు ఇచ్చి మళ్ళీ పాడమంటున్నాడు. ఒకే పాటను మళ్ళీ మళ్ళీ పాడడం రాముకి కొద్దిగా విసుగనిపించినా తనపైనా, తన పాటపైనా సూర్యం చూపిస్తున్న శ్రద్ధకి ఆ విసుగంతా విసిరేసినట్టు ఎటో ఎగిరిపోయింది.

**ఒకే పాటను మళ్ళీ మళ్ళీ పాడడం రాముకి కొద్దిగా విసుగని పించినా తనపైనా, తన పాటపైనా సూర్యం చూపిస్తున్న శ్రద్ధకి ఆ విసుగంతా విసిరేసినట్టు ఎటో ఎగిరి పోయింది**

పోటీలో ప్రథమ బహుమతి పొందాలన్న పట్టుదల, కాంక్ష తనకంటే సూర్యంకే ఎక్కువుందనిపించిందతడికి. అందుకే భావ గాంభీర్యంతో గొంతెత్తి పాడుతూ పరవశించిపోతున్నాడు.

విద్యార్థులంతా చేరడంతో ప్రాక్టీస్ కాస్తా కచేరిగా రూపాంతరం చెందిపోయింది. ఒక్కొక్కరూ వరుసగా ఒక్కొక్క పాట అడుగుతుంటే రాము అవలీలగా పాడి అందరినీ మెప్పిస్తున్నాడు. అదే సమయంలో ఒక స్టూడెంట్ ఆ గదిలోకి అడుగుపెట్టాడు.

పొడవుగా, కాస్త లావుగా ఉండి శరీరంతో మంద పాటి కళ్ళద్దాలు పెట్టుకున్న ఆ వ్యక్తి అసలు పేరు ఏమిటో హాస్టల్లో ఎవరికీ తెలియదు. కానీ అందరూ అతన్ని పిలిచే పేరు ఓ.పి.డి.ఆర్. అంటే 'హొదిలి పెట్టకుండా దంచే రకం' అని. సేండ్విచ్ మెకానికల్ కోర్స్

మూడో సంవత్సరం.

"సినిమా పాటలు ఎవరైనా పాడగలరు. ఇదిగో దీనికి ట్యూన్ కట్టి పాడి వినిపించు" అన్నాడు గట్టిగా. అతను అనర్గళంగా మాట్లాడగలడు ఏ విషయం పైనయినా. ఆ మాటలకు అంతూపొంతూ వుండదు. అదొక ప్రవాహంలా సాగిపోతుంది. వింటున్న వాళ్ళని గంటలకొద్దీ నిలబెట్టి స్థలకాలాదులు సైతం పక్కనపెట్టి ఉపన్యాస ధోరణిలో దంచిపారేస్తాడు. అందుకే అతన్ని అందరూ ఓపిడీయార్ అని నిక్‌నేమ్ తగిలించి పిలిచేది.

ఓపిడీఆర్ అప్పుడప్పుడు కవితలు కూడా రాస్తాడు. ఇప్పుడు రాముకిచ్చిన గేయ కవిత అతను రాసిందే. విశాఖ అందచందాలు వర్ణిస్తూ రాసింది. ఆ గేయాన్ని రాము ఒక్కసారి చదివి మనసులోనే ట్యూన్ కట్టి అప్పటికప్పుడే ఆశువుగా పాడేశాడు.

అంతే!

విద్యార్థులు ఒన్స్‌మోర్ అంటూ ఈలలు వేశారు. రాముని పొగడ్తల్లో ముంచెత్తారు. నిన్ను మించిన గాయకుడు హాస్టల్లోనే కాదు స్టేట్‌లోనే లేడన్నారు.

రాముకి చాలా గర్వంగా అనిపించింది. వాళ్ళంతా ఏకకంఠంతో రేపటి పోటీలో నీదే ఫస్ట్‌ప్రైజ్ అన్నారు. ఉన్నపళంగా పైకెత్తుకుని గదిలో నుంచి బయటికి తీసుకొచ్చేరు.

హాస్టల్ చుట్టూ అలాగే ఎత్తుకుని ఊరేగిస్తూ నినాదాలు చేస్తూ అరిచారు. హర్షాతిశయంలో రాము కళ్ళు చెమర్చాయి. ఆ అనుభూతికి హృదయం ఉప్పొంగి ఉరకలు వేసింది.

అంతా తనను పొగిడి ఆకాశానికి ఎత్తేస్తుంటే రాముకి పట్టలేనంత ఆనందంగా అనిపిస్తోంది. ఈ ప్రపంచాన్నే జయించినంత సంతోషం కలుగుతోంది. ఆ ఆనందమే అతన్ని అథఃపాతాళానికి తొక్కేస్తుందని ఆ క్షణంలో రాము పిసరంతయినా ఊహించివుంటే అతని జీవితం ఎలా ఉండేదో. వాస్తవాల్ని గ్రహించే వయసు కాదది. అందుకు తగిన మూల్యం చెల్లించాల్సి వస్తుందని ఆ క్షణంలో తెలియదు.

9

కంచరపాలెం మెట్టు దగ్గరున్న రామమందిరం ఆలయ ప్రాంగణంలో జరిగిన పోటీలో రాష్ట్రం నలుమూలల నుండీ సుమారు వంద మంది గాయనీ గాయకులు పాల్గొన్నారు. ప్రతిష్ఠాత్మకంగా జరిగిన ఆ పాటల పోటీకి వేలాది జనం విచ్చేశారు.

పాటల పోటీ జరుగుతున్న ప్రాంగణంలోకి అడుగుపెడుతుంటే రాముకి కొద్దిగా భయంగా అన్పించింది. మనసులో ఏదో జంకు కలిగింది.

పోటీలో పాల్గొనే వాళ్ళందర్నీ విడిగా కూర్చోబెట్టారు. రాము వాళ్ళందరినీ పరికించి చూశాడు. తన ఈడు వాళ్ళు కొద్దిమందే ఉన్నారు. చాలామంది 25 ఏళ్ళు పైబడినవారే. 30, 35 ఏళ్ళు దాటినవాళ్లూ కొద్దిమంది ఉన్నారు. ఒకరిద్దరు యాభైఏళ్ళు దాటిన వాళ్లూ కన్పించడంతో రాము ఆశ్చర్యపోయాడు.

'ఇంతమందిలో- అందునా చాలా ఏళ్ల నుంచి పాడుతూ, పోటీల్లో పాల్గొంటున్న వాళ్లతో పోటీపడి బహుమతి పొందడం అంటే మాటలా! పొందలేకపోతే వందలాది మంది విద్యార్థుల్లో తనకి భరించలేని అవమానం. పొందితే తనంతటి అదృష్టవంతుడుండడు' అనుకున్నాడు రాము.

ఎలాగైనా సరే గెలిచి తీరాలి అని పట్టుదలగా అనుకున్నాడు. నిన్న హాస్టలర్స్ అంతా తనని భుజాల మీదకెక్కించుకుని తిప్పిన దృశ్యం కళ్లలో మెదులుతుండగా.

పోటీ ప్రారంభమయింది. రాముని నాలుగో వ్యక్తిగా పిలిచారు. ముందు పాడిన ముగ్గురు ఫరవాలేదనిపించేటట్లుగానే పాడారు.

రాము వేదికపైకి వచ్చి జనం వంక కలయ చూశాడు. ఒక్క క్షణం కళ్లు మూసుకున్నాడు. నిన్నటి దృశ్యాన్ని మరోసారి మనోఫలకంలో నింపుకున్నాడు.

ఆ తర్వాత గళం విప్పి తను అమితంగా

సాధన చేసిన పాట అందుకున్నాడు. అతడి గాత్రం శ్రోతల్ని సమ్మోహితుల్ని చేసింది. వాళ్లలో ఉత్సాహం పెల్లుబికింది.

రాత్రి పదింటికి మొదలైన పోటీ తుది ఫలితం వచ్చేసరికి తెల్లారిపోయింది.

జడ్జీలు తుది ఫలితాన్ని నిర్ణయించడంలో కొంత జాప్యం చేశారు. అద్భుతంగా పాడిన ఐదుగురిలో నిర్ణేతను నిర్ణయించడం వాళ్లకి కష్టమయింది. ఆ ఐదుగురినీ మళ్లీ పాడమని కోరారు. వాళ్లలో రామూ ఒకరు. వాళ్లతో పాటు చివరికి శ్రోతల్లో కూడ టెన్షన్.

ఎట్టకేలకు ఫలితం ప్రకటించారు - విజేత రాము అంటూ.

శ్రోతల్లో ఉన్న విద్యార్థుల ఆనందానికి అవధి లేదు. చప్పట్లు, ఈలలు, అరుపులతో ఆ ప్రాంగణమంతా దద్దరిల్లింది.

ఇక రాము సంగతి చెప్పేదేముంది. అతిశయంచిన ఆనందంతో కళ్ల వెంట జలజల కన్నీళ్లు రాలాయి.

స్థానిక విశాఖ రేడియో స్టేషన్లో సీనియర్ గాయకులిద్దరు జడ్జీలుగా వ్యవహరించారు. వారు రాముకి ప్రథమ బహుమతిని ప్రకటించడంతో పాటు రాము గాత్రమాధుర్యాన్ని ప్రత్యేకంగా ప్రశంసించారు.

"ఈ అబ్బాయికి మంచి భవిష్యత్తుంది. ఇతను ఆలిండియా లెవల్లో గొప్ప గాయకుడవుతాడు. ఈ గాత్రానికి తిరుగు లేదు. భాషోచ్ఛారణ భావగాంభీర్యత ఇతని గాత్రానికున్న గొప్ప ప్రత్యేకతలు. ఈ గొంతు రాబోయే కాలంలో ఉచ్ఛస్థానాన్ని పొందుతుందని మా నమ్మకం..." అంటూ పొగిడారు.

రాము పట్టలేని సంతోషంతో సూర్యాన్ని

## బాధిత మగువలకు భరోసా

ఈ మహమ్మారి రోగం బారినపడ్డామేమిట్రా బాబూ అనుకుంటూ ప్రపంచవ్యాప్తంగా అనేకమంది మహిళలు ఉసూరుమంటున్నారు. వారిలో ఎందరో ఉసురు కోల్పోతున్నారు కూడ. మహిళల పాలిట శాపంగా మారిన ఆ వ్యాధే వక్షోజ కేన్సర్. ఆ వ్యాధికన్నా చికిత్స ఇంకా భయం కలిగిస్తుంది. ఎందుకంటే ఆ చికిత్సవల్ల కలిగే సైడ్ ఎఫెక్ట్స్ మహా భయంకరంగా ఉంటాయి. ముఖ్యంగా మెనోపాజ్ దశలో ఉన్న మహిళలకు ఈస్ట్రోజెన్ సంబంధిత బ్రెస్ట్ కేన్సర్ వచ్చిందంటే వారి బాధ వర్ణనాతీతం.



ఆ వ్యాధికి టామోక్సిసెన్ అనే ఔషధం వాడతారు. దానివల్ల కేన్సర్ వ్యాధి తగ్గే అవకాశం 50 శాతం ఉంటుంది. కానీ అది మరో ఉపద్రవాన్ని కలిగించే అవకాశం అంతకంటే ఎక్కువగా ఉంటుంది. కొండ నాలుక్కి మందేస్తే ఉన్న నాలుక పోయిందన్నట్టుగా బ్రెస్ట్ కేన్సర్‌కు వాడే ఈ మందు గర్భాశయానికీ చేటు తెస్తుంది. ఫలితం యుటెరైన్ కేన్సర్‌కు గురికావడం. టామోక్సిసెన్ దుష్ఫలితాలను గమనించి తలలు పట్టుకున్న వైద్య శాస్త్రవేత్తలు ఆ తలల్ని మరింతగా మథించి తీవ్రంగా పరిశోధనలు జరిపారు. ఈస్ట్రోజెన్ ఉత్పత్తిని తగ్గించడమే కాక, యుటెరైన్ కేన్సర్‌కు కారణమయ్యే హార్మోన్లను విడుదల చేయని ఔషధం కోసం శ్రమించి 'అనాస్ట్రోజోల్' అనే ఔషధాన్ని కనుగొన్నారు.

ఈ మందువల్ల బ్రెస్ట్ కేన్సర్ ఒకసారి తగ్గాక మళ్లీ వచ్చే అవకాశం 80 శాతానికి తగ్గిపోయింది. అంతేకాక గర్భాశయ కేన్సర్ వచ్చే ప్రమాదమూ లేదు. దాంతో వక్షోజ కేన్సర్ గురించి కానీ, దాని చికిత్స వల్ల కలిగే దుష్ఫలితాల గురించి కానీ ఎవరూ భయపడనక్కరలేదని డాక్టర్లు భరోసా ఇస్తున్నారు.

గట్టిగా వాటేసుకున్నాడు.

"దీనికంతటికీ నువ్వే కారణం. ఈ ప్రైజ్ నిజానికి నీకే చెందుతుంది" అన్నాడు రాము కృతజ్ఞతాపూర్వకంగా సూర్యాన్ని చూస్తూ.

"ఈ పోటీకి స్వయంగా నువ్వే రుసుం చెల్లించి పోటీలో పాల్గొనే అవకాశం కలిగించావు. నువ్వు చెప్పకపోతే ఈ పోటీ సంగతే నాకు తెలియదు. తెలిసినా నీ ప్రోత్సాహం, ప్రోద్బలం లేకపోతే ఈ పోటీలో గెలవలేను"

"ఇందులో నేను చేసింది చాలా స్వల్పం. నీ కృషి, పట్టుదల ముఖ్యంగా నీలోని ప్రతిభ నీకు పట్టం గట్టింది. ఈ సందర్భంగా నాదొక సలహా" అని ఆగి రాము వంక చూశాడు సూర్యం.

"ఏమిటది!" రాము స్వరంలో ఆసక్తి.

"నువ్వు ఇకపై సంగీతంపైనే దృష్టి పెట్టడం మంచిది. సంగీతం కూడా నేర్చుకుంటే ఇంకా మంచిది. అఫ్‌కోర్స్ నీకు గాడ్స్ గిఫ్ట్ ఉంది. నీలాంటి వాళ్ళు సులువుగానే సంగీతం నేర్చుకోగలరు"

"తప్పకుండా నేర్చుకుంటాను. అయితే అందుకు నీ సహాయం కావాలి. నీకు తెలుసు కదా! ఏదీ స్వతంత్రంగా చేయలేనివాడిని. ఎవరో ఒకరి అండ వుండాలి"

"ఓ.కే. ష్యూర్! నా ప్రోత్సాహం అండదండలెప్పుడూ ఉంటాయి"

ఆరోజు రాముని భుజాలపై ఎక్కించుకుని ఊరేగిస్తూ హాస్టల్‌కి తీసుకొచ్చేరు హాస్టలర్స్ అందరూ కలిసి.

రాము జీవితంలో అదొక గొప్ప అనుభూతి. హాస్టల్లోనూ, కాలేజీలోనూ అందరూ ఒకటికి పదిసార్లు కీర్తిస్తూ పొగడ్తల వాన కురిపిస్తుంటే రాము తనని తానే మరిచిపోయాడు. ఏదో ఘనకార్యం సాధించినవాడిలా గర్వంగా ఫీలయ్యాడు.

హాస్టల్లో రాముకి మరింత పరపతి పెరిగింది. అంతవరకూ తెలియని వాళ్ళకు కూడా రాము ఒక స్పెషల్ ఎట్రాక్షన్ అయిపోయాడు. ఎవరెవరో వ్యక్తిగతంగా కలిసి మెచ్చుకున్నారు.

ఆ రెండ్రోజులూ అందరి దృష్టీ రాముపైనే. సరిగ్గా ఇది జరిగిన మూడో రోజునే ఊహించని సంఘటనతో హాస్టలర్స్ దృష్టి మారింది.

10



సూర్యం రూమ్మేట్

జగ్గు ఆత్మహత్యాయత్నం!

క్షణాల్లో ఆ వార్త హాస్టల్ విద్యార్థులందరికీ చేరిపోయింది.

బండలాంటి అంతటి జగ్గు ఇంతటి పిరికి పని చేశాడా? ఎందుకు... ఎందుకు? ! అందరి నోటా అదే మాట, అందరికీ ఒకటే ఆశ్చర్యం. గుంపులు గుంపులుగా చేరి చెవులు కొరుక్కుంటున్నారు. గంటల తరబడి అదే విషయాన్ని చర్చించుకుంటున్నారు.

నలంద, నాగార్జున రెండు హాస్టల్ బిల్డింగ్‌లలోనూ ఇదే విషయంపై విద్యార్థుల్లో తీవ్ర కలకలం మొదలయింది. వందల సంఖ్యలో ఉన్న హాస్టలర్స్‌లో చాలామందికి జగ్గు అంటే ఎవరో ముందు తెలియలేదు. ఆ తర్వాత పూర్తి వివరాలు తెలిసి ముక్కు మీద వేలేసుకున్నారు. జగ్గులాంటి వ్యక్తి ఆత్మహత్యకు పాల్పడటం ఏమిటి? బయటికి బండగా కనిపించే జగ్గు మనసు ఇంత సున్నితమా? కండలు తిరిగిన ఆ శరీరం లోపల ఇంతటి పిరికితనమా? ఇంతకీ అది పిరికితనమా లేక అమాయకత్వమా, అజ్ఞానమా? ప్రాణాల్ని బలి తీసుకోవలసిన అవసరం, అగత్యం ఏమొచ్చింది? ఈ సందేహాలు అందరితో పాటు జగ్గు రూమ్మేట్ సూర్యాన్ని కూడా చుట్టుముట్టేశాయి.

సమయానికి తగినట్లుగా స్పందించి రంగం

# ఉత్తమ నవలలకు ఆహ్వానం

మీరు విలక్షణ రచయితలా
వినూత్నంగా అక్షరాన్ని
సంధించడం మీ అభిలాషా

మరింకేం, వెంటనే
స్పందించండి.

## సాదర స్వాగతం

గత 28 సంవత్సరాలుగా
అప్రతిహతంగా నెలనెలా
ఉత్తమ నవలను పాఠకులకు
అందిస్తున్న **చతుర** రానున్న
సంచికలను మరింత అద్భుతంగా వెలువరించాలని
సంకల్పిస్తోంది. అశ్లీలతకు తావులేకుండా, మానవతా విలువలతో
ఆబాలగోపాలాన్ని అలరించగల మంచి నవలలకు స్వాగతం పలుకుతోంది.

## సునిశిత హాస్యంతో ఓలలాడించే వ్యంగ్య నవలలకు ప్రత్యేక ప్రాధాన్యం

నవలలు ఇతివృత్తంలో నవ్యత, రచనాసంవిధానంలో వైవిధ్యం కలిగి ఉండాలి.
తెలుగు వాతావరణాన్ని, తెలుగు వారి సమకాలీన జీవితాన్ని విభిన్న
కోణాల నుండి సమగ్రంగా ప్రతిబింబించగలగాలి. సామాజిక స్పృహతో
మానవ స్వభావాలను, అంతరంగిక చిత్రాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించగలగాలి.
నవల చతురలో అచ్చులో 90 పేజీలు మించకుండా చూసుకుని పంపించాలి.
అంతకు మించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించడం కుదరదు.
కనుక రచయితలు చతురలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో సరిచూసుకుని
నవలలను పంపించాలి. ఎంపిక కాని వాటిని తిప్పి పంపగోరువారు
తగు పోస్టేజి ఉన్న కవరును జత పరచాలి.

**సంపాదకుడు**

'ఈనాడు' కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ - 82.

లోకి దిగబట్టి జగ్గు ప్రాణాలతో బయటపడ్డాడు. లేకపోతే ఈ పాటికి...!

"చెప్పరా జగ్గు! ఎందుకీ పని చేశావు?" ఆ రాత్రి అంతా సద్దుమణిగాక జగ్గుని నెమ్మదిగా నిలదీస్తూ అడిగాడు సూర్యం. జగ్గు జవాబు చెప్పకుండా తల పక్కకు తిప్పుకుని తెరిచిన కళ్ళను మళ్ళీ నెమ్మదిగా మూసుకున్నాడు.

"నువ్వు చెప్పకపోయినా నేను గ్రహించగలను. తరచూ నేను అవహేళన చేస్తూ అన్న మాటలే నిన్ను ఇంత పని చేయడానికి పురికొల్పాయి!" అని పశ్చాత్తాపంతో గట్టిగా నిట్టూర్చాడు సూర్యం.

"నన్ను క్షమించరా! సరదా కోసం నిన్ను అలా అనేవాడిని గాని నిజంగా బాధపెట్టాలని కాదు. నా మాటలు, చేష్టలూ అన్నీ సిల్లీగా తీసుకుని అంతా మర్చిపోయి మరుక్షణాన మామూలుగానే ఉంటున్నావనే అనుకున్నాను గానీ, ఇంతగా హర్ట్ అవుతున్నావని గ్రహించలేకపోయాను. ఇంకెప్పుడూ నిన్ను పల్లెత్తు మాట కూడా అనను. నన్ను నమ్ము!" అన్నాడు సూర్యం క్షమాపణ కోరుతూ.

"సూర్యం! నువ్వనవసరంగా బాధపడుతున్నావు. ఇందులో నీ తప్పేమీ లేదు. అసలు కారణం వేరే ఉంది" అన్నాడు జగ్గు.

"ఏమిటా కారణం?!" వెంటనే అడిగాడు సూర్యం.

"నాకు జీవితం మీద విరక్తి కలిగింది. బతకాలనిపించలేదు. అందుకే.. అందుకే..."

"విరక్తా? దేనికి? ఎందుకు?" నొసలు చిట్లిస్తూ కాస్తంత ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సూర్యం. జగ్గు మౌనంగా ఉండడంతో "చెప్పరా" అంటూ రెట్టించాడు.

"నేను.. నేను... ఒకర్ని ప్రేమించాను"

ఆ మాటలు వింటూనే మరింత ఆశ్చర్యంగా నోరెళ్ళ బెట్టాడు సూర్యం.

"నువ్వా... ప్రేమా" అనే మాటలు అప్రయత్నంగా అతడి నోటి నుంచి వెలువడ్డాయి. జగ్గు చివ్వున తల తిప్పి చూశాడు. సూర్యం మాటలకు అతడి అహం దెబ్బతింది.

వెంటనే, తన మాటల్ని అపార్థం చేసుకున్నాడని గ్రహించిన సూర్యం జగ్గు దగ్గరకు వెళ్ళి అతడి భుజం మీద చెయ్యేసి, "తప్పుగా అర్థం చేసుకోకురా. నేనేం ఎగతాళిగా అనడం లేదు. నువ్వు ప్రేమలో పడడమేమిటి? అసలు నీకు అంత ధైర్యం ఎలా వచ్చింది. నీ ప్రేమ విషయాన్ని నేను కనీసంగా కూడ కనిపెట్టలేకపోవడమేమిటి అనే ఉద్దేశంతోనే అడిగాను. అంతే"

జగ్గు తల దించుకుని ఉన్నాడు తప్ప ఏం మాట్లాడలేదు.

"అసలు ఎవర్రా ఆ అమ్మాయి. ఎక్కడుంటుంది. నువ్వింతగా ఆ ఆకర్షణలో పడిపోవడమేమిటి? ఇంత బేల పనికి పూనుకోవడమేమిటి? ఇంతకీ ఏమయిందసలు"

సూర్యం పదే పదే బలవంతం చేయడంతో జగ్గు నెమ్మదిగా చెప్పాడు. "ఆ అమ్మాయి పేరు రాధ. కొండ దిగువన కన్పించే ఊళ్లో ఉంటుంది"

"నీ ప్రేమ గురించి చెప్పావా?"

చెప్పానన్నట్లుగా తలవూపాడు.

"ఆ అమ్మాయి నిన్ను ప్రేమించడం లేదా? నువ్వు చెబితే ఏమంది?"

"నన్ను ఛీ కొట్టింది. నన్ను, నా ప్రేమను కాదు పొమ్మంది" బేలగా, జావ కారిపోయిన స్వరంతో అన్నాడు.

"అయినా ఈ పిచ్చి నీ కెందుకు పట్టుకుందిరా? ఈ స్టూడెంట్ లైఫ్ ఎంజాయ్ చేసి, నీ చదువేదో కానిచ్చుకోక, ఈ జాడ్యం నీకెలా అంటుకుందిరా బాబూ"

జగ్గు తలెత్తి చూశాడు కానీ ఏం మాట్లాడకుండా మళ్ళీ తల దించేసుకున్నాడు.

"ఆ అమ్మాయి ఏం చేస్తుంది?"

జగ్గూ మౌనమే సమాధానం.

"అసలు నీకు ఆ అమ్మాయి గురించేమైనా తెలుసా"

"..."

"నేనెప్పుడైనా ఆ అమ్మాయిని చూశానా"

"ఏమో. చూసుంటావేమో"

"పోనీ, రేపోసారి నాకు చూపించు"

"రేపటి దాకా ఎందుకు? ఇప్పుడే చూపిస్తా

ను" అంటూ దిగ్గున మంచం మీద నుంచి లేచాడు జగ్గు.

జగ్గు వైపు అదోలా చూస్తూ నిశ్చేష్టుడయిపోయాడు సూర్యం.

ఒక్కసారిగా వేయి ఏనుగుల బలం ప్రవేశించి, ముఖంలో వింత కాంతులు వెల్లివిరిశాయి జగ్గులో. అంతవరకూ అతని శరీరంలో ఉన్న నీరసం మంత్రించినట్టు మాయ మై తెలియని ఉద్వేగం, ఉత్సాహం చోటు చేసుకున్నాయి.

అప్పుడు సమయం అర్థరాత్రి పన్నెండు గంటలు దాటింది.

ఇప్పుడు... ఈ సమయంలో ఏమిటి వీడు చూపించేది? ఈ చిమ్మచీకటిలో ఏం కనిపిస్తుంది? కొంప తీసి వీడికి మతిగాని పోయిందా ఏమిటి? అనుకుంటూనే "నిజంగా అంటున్నావా" అనడిగాడు.

"నిజంగానే అంటున్నా" జగ్గు స్వరంలో నిశ్చయం ధ్వనించింది.

సూర్యం అతడిని రెండు క్షణాలు తదేకంగా చూసి "సరే పద" అన్నాడు.

ఇద్దరూ మౌనంగా మెట్లెక్కి టెర్రస్ పైకొచ్చేరు.

"అదిగో... అదే... అక్కడే నా రాధ" అంటూ చేయి చాపి దూరంగా మిణుకుమిణుకుమంటున్న ఓ ఎలక్ట్రిక్ బల్బ్‌ని చూపించేడు జగ్గు.

"ఏదీ! ఎక్కడా? " అంటూ చీకట్లో అయోమయంగా చూపానినంతమేరా చూసి అన్నాడు సూర్యం.

"అంత క్లియర్‌గా కనిపిస్తుంటే... ఎక్కడా అంటావేంటి? " జగ్గు విసుక్కున్నాడు.

సూర్యం కిసుక్కున నవ్వేడు.

"అలా నవ్వుతావెందుకు? సరిగ్గా చూడు..."

"చూడ్డానికక్కడేం కనిపిస్తోందని? ఆ స్ట్రీట్ లైట్ వెలుతుర్లో... స్తంభాన్ని ఆనుకుని ఒక చిన్న గుడిసె... అంతే కదా!" అన్నాడు సూర్యం చిరాగ్గా.

"అంతే మరి! ఏదైనా చూసే కళ్ళని బట్టి

## నాథా ఏమిటీ చిరాకు?

స్థానంవారు ఆడవేషాలు వేసినట్లే.. ఆ రోజుల్లో ఒకరిద్దరు మహిళలు పురుషపాత్రలు ధరిస్తుండేవారు. ఓసారి అలాంటి మహిళతో కలిసి స్థానం 'తులాభారం' నాటకం వేయాల్సి వచ్చింది. కృష్ణుడిగా ఆమె.. సత్యభామ పాత్రలో 'స్థానం' రంగస్థలం పై నటించేటప్పుడు నాటకపరంగా అవసరం లేకున్నా ప్రేమగావెళ్లి ఆమెను కౌగిలించుకునే వారు. ఎంతైనా మహిళకదా ఆమె బిడియపడి దూరంగా జరిగేది.. 'నాథా.. ఏమిటీ పరాకు? ఎందుకీ చిరాకు? ఎవరేని సఖులు చూచెదరని తలపా? లేక నాపై కోపమా? 'అంటూ సొంతడైలాగులు చెబుతూ ఆయన మరింత ముందుకు దూసుకుపోయేవారు. అప్పుడా నటి పడే అవస్థ అంతా ఇంతాకాదు.. కృష్ణుడిగా సత్య(పరపురుషుడు)ను దగ్గరకు తీసుకోలేక ఈయన చిలిపితనాన్ని భరించలేక ఇబ్బంది పడేవారు. ప్రేక్షకులంతా దీనిని చూసి ఎంతో వినోదించేవారు. అయితే ఆటపట్టించడానికే 'స్థానం'అలా చేస్తున్నారని అందరికీ తెలిసిందే కనుక తోటి నటీనటులతో సహా ఎవ్వరూ ఆయనను అపార్థం చేసుకునేవారు కాదు.




కాదు- మనసులో వుంది అది గుడిసె కాదు... గుడి... నా ప్రేయసి గుడి... నా ప్రేమ రాశి గుడి... అందులోనే నా రాధ... నా ప్రాణం ఉంది!" అన్నాడు జగ్గు తన్మయ

స్వరంతో.

సూర్యానికంతా అర్థమైపోయింది.

జగ్గుకి ప్రేమ పిచ్చి ముదిరి బాగా పాకాన పడిపోయిందని గ్రహించాడు" ఇందుకేనా నాయనా... పైకొచ్చి గంటల తరబడి ప్రేమ జపం చేస్తూ.. మొదట్నుంచీ గమనిస్తున్నా. ఏదో కాలక్షేపంగా ప్రకృతిని పరిశీలిస్తూ కూర్చుంటున్నావనే ఇన్నాళ్ళూ అనుకున్నాను... టెర్రస్ పైకొచ్చి నువ్వు చేస్తున్న పని ఇదా నాయనా? "

"ఇంతకీ ఆ రాధ... అదే ... నీలో ప్రేమ బాధను కలిగిస్తున్న ఆమె... ఆ దేవత ఎవరు? " అడిగాడు సూర్యం.

"ఎవరైతేనేం... నా ఎదను దోచిన చిన్నది" జగ్గు వెంటనే కవితా ధోరణిలో అన్నాడు.

నన్ను చీదరించుకుని... నా ప్రేమను తేలిగ్గా తీసిపారేస్తూ... నేనంటే అసహ్యం అన్నట్టు చూసి... కనీసం ఒక్క మాటయినా బదులివ్వకుండా వెళ్ళిపోవడంతో నా గుండెల్లో గునపాలు గుచ్చుకున్నాయి రా...!

"ఎలా ఉంటుంది? !"

"చూడ్డానికి రెండు కళ్ళు చాలవు..."

"ఎప్పుడయినా మాట్లాడావా? !"

"ఈ రోజే మాట్లాడాను!"

"ఏమని? !"

"రాధా నేన్నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు లేని జీవితం వృధా! నన్ను చేసుకోరాదా అన్నాను" చెప్పాడు జగ్గు నిస్సంకోచంగా

"మరి తనేమంది? !"

"ఏమీ అనలేదు. ఒక్కక్షణం ఆగి కోరగా నా ముఖంలోకి చూసి కోపంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. నా ప్రేమను తిరస్కరించి ఛీ కొట్టేసింది!"

"ఓహో! ఇంతకీ నీది ఒన్ సైడ్ లవ్ అన్న మాట" అని గట్టిగా నవ్వాడు సూర్యం.

"నీకలాగే ఉంటుందిరా! నువ్వూ ప్రేమలో పడితే అప్పుడు తెలిసేది. ఒరేయ్! సూర్యం చాలా కాలంగా నా రాధను ప్రేమిస్తున్నాను. మూగగా ఆరాధిస్తున్నాను. ఆమె కోసం అనుక్షణం పరితపిస్తున్నాను. కానీ... ఈ రోజు నన్ను చీదరించుకుని... నా ప్రేమను తేలిగ్గా తీసిపారేస్తూ... నేనంటే అసహ్యం అన్నట్టు చూసి... కనీసం ఒక్క మాటయినా బదులివ్వకుండా వెళ్ళిపోవడంతో నా గుండెల్లో గునపాలు గుచ్చుకున్నాయి రా...!" అంటూ జగ్గు పడికట్టు సినిమా డైలాగుల్ని వల్లిస్తూ భగ్న ప్రేమికుడి పోజుకొట్టడం అంత చీకటిలోనూ స్పష్టంగానే కనిపించింది సూర్యంకి.

"వీడి పిచ్చి తగలెయ్యా. వీడికేం పోయే కాలం" అనుకున్నాడు సూర్యం.

ఇద్దరూ గదిలోకొచ్చేశారు టెర్రస్‌పై నుంచి.

సూర్యం సుదీర్ఘంగా ఆలోచనలో పడ్డాడు.

ఆలోచించి ఆలోచించి ఆఖరికి...

జగ్గు పరిస్థితిని పూర్తిస్థాయిలో అర్థం చేసుకున్నాడు సూర్యం. ఒన్‌వే లవ్వే అయినా రాధను జగ్గు ఎంత డీప్‌గా కావాలనుకుంటున్నాడో తెలిసిపోయిందతడికి.

సూర్యం ఇన్నాళ్లూ జగ్గుని వేరేలా భావించాడు.

కండలు తిరిగేలా దండీలు తీయడం...

గంటలు తరబడి టెర్రస్‌పై ఏకాంతంగా కాలక్షేపం చేయడం...

ఎవ్వరినీ పట్టించుకోకుండా... ఆఖరికి తనతో కూడా నిర్లిప్తంగా ఉండడం... ఇవన్నీ పీకలలోతుగా ప్రేమలో పడినందుకు ఫలితాలని గ్రహించాడు!

"ఒరేయ్! సూరి నా రాధ లేని జీవితం వ్యర్థం రా! పెళ్ళంటూ చేసుకుంటే రాధనే చేసుకుంటాను లేకపోతే లేదు!" మళ్ళీ మళ్ళీ జగ్గు నోట అదే మాట.

సూర్యంకేమీ తోచడం లేదు.

ఏం చేయాలో ఎలా చెప్పాలో బోధపడక తికమకపడి ఆఖరునన్నాడు.

"జగ్గు! నువ్వేం బాధపడకు. నీకు నేనున్నాను. రాధతో నీ పెళ్ళి జరిపించే పూచి నాది" సూర్యం మాటలకు జగ్గుకి కొండంత బలం వచ్చింది. రాధతో పెళ్ళి అనేసరికి

ముఖంలో వెయ్యివాట్ల బల్బు వెలిగినంతటి కాంతి అతనిలో.

"నిజంగానా? ! పసివాడిలా ముఖం పెట్టి ఆశగా చూశాడు జగ్గు.

"నిజంగా"

"ఒట్టు? !"

"ఒట్టు!" సూర్యం వెంటనే జగ్గు చేతిలో చెయ్యి వేశాడు

"నువ్వు కూడా నాకొక మాటివ్వాలి!" అంటూ సూర్యం సూటిగా జగ్గు కళ్ళల్లోకి చూశాడు. జగ్గు ఉద్వేగంగా "ఏమని? !'అన్నాడు

"మళ్ళీ ఇలాంటి తెలివితక్కువ పనులు ఎప్పుడూ చెయ్యనని"

"అలాగే" అంటూ జగ్గు మాటిచ్చాడు.

ఆ మర్నాడే సూర్యం మరో ఇద్దర్ని హాస్టల ర్స్‌ని వెంటబెట్టుకుని రాధ ఇంటికెళ్ళాడు. ఇల్లంటే ఇల్లు కాదు. చిన్న పూరి పాక. అందులో తండ్రీ కూతుళ్ళిద్దరే ఉంటున్నారు. తండ్రి శివయ్య కూలినాలి చేసి కూతుర్ని పోషించుకుంటున్నాడు. రాధ పదో తరగతి ఈ మధ్యనే పూర్తి చేసింది.

ఎవరో హాస్టల్ విద్యార్థి కూతురి వెంట ప డే సంగతి శివయ్యకు చూచాయగా తెలుసు. ఏదో కుర్రకారు ఆగడాలనుకున్నాడు కానీ... పెళ్ళి... సంబంధం అంటూ కుర్రాళ్ళు తన ఇల్లు వెతుక్కుని రావడం.

హాస్టల్ స్టూడెంట్స్ తన ఇంటికి రావడం మొదట ఆశ్చర్యంగా అనిపించింది శివయ్యకి. తర్వాత వాళ్ళు వచ్చిన విషయం చెప్పాక శివయ్య చిరాకుగా ముఖం పెట్టాడు. నెమ్మ దిగా జగ్గు విషయమంతా చెప్పి శాంతపరి చాడు సూర్యం అతన్ని. అంతా విన్నాక ఇదే దో ఆషామాషీ విషయం కాదని శివయ్య సీరి యస్‌గా ఆలోచించి "అంత పని చేశాడా...? !' ' అన్నాడు ఆత్మహత్య సంగతి తెలుసుకుని.

"బాబూ! నాకంటే చిన్నవారే అయినా మీ పెద్దరికపు మాటలూ, పద్ధతీ నాకు నచ్చాయి. కానీ ఒక్క విషయం ఆలోచించండి. మీరు ఈ రోజుంటారు. చదువులు పూర్తయ్యాక రేపెళ్ళిపోతారు. పెళ్ళీ ప్రేమలు అనేవి రెండు బతుకులకు, మనసులకు సంబంధించినవి. పెళ్ళంటే బొమ్మలాట కాదు. ఆవేశంతో నిర్ణ యాలు తీసుకోకూడదు. తండ్రిగా నాకు కొన్ని బాధ్యతలున్నాయి. ఎవరో ముక్కూ మొహం తెలియని కుర్రాడొచ్చి నీ కూతుర్ని చేసుకుంటా నంటే ఇచ్చి చేసెయ్యడానికి నేనేం పిచ్చోణ్ణి కాదు. కూతురయినంత మాత్రాన ఎవరో ఒక రికిచ్చి వొదిలించుకోవడం నాకిష్టం లేదు".

శివయ్య మాటలు సూర్యంని ఆలోచించేలా చేశాయి. శివయ్య లేనివాడే అయినా అన్నీ తెలిసిన వ్యక్తి అని అర్థమయింది వాళ్ళకి.

సూర్యం మరింత వివరంగా జగ్గు గురించి చెప్పాడు.

శివయ్య అంతా ఓపిగ్గా విన్నాడు

ఇదంతా రాధ లోపలినుంచి వింటోంది. రాధ నిజంగా చక్కని చుక్క. అందాల రాశి. కొండ ప్రాంతమే అయినా అక్కడ వంద దాకా ఇళ్ళున్నాయి. అన్నీ పూరిగుడిసెలే.

పేట జనం విషయం తెలుసుకుని వచ్చి ఆసక్తిగా వింటూ గమనిస్తున్నారు.

చుట్టూ జనం గుమిగూడి ఉన్నారు. చర్చ చాలా లోతుగా సాగింది.

అంతా అయ్యాక శివయ్య అవునని కాని కాదని గాని అనలేదు. "బాగా ఆలోచించు కోండి బాబూ! తొందరపడి దూకుడుగా వ్యవ హరించకండి" అంతకంటే ఏమంటే ఏమవు తోందనని శివయ్య భయం.

కుర్రాళ్ళు... అందునా చదువుకుంటున్న వాళ్ళు! రెచ్చగొట్టడం మంచిది కాదని శివయ్య అనుభవపూర్వకంగా అర్థం చేసుకున్నాడు. అందుకే సామరస్యంగా మాట్లాడాడు.

"కుర్రాడు అమ్మాయి కోసం ప్రాణాలకు కూడా తెగించాడంటే అమ్మాయి అంటే అతని కెంత ప్రేమో మీరే ఆలోచించండి" అన్నాడు సూర్యం. మళ్ళీ శివయ్య వైపు చూసి.

శివయ్య ఆలోచిస్తూ మౌనంగా ఉండిపో యాడు. చదువుకుని రేపు మంచి భవిష్య త్తులోకి అడుగుపెట్టే కుర్రాడు కోరి అల్లుడ వుతానంటే ఏ ఆడపిల్ల తండ్రి కాదనగలడు. కానీ ఏదో సంశయం. ఏ బాదరబందీలు

లేని వయసు. ఆ వయసులో ఉన్న కుర్రాళ్ళను నమ్మి ఎలా ముందడుగు వేయగలడు. అదే భావం స్ఫురించేలా శివయ్య అన్నాడు నెమ్మదిగా.

"బాబూ! ముందు మీ చదువులు కాని వ్వండి! ఆ తర్వాతే ప్రేమలూ పెళ్ళిళ్ళూ"

"మీ మనసులో ఉన్న భయం ఏమిటో మాకు అర్థమయింది. మేం కుర్రాళ్ళమనేగా కావచ్చు. కానీ మేం అన్నీ ఆలోచించే ముందు కొచ్చాం. మేం మళ్ళీ వస్తాం. మా పెద్దవాళ్లను వెంట బెట్టుకుని మరీ వస్తాం. అప్పుడు మీకు మా మీద నమ్మకం కలుగుతుంది. మా ప్రతి పాదన సరైందనే సంగతి మీకర్థమవుతుంది. ఈలోగా మీరూ బాగా ఆలోచించుకోండి" అంటూ సూర్యం లేచాడు.

"అలాగే! మీ పెద్దల్ని వెంటబెట్టుకుని రండి. అప్పుడాలోచిద్దాం" అన్నాడు శివయ్య కూడా లేచి.

మొత్తానికి సూర్యం సాహసాన్ని హాస్టల్ విద్యార్థులంతా ఎంతగానో మెచ్చుకున్నారు. అందరికంటే ఎక్కువగా రాముకి సూర్యం అంటే నమ్మకం, గురి కలిగాయి. అంతులేని ఆరాధనా భావం ఏర్పడింది అతనిపై.



* * *

"శివయ్యా! నువ్వు చేసిందేం బాగోలేదు. కుర్రకుంకలతో అంతగా వొంగి వొంగి ప్రవర్తించాల్సిన అవసరం, అగత్యం ఏమొచ్చింది? ఈ వేళ వీళ్ళు రేపు మరొకళ్ళు. ఇలా రాజీ పడిపోవడం ఎన్నాళ్ళు! నువ్విలా మెత్తగా మాట్లాడితే వాళ్ళు నెత్తినెక్కి కూర్చుంటారు. అయినా ఎవడో కుర్రయాల ప్రేమించానని, పెళ్ళి చేసుకుంటానని ముందుకు రావడం, నువ్వు సయ్యనడం ఏం బాగోలేదు. వాళ్ళంటే కుర్రాళ్ళు. బతుకులూ బాధ్యతలూ ఎరుగరు. జీవితాలపై అవగాహనలేనివాళ్ళు. అలాంటి వాళ్ళతో మనకేంటి? ఇదేమైనా సిని మానా? సరదాగా చెప్పుకోవడానికి, పుస్తకాలలో చదవడానికి ఇలాంటివి బాగుంటాయేమోగాని నిజజీవితానికి పొసగవు. ఒక పెద్ద వాడిగా, ఓ ఆడపిల్ల తండ్రిగా నువ్వు చెయ్యాల్సిన పని కాదది"

స్టూడెంట్స్ వెళ్ళిపోగానే అంతవరకూ చోద్యం చూస్తున్నట్టు మౌనంగా ఉండిపోయిన ఊరు జనం ఒక్కసారి శివయ్యపై విరుచుకుపడ్డారు. దాంతో శివయ్య తన మనసులోని మాట చెప్పాడు.

"అంతకు మించి నన్నేం చెయ్యమంటారు?

చదువుకునే కుర్రాళ్ళతో వ్యవహారం! ఏ మాత్రం రెచ్చగొట్టినా ఆ కష్టం, నష్టం నేను భరించాలి" అన్నాడు శివయ్య దీనంగా మొహం పెట్టి.

కొండవాలుకి ఆనుకుని నగరానికి చాలా దూరంగా ఉన్న ఆ గ్రామంలో హాస్టల్ పెట్టి నప్పట్నుంచీ ఇలాంటి చిన్నా చితకా గొడవలూ, అల్లర్లూ జరుగుతూనే ఉన్నాయి. హాస్టల్‌కి అతి చేరువలో ఉండడంచేత స్టూడెంట్స్ ఆకతాయి పనులకు ఆ గ్రామ ప్రజలు ఇబ్బంది పడడం తరచూ జరిగే తంతే.

ఆ గ్రామస్థుల రాకపోకలన్నీ హాస్టల్ పక్కగా ఉన్న రహదారి గుండానే సాగడం మరొక ముఖ్య కారణం. ఎప్పుడూ ఎవరో ఒకరు ఇలాంటి ఆకతాయి పనులకు ఇబ్బం దిపడడం పరిపాటయిపోయింది ఆ గ్రామ ప్రజలకు.

కొందరు చూసీ చూడనట్టుంటారు. మరి కొందరు మనకెందుకులే అనుకుని సర్దుకు పోతారు. అలవాటేలే అని మిన్నకుండిపో తారు. అయితే కొందరు మాత్రం కుర్రాళ్ళకి తగిన బుద్ధి చెప్పాలని కోపగించుకుని కళ్ళె ర్రజేస్తారు. వెర్రివేషాలేస్తే కాళ్ళు విరగ్గొడతా మని హెచ్చరిస్తారు. తంతామని భయపెట్టి తగిన సమాధానం ఇస్తారు. అలా గతంలో చాలా గొడవలూ, అల్లర్లూ జరిగి పోలీసులు జోక్యం చేసుకునేదాకా వెళ్ళింది పరిస్థితి. నదిలో పాతనీరుపోయి కొత్త నీరొచ్చినట్టు పాతవిద్యార్థులు పోయి కొత్త విద్యార్థులు హాస్టల్లో చేరడంతో మళ్ళీ మళ్ళీ ఇలాంటివి పునరావృతం అవుతున్నాయి.

"ఇలా ఎన్నాళ్ళు! ఎన్నేళ్ళు? ఈ కుర్రాళ్ళకి బుద్ధిరాదా? వీళ్ళు చదివిన చదువంతా ఏమ వుతోంది? ఏ గంగలో కొట్టుకుపోతోంది? ఎప్పటికప్పుడు.. ఏపేటికాపేడు వీళ్ళతో ఇలా వేగవలసిందేనా? దీనికి అంతూ పొంతూ లేదా? ఆడపిల్లల్ని చూస్తే వీళ్ళెందుకిలా వెర్రి త్తిపోతారు? " ఓ నడివయసు ఆసామి ఆవే శంగా అన్నాడు జనం మధ్య నుంచి.

"ఊరికే ఆవేశపడిపోయి అరిస్తే కుర్రాళ్ళకీ మనకీ తేడా ఏముంది? " ఓ పెద్దమనిషి, తలపండిన వృద్ధుడు అన్నాడు. సముదా యింపుగా ఆయనకి మరొక పెద్దమనిషి వంతపాడాడు.

"మీరిలా మమ్మల్ని ఎప్పటికప్పుడు చల్లార్చే యబట్టే వాళ్ళు హద్దు పద్దూలేని ఆగడాలతో రెచ్చిపోతున్నారు. వాళ్ళ అల్లరికి అంతులే కుండా పోతుంది. వెళ్ళి హాస్టల్ వార్డెన్‌కి కంప్లయింట్ ఇద్దాం పదండి!" ఒక యువ కుడు అన్నాడు ఉద్రేకంతో ఊగిపోతూ.

"హాస్టల్ వార్డెన్‌కి భయపడే స్టూడెంట్సా వీళ్ళు!"

"ఐతే కాలేజీ ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేద్దాం"

"ఆయన మాత్రం ఏం చేయగలడు? !"

ఆ గ్రామంలో అన్ని రకాల వ్యక్తులూ ఉన్నారు. చదువుకున్నా వాళ్ళు.. చదువు లేని వాళ్ళు! వ్యవసాయం చేసుకుంటున్న వాళ్లు. కూలినాలితో బతుకులను వెళ్ళదీ స్తున్న వాళ్ళు ఆఫీసులో ప్యూన్ ఉద్యోగాలు చేస్తున్నారు. కార్పొరేట్ సంస్థలలోనూ, పెద్ద పెద్ద కార్ఖానాలలోనూ డైలీ వేజ్‌లకు పనిచే స్తున్నారు. ఒకరిద్దరు గవర్నమెంట్ ఉద్యో గులు కూడా ఉన్నారు.

చాలా మందికి ఇలాంటి సంఘటనలు సర్వసాధారణంగా తోస్తాయి. తేలిక విషయా లుగా అంతగా ప్రాధాన్యం లేని వాటిగా కొట్టి పారేస్తారు. అలాంటి వారు యిలాంటి గొడ వల ఛాయకే రారు. అసలు అలాంటి సంగ తులు తమకు పట్టవన్నట్టు ఉండిపోతారు.

అయితే ప్రస్తుతం జరుగుతున్నది సాధార ణమైనది కాదు. ఓ అమ్మాయి జీవితంతో ముడిపడి ఉన్న విషయం. అందుకే కాస్త తలపండినవాళ్ళూ, జీవితసారాన్ని జీర్ణించు కున్న వాళ్ళూ మంచి చెడులను జాగ్రత్తగా అంచనా వేయగలిగినవాళ్ళూ ఆచితూచి మాట్లాడుతున్నారు.

"దీనికింతగా ఆలోచించాల్సిన పనేలేదు. పోలీసులకు ఒక సమాచారం ఇస్తే అంతా సర్దుకుంటుంది" ఆవేశంగా మరో యువ గొంతు పలికింది కసితో.

కంటికి కనిపిస్తున్నట్లుగా ఇది ఏ రాజప్రాసాదమో అనుకుంటే పొరపాటే. 16వ శతాబ్దిలో స్పెయిన్ రాజు ఫిలిప్ II నిర్మించిన క్రైస్తవ సన్యాసుల ఆరామమిది. దీన్ని ప్రపంచంలో ఎనిమిదో వింతగా స్పెయిన్ ప్రజలు పరిగణిస్తారు. కోటలా కనిపించే ఈ ఆరామంలోని కారిడార్ల పొడవు దాదాపు 10 మైళ్లు. ఇందులో అనేక చోట్ల మెట్లున్నాయి. ఈ ఆరామంలో ఉన్న ద్వారాలు, కిటికీలను లెక్కించడానికి ఎవరు ఎన్నిమార్లు ప్రయత్నించినా ఎప్పుడూ లెక్కతప్పుతూనే ఉంటుంది. దాదాపు 1250 ద్వారాలు, 2500 కిటికీలు ఉన్నట్లుగా అంచనా. ఆరామం చుట్టూ ఉన్న ప్రహరీ పొడవు 207 మీటర్లు, వెడల్పు 153 మీటర్లు. ఆరామంలోపల అద్భుతమైన కళా సంపద ఉంది. మాడ్రిడ్‌కు 25 కిలోమీటర్ల దూరంలో సియోర డి గ్వాడరమ పర్వత స్థానువుల్లో ఉన్న ఈ ఆరామం వందలాది వర్ణచిత్రాలలో ఒక మ్యూజియంను తలపిస్తుంటుంది.



"నిజమే! అదే సరైన మందు"

"గోటితో పొయేదానికి గొడ్డలితో పనే ముంది? పోలీసులతో వ్యవహారం అంత ఆషామాషికాదు. స్టేషన్ చుట్టూ తిరగాలి. వాళ్ళ కాళ్ళు పట్టుకోవాలి. నానా యాతనలూ పడాలి. అంత సమయమూ, ఓపికా మనకె క్కడివి? మనవి రెక్కాడితే గాని డొక్కాడని బతుకులు. తెల్లవారి లేస్తే ఉరుకుల పరుగులతో బతుకు బండిని లాగవలసిన వాళ్ళం. ఎందుకొచ్చిన గొడవలు"

"అయితే రాజీపడి ఇలా గాజులు తొడుగు కోవలసిందేనా"? !

"రాజీపడడం కాదు! తెలివిగా మసలుకొని తేలికగా సమస్యల్ని పరిష్కరించుకుందామంటాను" ఇందాకటి పెద్దమనిషన్నాడు.

"మంచి మాటలతో అన్ని సమస్యలూ అన్ని సందర్భాల్లోనూ తీరిపోవు. మూర్ఖులకు మూర్ఖంగానే సమాధానం ఇవ్వాలి. నెమ్మదిగా చెబితే వినరు. పైగా మెతకదనాన్ని చేతగానితనంగా చూస్తారు. అలుసు చేసి ఆటాడిస్తారు. నెత్తిమీద కాలేసి తైతెక్కలాడుతారు"

"అవును అదీ నిజమే! వేడిమీదున్న కుర్రాళ్ళకు చల్లని కబుర్లు వినబడవు"

"అయితే ఏం చేద్దామంటావు? !"

"దెబ్బకు దెబ్బ! మనమంతా ఒక్కటయి ఏకంగా హాస్టల్ మీద పడి దాడి చేస్తే తోక ముడిచి దారికొస్తారు కుర్ర వెధవలు"

"ఆ పని వాళ్ళూ చేయగలరు! అలా చేస్తే జరిగేదేమిటి? హింస.. విధ్వంసం. ఒకరినొకళ్ళు కత్తులు, కర్రలతో చంపుకుంటే పెరిగేవి కక్షలూ, పగలూ, ప్రతీకారాలే. అసలు సమస్య అలాగే ఉండిపోయి ఎప్పటికీ పరిష్కారం కాకుండా పోతుంది. గతంలో ఇలా ఎన్నిసార్లు జరగలేదు. ఉడుకు నెత్తురుతో అతి జోరు ప్రదర్శించకండి. కుర్రాళ్ళు ఈ రోజుండి రేపెళ్ళిపోతారు. మనం ఏళ్ల తరబడి ఇక్కడే జీవిస్తున్న వాళ్లం. ఎలా చూసుకున్నా కాస్త మెతకబడి ఉండడం మనకే మంచిది"వృద్ధుడి మాటలకి అంతా ఆలోచనలో పడ్డారు. మౌనంగా చూస్తూ నిలబడి ఉండిపోయారు.

"తాతయ్యా! అయితే నువ్వు ఆఖరిగా చెప్పేదేమిటి? వాళ్లెన్ని చేసినా చేతులు ముడుచుకుని కూర్చోవలసిందేనా? వాళ్ల ఆటల్ని, ఆగడాల్ని చూస్తూ భరిస్తూ ఊరుకోవలసిందేనా? ఈ రోజు శివయ్య కూతురు, రేపు నా చెల్లెలు, ఎల్లుండి మరొకరు. ఇలా అన్యాయం అయిపోవలసిందేనా? !"

"ఇప్పుడేమంత అన్యాయం జరిగి పోయిందని మీరంతా గొంతులు చించుకుంటున్నారు. కుర్రాళ్లే అయినా పెద్ద తరహాగా ఆలోచించి ముందుకొచ్చారు. సామరస్య ధోరణిలో వ్యవహరించారే గాని అతిగా ప్రవర్తించలేదు. మనతో గొడవలు పడి అమ్మాయిని బలవంతంగా ఎత్తుకుపోలేదు. పిల్ల తండ్రిని ఇస్తావా ఛస్తావా అని ఎదిరించి మాట్లాడలేదు. పెళ్ళి మాటల కోసం పెద్దలుగా వచ్చారంతే!"

అంతా మౌనంగా ఉండి గమనిస్తున్న శివయ్యకు కొందరు పెద్ద మనుషులు తనను వెనకేసుకుని రావడం, తను చేసినదాన్ని సమర్థించి మాట్లాడడం కొంత బలాన్నిచ్చింది. నైతికంగా ధైర్యాన్ని కలుగజేసింది. అనవసరపు రాద్ధాంతం జరిగితే లేనిపోని గొడవలా స్ఫాయనిపించింది, కొందరు ప్రదర్శించిన కోపతాపాలు చూసి. తన కూతురు జీవితం ఊరు పొలిమేరలు దాటి అంతటికీ వ్యాపించకూడదని శివయ్య ఆందోళన. ఇప్పుడా భయం తప్పింది.తన ఆవేదనను కొంద రయినా అర్థం చేసుకున్నారన్న తృప్తి కలిగింది.

"అయితే మన రాధతో ఆ కుర్రాడికి పెళ్ళి ఖాయమై పోయినట్టేనా? !" ఎవరో గుంపులోనుంచి గట్టిగా అన్న మాటలకు అంతా గొల్లుమన్నారు. కొన్ని నిమిషాలు వేడెక్కిన వాతావరణం నవ్వులు, చప్పట్లు అరుపులతో చల్లబడింది. అందరి వదనాల్లోనూ సంతోషపు జల్లులు కురిశాయి.

పెద్ద మనిషి మళ్లీ గొంతు విప్పి అన్నాడు.

"రాధమ్మ శివయ్య కూతురే కావచ్చు. ఇది శివయ్య సమస్యే కావచ్చు కాని ఇది మన ఊరి గొడవ. మనందరి గొడవ. కాబట్టి మన

మంతా బాధ్యతగా ప్రవర్తించాలి. శివయ్యలా ఓర్పుతో, సహనంతో వ్యవహరించాలి"

"వాళ్ళు నిజంగానే పెద్దల్ని తీసుకొని వస్తే"

"రానివ్వండి! మంచి చెడులను అంతా కలిసే చర్చించుకుంటాం. సమస్య సామరస్యంగా ఒక కొలిక్కి వస్తే అంతా సుఖాంతం అవుతుంది. లేకుంటే లేదు. అయినా ఈ విషయంలో వాళ్ల పెద్దలు అంతగా చొరవ చూపుతారన్న నమ్మకం నాకు లేదు. అందుకే శివయ్య అలా చెప్పి కుర్రాళ్లను శాంతంగా వెనుదిరిగేట్టు చేశాడు" అన్నాడు ఆ పెద్ద మనిషి శివయ్యకేసి చూసి. శివయ్య అవునన్నట్టు తలాడించాడు.

"లేదు! వాళ్ళ స్పీడ్ చూస్తుంటే పెద్దల్ని వొప్పించి తీసుకొచ్చేటట్టుంది"

"రానీ! అప్పుడాలోచిద్దాం... ఎలాగూ అమ్మాయి పెళ్లి చేసెయ్యడానికి శివయ్య సిద్ధపడి ఉన్నాడు. సంబంధం మంచిదైతే మంచే జరుగుతుంది!"

"ఏమో? ఇదంతా ఏదో సినిమాలా ఉంది. ఇలాంటివి సుఖాంతమవుతాయన్న గ్యారంటీ లేదు" అంటూ పెదవి విరిచాడు ఒక పెద్ద మనిషి.

"అలాంటిదేం జరగదు. మనమంతా ఒకే మాటగా ఉంటే ఎలాంటి చెడూ జరిగే అవకాశం ఉండదు. నన్ను నమ్మండి. ఓపికతో నేను చెప్పినట్లు చెయ్యండి" అని చెప్పి లేచాడాయన.

**11**



"ఎప్పుడూ చదువేనా! ఎప్పుడో జరిగే పరీక్షల కోసం ఇప్పట్నుంచీ పుస్తకాలతో కుస్తీలెందుకు? హాయిగా అలా అటూ ఇటూ తిరగొచ్చు కదా! లేకపోతే నాతో ఎంచక్కా కబుర్లు చెప్పు"

గదిలో ఇద్దరు ఉంటున్నా ఉలుకూ పలుకూ లేకుండా మౌనంగా మహామునుల్లా ఎవరి మానాన వాళ్లుండడం రాముకిష్టం లేదు. ఎప్పుడూ పాటలూ సరదా మాటలతో కాలం గడిచిపోతున్న రాముకి గదిలో సురేష్‌తో ఉండడం చాలా కష్టంగా, అసహనంగా అనిపిస్తోంది. భరించలేని విసుగు కలిగిస్తోంది.

సురేష్ తనకు రూమ్మేట్‌గా వచ్చి ఆర్నెల్లకు పైగా అయినా ఇద్దరి మధ్యా ఎలాంటి సాన్నిహిత్యం ఏర్పడలేదు. మనసు విప్పుకుని మాట్లాడుకోవడం జరగలేదు. ఏదో యాంత్రికంగా కాలం దొర్లిపోతోంది ఇద్దరి మధ్యా.

సురేష్ మాటల మనిషి కాకపోయినా అసలు మాట్లాడని మనిషి కాదు. అవసరం అనుకుంటే మాత్రం జంకూగొంకూ లేకుండా మాట్లాడతాడు. అది రాముకి నచ్చినా సరదాగా పోచుకోలు మాటలసలు మాట్లాడకపోవడంతో సురేష్‌తో గడపడం కాస్త ఇబ్బందిగా అనిపిస్తోంది రాముకి.

"నిన్నే గురూ! మాట్లాడు" అని గద్దించినట్టు అన్నాడు రాము.

సురేష్ మళ్లీ ఓ చిన్న నవ్వు విసిరి పుస్తకంలో తల దూర్చేశాడు.

"నీకెలాగుందో గానీ నాకు మాత్రం నిన్ను చూస్తుంటే పిచ్చెక్కినట్టనిపిస్తోంది"

"నేను చదువుకుంటుంటే నీకు పిచ్చెందుకు...? !"అన్నాడు సురేష్ పుస్తకాన్ని మడిచి పక్కన పెట్టి.

"నీ తీరు చూసి చూసి బోరు కొట్టి"

సురేష్ గట్టిగా నవ్వేశాడు.

"భోజనం టైం అయింది. వస్తావా!" అడిగాడు రాము.

"నువ్వెళ్ళు నేను తర్వాత తింటాను" అన్నాడు సురేష్.

"ఆకలితో ఉంటే చదువెలా ఒంటబడుతుంది"

ఉదయం టిఫిన్ కోసం మెస్‌కి వెళుతూ సురేష్‌ని కూడా తనతో రమ్మన్నాడు రాము. సురేష్ తర్వాతని చెప్పి చదువులో పడిపో

యాడు. అలా పుస్తకం తెరిచి పదకొండుదాకా గడిపేశాడు. ఆ తర్వాత టిఫిన్ ఊసే ఎత్త లేదు. ఒక గ్లాస్ టీతో ఉదయాన్నుంచి ఒంటి గంటదాకా ఎలా ఉండగలుగుతున్నాడా అని ఆశ్చర్యపోతున్నాడు రాము. ఈ రోజే కాదు, ఈ ఆర్నెల్ల నుంచీ తనకు తెలిసి ఇదే పద్ధతి సురేష్‌ది.

ఏదో తినాలి కదా అన్నట్లు మెస్‌కెళ్ళి రెండు మెతుకులు కెలుకుతాడంతే. మెస్‌లో ఏం తిన్నాడు... ఈ పూట కూరేంటి? టిఫి నెలా ఉంది? ఇలాంటి మాటలు, ఆలోచనలు సురేష్ దగ్గర మచ్చుకి కూడా ఉండవు.

"ఇంట్లో కూడా ఇంతేనా? లేక ఇక్కడి తిండి సహించకనా" అనడిగేడు రాము సురే ష్‌ని. ఎలాగోలా ఏదో ఒకటి మాట్లాడి సురే ష్‌తో సరదాగా కాలక్షేపం చేయాలన్నది రాము ప్రగాఢ వాంఛ. అది మాత్రం రాముకి తీరని కోరికగా మిగిలిపోవడమే కాదు - గొప్ప సవాల్‌గా తయారయింది.

సమాధానంగా సురేష్‌నుంచి నవ్వే వచ్చింది అలవాటుగా.

సురేష్ ప్రవర్తన, పద్ధతి రాముకి చాలా ఆశ్చర్యంగా అనిపిస్తోంది. సహజంగా కుర్రాళ్ళ కుండే దుడుకు స్వభావం శూన్యం అత నిలో... ఒక సినిమా అనడు. ఒక పాట ఉండదు. ఆట ఊసు ఎత్తడు. ఎప్పుడూ ఒకటే పని. చదువు చేతిలో నుంచి పుస్తకం వొదిలిపెట్టడు. గదిలో అటు ఇటు కదిలిన ప్పుడు కూడా పుస్తకం చేతిలో ఉండాల్సిందే. ఆఖరికి అత్యవసరంగా బాత్‌రూం కెళ్ళినా వేళ్ళ మధ్య పుస్తకం అతుక్కుపోయి ఉంటుంది. ఇదేం పిచ్చో అనుకున్న రాము "నిన్ను చూస్తే జాలేస్తుంది సురేష్" అన్నాడు.

"జాలెందుకు?!"

"జీవితంలో ఒక గొప్ప అనుభూతినీ, ఆనం దాన్నీ కోల్పోతున్నందుకు"

"అలా ఎందుకనుకోవాలి? మనమొ చ్చిందిక్కడికి చదువుకోడానికి"

"కావచ్చు కాని చదువుతోపాటు కొన్ని కొత్త విషయాలూ నేర్చుకోవాల్సిన వయసు మనది. తిండి సంగతి సరే! కనీసం స్టైలిష్‌గా బట్టలే స్కోవాలి. సరదాగా కబుర్లు చెప్పుకోవాలి. ఫ్రెండ్స్‌తో సరదాగా గడపాలి. సినిమాలు షికార్లూ తిరగాలి. ఇవి ప్రతీ స్టూడెంటూ కాలేజీ లైఫ్‌లో కనీసం చేసే పనులు. నువ్వు మాత్రం మరీ మడికట్టుకుని కూర్చువడం ఏం బాగోలేదు నాతో రా! లేకపోతే మా సూర్యంని అడిగి తెల్సుకో. అతనికి తెలియని విషయాలు లేవు" అన్నాడు రాము.

"సూర్యమా అతనెవరు?!" అనేసరికి రాము తలపట్టుకున్నాడు చిరాగ్గా.

"సూర్యం గురించి తెలియదూ! నువ్వసలు ఈ లోకంలోనే ఉన్నావా?! పోనీ జగ్గు సంగతి?" అన్నాడు రాము విసుగ్గా ముఖం పెట్టి.

"ఎవరు?! ఏదో ఎఫైర్‌లో ఆత్మహత్యకు పాల్పడ్డాడే... అతనేనా?"

"అతనేనా అని అంత తేలిగ్గా తీసిపారేస్తా వేంటి? పోనీలే బతికించావు. ఆ సంగత యినా పట్టించుకుని గుర్తుపెట్టుకున్నావు" అన్నాడు రాము నవ్వి.

రాము అనుకుంటున్నట్టుగా సురేష్ అమా యకుడేం కాదు. ఏమీ తెలియనివాడు కాదు. కాకపోతే తనకు సంబంధించనివీ, అవసరం లేనివీ సురేష్ వినీవిననట్లు ఊరుకుంటున్నా డన్నసంగతి రాము గ్రహించలేకపోతున్నాడు.

విద్యార్థికి ఏది ముఖ్యమో అదే తను చేసి చూపెడుతున్నాడని రాము అర్థం చేసుకునే స్థితిలో లేడుకాబట్టే అతని దగ్గర ఏమీ తెలి యనట్టు ముభావంగా ఉండడం అలవాటుగా చేసుకున్నాడు సురేష్.

12



ఆ రోజు ఉద యాన్నే లేచి ఊరుకి పయనమయ్యాడు

సూర్యం. సూర్యం తనపై చూపిస్తున్న శ్రద్ధకి జగ్గు మురిసిపోతున్నాడు. ఆనందంతో తబ్బిబ్బయిపోతున్నాడు. జగ్గుకి తన ప్రేమ ఫలిస్తుందన్న నమ్మకం కలిగింది సూర్యం చొరవ చూసి. సూర్యం తల్చుకుంటే ఏదైనా చెయ్యగలడని జగ్గుకి గట్టి విశ్వాసం. తన మీద తనకి నమ్మకం లేకపోయినా సూర్యం మీద అతనికున్న గురి అంతా ఇంతా కాదు.

నిజానికి జగ్గు ఆత్మహత్యా యత్నం చేసింది సూర్యంలో కదలిక తీసుకురావాలనే. జగ్గు అనుకున్నట్టే అయింది. సూర్యం తీవ్రంగా ప్రతిస్పందించాడు. అలా కాకుండా ఫలానా అమ్మాయిని ప్రేమించాను పెళ్ళి చేస్కోవాలనుకుంటున్నానంటే సూర్యం తేలిగ్గా కొట్టిపారేస్తాడు. పైగా ఎగతాళి చేస్తూ ఆటపట్టిస్తాడు. అది తను భరించలేడు. తను రాధను ఎంత డీప్‌గా లవ్ చేస్తున్నాడో సూర్యం అర్థం చేస్కోవాలంటే మాటలతో కాదని జగ్గుకి బాగా తెలుసు. పైగా సూర్యం ఆసరా లేకుండా తన ప్రేమను ఫలింపచేసుకునే ధైర్యం తనలో లేదు. ఎవరో ఒకరితోడు ఉంటే తప్ప అది సాధ్యం కాదు. తనకు అండగా నిలిచి ఆదుకునే వ్యక్తి సూర్యం ఒక్కడే. అందుకే ఏదో ఒకటి చేయాలనుకొన్నాడు. అయితే ఏం చేయాలో ఎలా చేయాలో అంతుపట్టలేదు. ఆ సంఘర్షణలోనే ఆత్మహత్యాప్రయత్నం చేశాడు. నిద్రమాత్రలు మింగేశాడు. ఆ ఒత్తిడితో జగ్గుకి తను నిజంగా చనిపోతాడనిగాని చనిపోతే రాధతో తన పెళ్ళి జరిగే అవకాశం ఉండదని గాని కనీసం ఆలోచనైనా రాలేదు. తనకు కావాల్సింది రాధ తిరస్కారం తననెంతగా బాధించిందో సూర్యం గ్రహించాలి. అతడు పూనుకొని ఆమెను, తనను ఒక్కటి చేయాలి. అంతే, అతడి భావన.

"రా నాయనా! బాగున్నావా? ఊరు నుంచి ఇదేనా రావడం. మావాడు రాలేదా! ఎలా ఉన్నాడు. బావున్నాడా. బాగా చదువుకుంటున్నాడా? "

సూర్యాన్ని చూడగానే జగ్గు తల్లిదండ్రులు ఏకధాటిగా ప్రశ్నల వర్షం కురిపించేశారు. వారి ప్రేమాభిమానాలు సూర్యాన్ని ఉక్కిరిబిక్కిరి చేసేశాయి. జగ్గుతో సమానంగా మొదట్నుంచీ ఆదరిస్తూనే ఉన్నారు వాళ్ళు సూర్యాన్ని. అదే ఇంటిలో ఇద్దరూ కలిసి తిరిగారు. చిన్నప్పట్నుంచీ. ఆడుకున్నారు, పాడుకున్నారు. ఇద్దరిదీ ఒకటే కంచం, మంచం లాగ సాగింది ఆ ఇంట్లో.

విషయాన్ని ఎలా ప్రస్తావించాలో ఎక్కడి నుంచి మొదలు పెట్టాలో సూర్యంకి బోధపడడం లేదు. ఇలాంటి పరిస్థితి ఎదురవుతుందని ముందు ఊహించలేదు. జగ్గులాగే ఎదిగేదశలో ఉన్న తనీబాధ్యత మోయాల్సి వస్తుందని కూడా ఇంతవరకు అనుకోలేదు. కానీ, జగ్గుకోసం ఇప్పుడు తప్పడం లేదు.

స్టేషన్నుంచి నేరుగా ఇక్కడికే వచ్చాడు. ఇంటిక్కూడా వెళ్ళలేదు. వెళ్ళాలనిపించలేదు కూడా. వెళితే కారణాలడుగుతారు. తన ఇల్లు అదే వీధిలోనే అయినా కాస్త దూరం.

"ఇంకా ఇంటికెళ్ళినట్టులేదు. ముందు స్నానం అదీ చేసిరా బాబు సాయంత్రం కలుద్దాం" అన్నాడు జగ్గు తండ్రి చంద్రన్న సూర్యం ముఖంలోని అలసటని గ్రహించి.

"మీరు మరీను" అంటూ జగ్గు తల్లి రావాలమ్మ భర్తని ఈసడించుకుంటూ "వేడ్నీళ్ళు పెడతానుండు బాబూ! ఇక్కడే చేద్దువు గాని!' ' అంది.

"ఒద్దమ్మా. నేను మళ్ళీ వెంటనే వెళ్ళిపోవాలి. ఇంటికెళ్ళే సమయం కూడా లేదు. కేవలం మిమ్మల్ని కలవాలనే వచ్చాను" అన్నాడు సూర్యం.

"జగ్గు డబ్బులేమైనా తెమ్మన్నాడా? !" చంద్రన్న అన్నాడు.

అతని మాటలతో ఏదో అనుమానం పొడసూపి "మొన్ననే అడిగినంతిచ్చాను. మళ్ళీ ఏం అవసరం వచ్చింది? "

"అబ్బే! డబ్బవసరం కాదు"

సూర్యం గుండెల్లో గుబులుగా ఉంది. ఆవేశంతో నిర్ణయం తీసుకుని వచ్చేశాడే గాని

వచ్చాక గాని తెలియలేదు తను చేస్తున్నది ఎంతటి క్లిష్టమైన సాహసమో.

ఆఖరికి ఎలాగో తెగించి విషయం చెప్పే శాడు సూర్యం. అది విన్న ఆ తల్లిదండ్రులు నిలువెల్లా కదిలిపోయేరు.

"అయ్యో! అంత పని చేశాడా? ఆత్మహత్య చేసుకునే అగత్యం వాడికేమొచ్చింది? ఓరి భగవంతుడా! మేమేం పాపం చేశాం. ఒక్కగా నొక్క బిడ్డ. అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేశాం. కంటికి రెప్పలా చూసుకుంటున్నాం. నా బిడ్డకేం కష్టం ముంచుకొచ్చింది" రావాలమ్మ దీర్ఘాలు తీస్తూ ఉన్నపళంగా ఏడుపు పెడబొబ్బలు మొదలు పెట్టింది.

"అమ్మా! ఊరుకో! జగ్గు ఇప్పుడు బాగానే ఉన్నాడు. వాడికేం కాలేదు" అన్నాడు సూర్యం ఊరడింపుగా.

"అసలేం జరిగింది బాబూ! అంత పని చెయ్యాల్సిన బాధ ఏమొచ్చింది. ఏం కావాలన్నా ఇస్తున్నాను. శక్తికి మించిన పనే అయినా రెక్కలు ముక్కలు చేసుకుని చదివిస్తున్నాం. అంత దూరంలో... ఆ మహా నగరంలో ఏ ఇబ్బందీ కలగకూడదని వచ్చినప్పుడల్లా వాడు అడక్కపోయినా కావలసినంత డబ్బిస్తున్నాను" చంద్రన్న కన్నీరు మున్నీరవుతూ అన్నాడు.

"ఎవరో అమ్మాయినిష్టపడ్డాడట. ఆమె ఏదో అందని ఆ పని చేశాడు" చాలా ఇబ్బందిగా ముఖం పెట్టి చెప్పాడు సూర్యం.

"చాలా రోజులుగా సాగుతోందీ వ్యవహారం. నేను కూడా కనిపెట్టలేకపోయాను"

"ఇందుకేనా వాడంత దూరం వెళ్లింది. బుద్ధిగా చదువుకోకుండా ఇవేం పనులు? !" చంద్రన్న వదనంలో దుఃఖం పోయి కోపం తొంగి చూసింది. "వాడు చదివిన చదువేమయింది. ఇక్కడ మేము వాణ్ణి కన్నవాళ్ళము న్నామన్న ఇంగితమైనా లేదా! కన్నవాళ్ల కంటే ప్రేమ ఎక్కువయ్యిందా? ! ఒక ఆడ పిల్ల కోసం ప్రాణాలు తీసుకుంటాడా? వాడికసలు మతుందా? ! ఛీ! అలాంటి వాడి కోసం నేనెందుకు రేయింబవళ్లు కష్టపడాలి. చదువూ సంధ్యా జాన్తానై. ఇంకింటికి దయచేయమను' ' తెగేసినట్లు అన్నాడు.

"అలా అంటే ఎలాగ! ఏదో తెలియక చేశాడు" అంది రావాలమ్మ భర్త మాటలకు వెంటనే, కొంగుతో కళ్లొత్తుకుంటూ.

"అసలిదంతా నీ వల్లనే. నేను ముందే చెప్పాను- వాడికి చదువు మీద శ్రద్ధ కంటే అనవసరపు విషయాలమీదే యావెక్కువ. కండలు పెంచడం... కష్టం తెలియకుండా బలాదూరుగా తిరగడం. ఇదంతా నువ్విచ్చిన అలుసు కదూ. వాడు చదివి ఉద్ధరిస్తాడన్న నమ్మకం నాకెప్పుడో పోయింది. అందుకే అన్నాను చదివింది చాలు. ఏదైనా పనిలో చేరమని. నా మాట ఖాతరు చేయలేదు. ఇప్పుడు సూడు ఏమయ్యిందో! ఇదంతా నా ఖర్మ" అంటూ చంద్రన్న తల పట్టుకున్నాడు దీనంగా.

"మీరనవసరంగా ఆవేశపడిపోయి నాకు ఆయాసం తెప్పించకండి. జరిగిందేదో జరిగిపోయింది. జరగాల్సింది చూడండి" అంది రావాలమ్మ.

"నన్నేం చేయమంటావే! ఏ ఏట్లో దూకమంటావు? "

"ఇంతవరకూ వచ్చాక ఊరుకోవడం ఎందుకు? ఏమో ఇదీ మన మంచికే వచ్చిందేమో? !" అంది భర్తను ప్రోత్సహిస్తూ.

"అంటే! ఏంటే నీ ఉద్దేశ్యం? "

"మనం కూడా వెళ్ళి మాట్లాడుదాం"

"ఎవరైనా వింటే నవ్వుతారు! సిగ్గు లేదూ. తల్లిగా ఆ మాటనడానికి!"

"తల్లిని కాబట్టే బాగా ఆలోచించి చెబుతున్నాను. మన బిడ్డ మనకు దక్కడం మనక్కావాలి"

"ఛీ! వాడు నా బిడ్డని చెప్పుకోవడానికే అసహ్యం వేస్తోంది" అన్నాడు చంద్రన్న ముఖం చిట్లించి.

"అంతమాత్రాన వాడు మన బిడ్డ కాకపోడు. మనం వాణ్ణి కన్నవాళ్లం కాకమానం. కాస్త నిదానంగా ఆలోచించయ్యా"

"ఇంకా ఆలోచించేదేముంది! అదేదో నువ్వే

పడు నా వల్ల మాత్రం కాదు" అనేశాడు చంద్రన్న ఆవేశంగా అక్కడ్నుంచి కదిలి.

అంతా గమనిస్తూ అక్కడే నిలబడి ఉన్న సూర్యానికి నోట మాట రావడం లేదు. ఏం చేయాలో ఎలా మాట్లాడాలో అతనికి దిక్కు తోచడం లేదు. అందుకే గంభీర వదనంతో మౌనంగా ఉండిపోయాడు. ఎలాగో ప్రాధేయ పడి చంద్రన్న కోపాన్ని తగ్గించి శాంతించేలా చేసింది రావాలమ్మ. విసురుగా పైకి లేచిన చంద్రన్న మళ్లీ నెమ్మదిగా కూర్చున్నాడు.

రావాలమ్మ వెంటనే సముదాయిస్తూ చెప్పింది భర్తతో.

"ముందు మనం జగ్గుని కలవాలి. అన్నీ మాట్లాడి వాడిని దారిలోకి తీసుకురావాలి"

"ఇంత జరిగాక వాడు మన మాట వింటాడా? !"

"వినడు. నాకు తెలుసు. మనం కూడా ఆ పిల్ల తండ్రిని కలుద్దాం. మాట్లాడుదాం. ఆ తర్వాత జరిగేదేదో ఆ పైవాడే జరిపిస్తాడు. అంతదాకా మనం కాస్త ఓపిక పట్టాలి. తప్పదు. ఒక్కగానొక్క బిడ్డ. వాడి కోసమే బతుకుతున్నాను. వాడికేమైనా జరిగితే నేను తట్టుకోలేను. నా మాట విను. నీ మనసు మార్చుకుని శాంతంగా ఆలోచించు. ఆవేశం సమస్యల్ని మరింత జటిలం చేస్తుంది. నా తల్లి కడుపును అర్థం చేస్కోవయ్యా" అంటూ

## బారుదాసులకు గుడ్‌న్యూస్

'తాగేవాడికి తాగేందుకో సాకు ఉంటే చాలు' అంటారు తాగని వాళ్లు. వాళ్ల మాటల కేంగానీ, బీరుబాబులకు బారుదాసులకు మాత్రం ఒక శుభవార్త. లండన్‌లోని సెయింట్ థామస్ హాస్పటల్‌లో డాక్టర్లు బీరు బాబులకు చాకులాంటి సాకును అందిస్తున్నారు. సాధారణంగా పాలలోని కాల్షియం వల్ల ఎముకలు గట్టిపడతాయి కాబట్టి గట్టి ఎముకల కోసం పాలు తప్పించి తాగేందుకు మరో డ్రింకు లేదని అనుకుంటూ వస్తున్నాం. కానీ లండన్ డాక్టర్లు 2847 మంది స్త్రీ, పురుషులను పరిశీలించి రోజుకు 40 మిల్లీగ్రాముల 'సిలికాన్' తీసుకున్న వారి ఎముకలు పుష్టిగా ఆరోగ్యకరంగా ఉంటాయని తేల్చారు. ఈ సిలికాన్ ఖనిజం శరీరంలో 'కొల్లాజెన్' ఉత్పత్తిని పెంచుతుంది. ఈ కొల్లాజెన్ ఎముకలకు శక్తినిస్తుంది. దీన్లో 'బీరుబాసు'లకు పనికొచ్చే సాకేముందనుకుంటున్నారా? ఇక్కడే ఉంది మెలిక. పాల తరువాత అంత ఎక్కువ పాళ్లలో సిలికాన్ బీరులోనే ఉందని వీరు కనుగొన్నారు. బీరు బాటిళ్లపైన 'సిలికాన్' ఎంత ఉందో రాయరు. కాబట్టి ఎంత తాగితే ఎముకలు ఎంత గట్టి పడతాయో నిర్ణయించుకోవటం కష్టం. 340 మిల్లీలీటర్ల బీరులో 7 మిల్లీగ్రాముల సిలికాన్ ఉంటుందట. అయితే ఎముకలు గట్టి పడాలని బీరు తాగేవారు అధికంగా తాగేసి, అలవాటు లేనివారు అలవాటు చేసేసుకోవాల్సిన అవసరం లేదంటున్నారు ఆ బ్రిటీష్ డాక్టర్లు. ఖర్జూరం, మామిడిపళ్లు, పుచ్చకాయలు, పాలకూర, ఆపిల్స్, మినరల్ వాటర్ వంటి వాటిలో కూడా సిలికాన్ ఉంటుంది. కాబట్టి పాలు తాగండి. పళ్లు తినండి. ఎముకలు గట్టిపడతాయి అని బీరు తాగనివారికి సలహాలిస్తున్నారు వీరు. అయితే తాగేందుకు సాకు వెతికే వాళ్లు తాగనివారికి మినరల్ వాటర్ ఇచ్చి తాము సుబ్బరంగా తాగేస్తారు. ఏమన్న అంటే సిలికాన్ జిందాబాద్ అంటారు. మీరేం అంటారు!



రావాలమ్మ భర్తను ప్రాధేయపడింది.

* * *

ఉన్నపళంగా ఊరుకి బయల్దేరారు ముగ్గురూ కలిసి. చంద్రన్న, రాములమ్మ కొడుకుతో ముందు సుదీర్ఘంగా మాట్లాడారు. నయానా భయానా నచ్చజెప్పి చూశారు. జగ్గు ససేమిరా అన్నాడు. ఆ అమ్మాయిని మరిచిపోవడం కల్లని చెప్పేశాడు. అంతే కాదు. రాధతో తనకు పెళ్ళి చేయకపోతే జీవితాంతం పెళ్ళి లేకుండా అలాగే ఉండిపోతానని మంకుపట్టు పట్టాడు.

జగ్గు మాటలు విన్నాక ఆ కన్నవాళ్ళకి పరిస్థితి చేయిదాటిపోయిందని అర్థమైపోయింది.

సూర్యాన్ని వెంటబెట్టుకుని రాధ తండ్రిని కలిశారు.

రారనుకున్నవారు నిజంగానే హఠాత్తుగా ఊడిపడే సరికి శివయ్య మొదట బిత్తరపోయాడు.

తమలాగే పేదవాళ్లే కావడం, తమ కులం వాళ్లే కావడం, అమ్మాయి చూడముచ్చటగా ఉండడం కొంతలో కొంత చంద్రన్న రావాలమ్మలకు సంతృప్తినిచ్చింది.

ఇంతకీ అమ్మాయి మనసులో ఉన్నదేమిటన్న ప్రశ్న ఇరువురిలోనూ ఉదయించింది. ఆ తర్వాత శివయ్య మాటలు విన్నాక రాధ తండ్రి చాటు బిడ్డని తండ్రేంచెబితే అలాగే చేస్తుందని అర్థమయింది వాళ్ళకి.

ఇరుపక్షాలూ దీర్ఘంగా చర్చించుకున్నా ఔననిగాని కాదనిగాని ఒక నిర్ణయానికి రాలేకపోయారు చివరికి.

కొడుకు కోసం వచ్చిన ఆ తల్లిదండ్రులు మాత్రం నీ చదువు సక్రమంగా సాగిస్తే నువ్వు కోరినట్టే చేస్తామని మాటిచ్చి ఊరికి పయనమయ్యారు.

ఆ మాటకు జగ్గు ఎగిరిగంతేశాడు.

## 13

"రేపు నీ ప్రోగ్రాం ఏంటి రాము" అడిగాడు ఆ రాత్రి సూర్యం పడుకోబోయే ముందు.

రాము ఇప్పుడు సూర్యం గదిలోనే ఉంటున్నాడు. సురేష్ నుంచి దూరమయ్యేసరికి రాముకి గొప్ప రిలీఫ్‌గా అనిపించింది.

సూర్యం సాహచర్యంలో నిరంతరం గడపడం అతని మనసుకు సంతోషం కలిగిస్తోంది. ఆత్మీయ బంధువులా అగుపిస్తున్నాడు తనకిప్పుడు సూర్యం.

"రేపు కాలేజీ లేదు కదా! హాయిగా ఎంజాయ్ చేయడమే" అన్నాడు రాము.

"ఏం! కాలేజీ క్లాసులుంటే ఎంజాయ్‌మెంట్ ఉండదా" సూర్యం గట్టిగా నవ్వి అన్నాడు.

"ఉండదు సూరి"

"ఎందుకని"

"ఎందుకో... ఆ పేరెత్తితేనే దిగులు... చెప్పలేని భయం ఆవహిస్తాయి నన్ను. లెక్చరర్స్ గంటలు తరబడి లెసన్స్ చెబుతుంటే వింటూ కూర్చోవడం మహాబోర్‌గా ఉంటుంది నాకు. అంతకంటే నరకమే నయం అనిపిస్తుంది. కాలేజీ బిల్డింగ్ వైపు కన్నెత్తి చూస్తే చాలు. నాలో చెప్పలేని అసహ్యం విసుగు కలుగుతాయి. ఎప్పుడు క్లాసులు పూర్తవుతాయా కాలేజీ లాంగ్‌బెల్ ఎప్పుడు మోగుతుందా అని ఎంతగానో ఎదురుచూస్తాను. అనుక్షణం ఈ ఆరాటంతో పిచ్చెక్కినట్టు ఉంటుందంటే నమ్ము. ఈ శిక్ష పరీక్షలయ్యేదాకా తప్పదు"

"నీకే కాదు నాకూ ఆ మాటకొస్తే అందరికీ అంతే! కానీ మనం వచ్చింది. చదువుకోవడానికి ఎలాగోలా ఆ బాధ్యత కూడా కాస్త తీర్చాలిగా"

అదేమో నాకు తెలియదు. కాలేజీ అంటే నాకు మాత్రం ఎవరూ అనుభవించని బాధ. రేపు నీతో నేనూ టౌన్‌కొస్తాను" సూర్యం రోజూ కాలేజీ కాగానే టౌన్లోకి పోతాడు. ఎందుకెళతాడో తెలియదుగానీ తను కూడా అతనితో కలిసి తిరిగి రావాలని అనిపిస్తుంటుంది రాముకి.

"తప్పకుండా! రేపు నీకొక ముఖ్యమైన వ్యక్తిని పరిచయం చేస్తాను" అన్నాడు సూర్యం.

"అలాగా! ఎవరాయన? !" రాము ఆసక్తిగా చూశాడు అతడివైపు. అంతలో ఎవరో

తలుపు తట్టిన శబ్దం.

"ఎవరు? "

"ఇంకెవరు? మన అమరప్రేమికుడు. వెళ్ళి తలుపు తియ్యి!" అన్నాడు సూర్యం హుకుం జారీ చేస్తున్నట్టుగా.

రాము వెంటనే లేచి తలుపు గెడ తీశాడు. సూర్యం చెప్పినట్టుగానే జగ్గు అక్కడ నిలబడి ఉన్నాడు.

"ఇంకా నిద్రపోలేదా! సారీ... డిస్టర్బ్ చేశాను" హడావుడిగా గదిలోకి ప్రవేశించి అంతే హడావుడిగా బేస్‌గిటార్ తీసుకుని "గుడ్‌నైట్" అంటూ వెళ్ళిపోయాడు జగ్గు.

తలుపు మూసి గడియ పెట్టి వచ్చాడు రాము. పక్క సర్దుకుని మళ్ళీ పడుకున్నాడు సూర్యం వైపు తిరిగి "అర్ధరాత్రి పన్నెండవుతోంది. ఇప్పుడు గిటారెందుకు? " అన్నాడు.

"వాడంతే! ప్రేమావేశం ఎక్కువైతే వేళా పాళా వుండదు. కలలో ప్రేయసి కనిపించి గిటార్ వాయించమని అడిగుంటుంది. ప్రేయసి కోర్కె తీర్చడం ప్రియుడి తక్షణ కర్తవ్యం కదా" నవ్వాడు సూర్యం.

"జగ్గు గిటార్ అంత బాగా వాయిస్తాడా? !"

"వాడి బొంద. ఊరికే వేళ్ళతో తీగల్ని కెలుకుతాడు. అంతే. తీగలు పుటుక్కు మంటాయి. ఇప్పటికి వాడు వాడిన గిటార్ తీగలతో మన హాస్టల్ చుట్టూ ఫెన్సింగ్ కట్టొచ్చు" అని నవ్వాడు సూర్యం వెటకారంగా.

"నేర్చుకోవచ్చు కదా!"

"అదీ అయ్యింది. నీకు నేర్పడం నా వల్లకాదనేస్తున్నారు ఎవరి దగ్గరికెళినా! దాంతో మనవాడు రోషంతో మీరు నాకు నేర్పేదేమిటి నా అంతట నేనే నేర్చుకుంటానని శపథం చేశాడు.

"అయినా ఇంత చలిలో టెర్రస్ మీద ఎలా ఉండగలుగుతున్నాడు? " అడిగాడు రాము.

"వాడు ఉండడం లేదు. వాడు ప్రేమించిన ప్రేయసి, వాడికి పట్టిన ప్రేమ దయ్యం ఉంచుతోంది పాపం! వాడి సంగతి మనకెందుగ్గాని రేపు నువ్వు నాతో వస్తున్నావు! సరేనా!" అంటూ సూర్యం టాపిక్ మార్చాడు.

"ఇంతకీ నాకు పరిచయం చేయబోయే వ్యక్తి ఎవరు? "

"రేపు నీకే తెలుస్తుందిలే"

"ప్లీజ్ సూర్యం చెప్పవూ" అంటూ రాము బతిమాలుతూ సూర్యంకి దగ్గరగా జరిగాడు.

"సరే! ఆయనెవరో చెప్పనుగాని ఆ



వ్యక్తివల్ల నీకు కలిగే అద్భుతమైన అదృష్ట యోగాన్ని చెబుతాను" అని సూర్యం పక్క మీద వొత్తిగిల్లాడు.

"అదృష్టయోగమా? !" అంటూ రాము కళ్ళు విప్పార్చాడు. బెడ్‌లైట్ వెల్తుర్లో అతని కళ్ళు తళుక్కుమన్నాయి.

"మామూలు అదృష్టం కాదు. నువ్వూహించనిది. నిన్ను పైకి తీసుకొచ్చి అందలమెక్కించేది. అందరి దృష్టిలో అంటే బాహ్య ప్రపంచంలో నీ కీర్తిని పెంచేది. కళాకారుడుగా నిన్ను మహా గొప్పవాణ్ణి చేసేది"

సూర్యం అంటున్న ప్రతీమాట రాములో అంతులేని ఆశల్ని రేకెత్తిస్తుంది. ఉద్వేగంతో, ఉత్సాహంతో ఊగిపోయేట్టు చేసేస్తోంది. ఆ ఆనందాన్ని, టెన్షన్ని తట్టుకోవడం రాముకి సాధ్యం కావడం లేదు.

సబ్జెక్ట్ ఊసెత్తితేనే రాము ఉస్సూరనేవాడు.
అసలు ఆ ప్రస్తావన తేనిచ్చేవాడు కాదు.
అందుకే ఆఖరికి రాముతో
ముభావంగా ఉండడం
అలవాటు చేసుకున్నాడు సురేష్

బాహ్యప్రపంచంలో కీర్తిప్రతిష్టలా! తన పేరు నలుమూలలా వ్యాపించడమా! రాష్ట్రమంతా తనను పొగిడి ఆరాధించడమా? ! జాతీయ స్థాయికెదిగిపోవడమా? ! ఇది నిజమేనా? సాధ్యమేనా? ! తనకంతటి యోగముందా? తనలో అంతటి కళాభినివేశాలున్నాయా? !

రాము మనసు పూర్తిగా వశం తప్పి ఆవేశంలో పడిపోయింది. ఆనందోత్సాహాలతో నిండి పోయింది.

ఇన్నాళ్లూ ఎదురు చూశాడు.

కలలుకన్నాడు. తపించిపోయాడు.

"సూరి! ఇది నిజమా!" రాము ఉత్సాహంగా అడిగాడు నమ్మలేక.

"ఏం! నామీద నమ్మకం లేదా! రేపు నువ్వే చూస్తావుగా!

"ఇంతకీ ఆయనెక్కడుంటున్నారు? !"

"తినబోతూ రుచి అడగడం దేనికి!"

"ప్లీజ్ సూరి! నాకు చాలా ఆత్రంగా వుంది"

"రేపటిదాకా ఓపిక పట్టు!" అంటూ సస్పెన్స్‌లో పెట్టేశాడు సూర్యం రాముని. అతని తపన గ్రహించి టాపిక్ మార్చే ప్రయత్నం చేశాడు. అలా మాట్లాడుతూనే నిద్రలోకి జారుకున్నాడు సూర్యం. రాముకి మాత్రం ఆ రాత్రి నిద్ర కరువయ్యింది.

* * *

పూర్తిగా చదువులో నిమగ్నమైపోయి వున్న సురేష్‌కి ఎవరో వచ్చి పిలవడంతో అంతరాయం ఏర్పడింది.

" ఓ! మీరా రండి" అంటూ ఆహ్వానించాడు నవ్వుముఖంతో. వచ్చిన స్టూడెంట్ నాగరాజు.

"సారీ! మీ స్టడీకి భంగం కలిగించినట్టున్నాను" నాగరాజు నొచ్చుకుంటూ గదిలోకి ప్రవేశించాడు.

"అబ్బే! అలాంటిదేం లేదు. కూర్చోండి" అన్నాడు సురేష్. ఏమిటి విశేషాలన్నట్టు చూస్తూ. సబ్జెక్ట్‌కి సంబంధించిన ఏ సందేహం వచ్చినా నాగరాజు సురేష్‌ని సంప్రదిస్తాడు. అలా గ్రూప్ డిస్కషన్ చేయడమంటే సురేష్‌కెంతో ఇష్టం. చదువు మీద అమిత ధ్యాస ఉన్న వాళ్ళకి ఆ విధానం ఎంతగానో ఉపయోగిస్తుందని సురేష్‌కి బాగా తెలుసు.

రాము ఉన్నపుడు చాలాసార్లు అలాంటి సందర్భం వస్తుందేమోనని ఎంతగానో ఆశపడ్డాడు. కానీ ఆశాభంగమే జరిగేది. సబ్జెక్ట్ ఊసెత్తితేనే రాము ఉస్సూరనేవాడు. అసలు ఆ ప్రస్తావన తేనిచ్చేవాడు కాదు. అందుకే ఆఖరికి రాముతో ముభావంగా ఉండడం అలవాటు చేసుకున్నాడు సురేష్. అలాగని సురేష్‌కి రాముకి మధ్య అభిప్రాయభేదాలు గాని కోపతాపాలుగాని వచ్చేవికావు. రాము పాటలకు అతడిలోని కళాప్రజ్ఞకు సురేష్ ఎంతో మురిసిపోయేవాడు. అయితే శృతిమించి అదే పనిగా పాడడం, ఏవేవో అనవసరంగా ప్రస్తావించడం సురేష్‌కి ఇబ్బందిగా అనిపించేది.

అయినా రూమ్మేట్ కనుక రాముతో ఓర్పుగా ఉండేవాడు.

ఐతే రాముకి సురేష్ వ్యవహారం మరోలా స్ఫురించేది. తనన్నా తన పాటన్నా సురేష్ అంతగా ప్రతిస్పందించడన్న దురభిప్రాయం కలిగిపోయింది రాము మనసులో. చివరికి రూమ్ నుంచి కావాలనే వెళ్ళి పోయాడు. అలాంటి తరుణంలో నాగరాజుతో సాన్నిహిత్యం ఏర్పడింది సురేష్‌కి. నాగరాజు కూడా మంచి ఆర్టిస్ట్ అని సురేష్‌కి తెలుసు.

"ఇప్పుడు బొమ్మలు వెయ్యడం లేదా? !" మాటల మధ్యలో సురేష్ ప్రస్తావించాడు.

"పరీక్షలు దగ్గరపడుతున్నాయి కదా! అందుకని..." అని నవ్వాడు నాగరాజు.

"రాము అర్థాంతరంగా గది ఖాళీ చేసేశాడు. అతనుంటే మంచి కాలక్షేపం అయ్యేది" అన్నాడు సురేష్. "రాము పాటలంటే నాకెంతో ఇష్టం"

"మరి రాము మరోలా ప్రచారం చేస్తున్నాడు" ప్రశ్నార్థకంగా అన్నాడు నాగరాజు.

"ఏమని? !"

"మీరు అతన్ని అవమానించారని. నా ముందు పాడి నా చదువు పాడు చేయవద్దన్నారని ఇలా ఏదేదో... మీరిద్దరూ ఘర్షణపడినట్టు కూడా తెలిసింది"

"అబ్బే! అలాంటిదెప్పుడూ మా మధ్య జరగలేదే! కాకపోతే అప్పుడప్పుడు చదువుకొమ్మని సలహా ఇచ్చేవాడినంతే!

"అందులో తప్పేముంది? ! చదువు కోమని చెప్పడం తప్పు కాదే! అతని మంచికోరే సలహా ఇచ్చారు మీరు!"

"అది కూడా రాము దృష్టిలో తప్పయింది. అందుకే వెళ్లిపోయాడు" అంటూ బాధపడ్డాడు సురేష్.

"మీరెందుకు బాధపడడం! మీలాంటి మంచి మనిషి సాంగత్యం పోగొట్టుకున్నందుకు రాము బాధ పడాలి. అసలు తప్పంతా ఆ సూర్యం చేస్తున్నాడు. రాము బలహీనతను ఆసరాగా చేసుకుని ఆటాడిస్తున్నాడు. జగ్గు కూడా పూర్తిగా సూర్యం వలలో చిక్కుకుపోయాడు. మాటలతో మాయ తెరలు కమ్మించడం సూర్యం ప్రత్యేకత. మీకింకో విషయం తెలుసా!" అన్నాడు నాగరాజు.

"ఏమిటి? !"

"జగ్గు ప్రేమించిన రాధకి వేరే సంబంధమొస్తే సూర్యం హాస్టల్ విద్యార్థుల్ని రెచ్చగొట్టి వాళ్ళపై దాడికి దిగాడు"

"అలాగా!" ఆశ్చర్యంగా అన్నాడు సురేష్.

"శివయ్యతో గొడవపడి కొట్టడానికి కూడా సిద్ధపడ్డాడంట" అని తను విన్నదంతా చెప్పాడు నాగరాజు.

* * *

"శివయ్యా! నువ్వు చేస్తున్నదేం బాగోలేదు. మాతో నువ్వు చెప్పిందేమిటి చేస్తున్నదేమిటి? !" ఒక్కసారిగా వచ్చిపడ్డ విద్యార్థుల గుంపుని చూసి శివయ్య బెదిరాడు.

"నేనేం చెప్పాను. చూద్దాం అన్నానంతే! మన మధ్య మాటలయ్యాయేగాని ఒప్పందాలు జరగలేదు. కనీసం మాట వరసకి కూడా ఒక నిర్ణయం తీసుకోలేదు" అన్నాడు శివయ్య నెమ్మదిగా.

"అలాగని వేరే సంబంధం చూస్తావా? !"

"ఏం చూడకూడదా? కన్నతండ్రిగా మంచి సంబంధాన్ని వెతుక్కోవడం... కూతురికి బంగారు భవిష్యత్తునివ్వడం నా బాధ్యత"

"అంటే మేం మంచివాళ్లం కామనా నీ ఉద్దేశ్యం? !"

సూర్యం వెంట వెళ్లిన గ్రూపులోని ఓ విద్యార్థి ఉద్రేకంగా అన్నాడు. శివయ్య మౌనంగా ఉండిపోయాడు.

"నువ్వు మమ్మల్ని అవమానిస్తున్నావు. మా తడాఖా చూపించమంటావా? " అంటూ మరో స్టూడెంట్ రెచ్చిపోతూ కళ్ళెర్ర చేశాడు. మిగతా వాళ్ళు కూడా కోపాన్ని ప్రదర్శిస్తూ కదంతొక్కారు.

"ఆగండి! అనవసరంగా తొందరపడకండి" అంటూ సూర్యం తోటి స్టూడెంట్స్‌ని హెచ్చరిస్తూ అన్నాడు గట్టిగా.

అందరూ మంత్రించినట్టు చల్లబడ్డారు.

"చూడు శివయ్యా! నువ్వు ఎవరితో పెట్టు

కుంటున్నావో తెలుసా. మేం స్టూడెంట్స్‌మి అన్న సంగతి మర్చిపోకు" సూర్యం శివయ్య ముఖంలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"ఐతే ఏంటిః ! నన్నూ, నా కూతుర్నీ చంపుతారా! రండి చంపండి!" అంటూ శివయ్య ఆవేశంగా ముందుకొచ్చాడు.

శివయ్యకు అండగా ఊళ్ళో జనం కొందరున్నా వాళ్లు స్టూడెంట్స్‌లా ఊరికే రెచ్చిపోకుండా సంయమనం పాటిస్తున్నారు.

"చూడండి బాబూ! మీరంతా ఉడుకునెత్తురులో ఉన్న కుర్రాళ్ళు. జీవితం అంటే ఏమిటో పూర్తిగా తెలియని వయసు మీది. మేము సహనం పాటించి శాంతంగా ఉన్నా మీరు మాత్రం ఇలా చీటికీ మాటికీ మా దగ్గర కొచ్చి రెచ్చిపోతున్నారు. ఒక్క పోలీస్ కంప్లయింట్ ఇస్తే ఏమవుతుందో మీరే ఆలోచించండి! మీ భవిష్యత్తు నాశనం అవుతుంది. అందుకే మేం ఆలోచిస్తున్నాం. కానీ మీరు మాత్రం మమ్మల్ని చేతకాని వాళ్ళకింద జమ కడుతున్నారు. అనవసరంగా కయ్యాలకు కాలుదువ్వకండి" ఒక పెద్ద మనిషి పెద్దతరహాగా మాట్లాడి కుర్రాళ్లని శాంతింపచేశాడు.

అయినా సూర్యం మాత్రం ఊరుకోలేదు. అతని వెనుక హాస్టల్ హాస్టలంతా ఉందన్న గర్వం అతన్ని నిలబడనివ్వలేదు.

"మీ అమ్మాయికి మీరెన్ని సంబంధాలయినా చూస్కోండి, మా కభ్యంతరం లేదు. కానీ, రాధని మా జగ్గుకి మాత్రమే ఇచ్చి తీరాలి" అని గట్టిగా అరిచాడు సూర్యం.

"అవును! అవును!!" అంటూ విద్యార్థులంతా సూర్యం మాటలకి వంతపాడారు. అరుస్తూ గోల చేశారు. నాగరాజు చెప్పిందంతా విని "ఇది చాలా అన్యాయం! వీళ్ళు చెప్పినట్టు వాళ్ళు చెయ్యాల్సిన అవసరం ఏమిటిః ప్రేమించినంత మాత్రాన పెళ్ళి చేసెయ్యాలాః !" అన్నాడు సురేష్ నాగరాజుతో.

"ఆ మాటే నేనూ అంటే సూర్యం అనుచరులు కొందరు నన్ను తప్పుపట్టారు. కక్షగట్టి కొట్టడానికి కూడా సిద్ధపడ్డారు"

"అయ్యో! అదేంటి! చాలా అన్యాయం" అంటూ సురేష్ నొచ్చుకున్నాడు.

"హాస్టల్ వార్డెన్‌కి రిపోర్ట్ చేస్తేః !"

"ఎందుకుః ! గొడవలు మరింత పెచ్చుమీరుతాయిగానీ చల్లారవు! నాలుగయిదు నెలల్లో ఫైనలియర్ పరీక్షలు. ఆ తర్వాత ఎవరిదారి వారిది. ఆ మాత్రానికి రాద్ధాంతం దేనికిః మనమే కాస్త తల దించుకునిపోతే పోలాః !" అన్నాడు నాగరాజు.

"అసలు వాళ్ళకి నీ మీదంత కోపమెందుకుః !"

"పిలవగానే వాళ్ళవెంట వెళ్ళనందుకు."

"నిజమే! నా పట్ల కూడా వాళ్ళ చూపులూ చేష్టలూ అలాగే ఉండడానికి అదే కారణం కావచ్చు అయినా సరే, మనం చూసీ చూడనట్టు ఉండడం ... పెద్దగా రెస్పాండ్ కాకపోవడమే మంచిది" అన్నాడు సురేష్.

"అవును అదే మంచిది" అన్నాడు నాగరాజు.

14



ఉదయం మొదలయిన రాము, సూర్యంల నగర సంచారం సాయంత్రం దాకా నిరాటకంగా కొనసాగింది. ఎక్కడెక్కడికో తిరిగారు. ఎవరెవరినో కలిశారు. ఏవేవో మాటలు.

"నా డియరెస్ట్ ఫ్రెండ్ రాము. మంచి సింగర్. బాగా పాడతాడు" వెళ్ళిన ప్రతీచోటా ఇవే మాటలు సూర్యం నోటి నుంచి వచ్చేవి. తనను అందరికీ పరిచయం చేస్తూ పొగుడుతుంటే రాము మనసు ఎటో ఎగిరిపోయేది ఆనందోద్వేగంతో.

సూర్యంకి నగరమంతా తెలుసని అనిపించగానే రాముకి సూర్యం గొప్పతనం ఎంతటిదో

అర్థమయిపోయింది. ఎవరెవర్నో కలిసి సూర్యం ఫ్రీగా మాట్లాడటం చూస్తుంటే రాముకి ఆశ్చర్యం వేసింది.

సూర్యంతో మాట్లాడిన వాళ్ళలో కొందరా డవాళ్ళు కూడా ఉన్నారు. కొందరమ్మాయిల్ని చూస్తే రాము మనసు అదోలా అయిపో యేది. హృదయస్పందనలు పెరిగిపోయేవి. సూర్యం ఎంతటి అదృష్టవంతుడు! అమ్మా యిలతో ఎంత చక్కగా మాట్లాడగలుగుతు న్నాడు! తనకు ఆడవాళ్లని చూస్తే చాలు, బెరుకు మొదలవుతుంది. మాటల్లో తడ బాటు, అడుగు పడదు. అన్నీ అవస్థలే సూర్యంలో అలాంటివి మచ్చుకైనా కనిపిం చవు. పైగా ఎంతో చలాకీగా సరదాగా ఓహ్. సూర్యం దగ్గర తను నేర్చుకోవసింది చాలా ఉందనిపించింది రాముకి.

"ఇంతకీ అసలు వ్యక్తిని కలిసేదెప్పుడు? !" అడిగాడు రాము.

"ఎవరు? !" సూర్యం నవ్వుతూ చిలిపిగా చూశాడు.

"అదే! నన్నూ, నా జీవితాన్నీ మార్చేయగల గొప్ప మనిషి!"

"మన ఆఖరి మజిలీ అక్కడికే!" అన్నాడు సూర్యం నెమ్మదిగా.

అదే "ఎప్పుడూ? !" రాము ఆత్రంగా అన్నాడు.

"తొందరపడకు సుందరవదనా!" అని గట్టిగా నవ్వాడు సూర్యం.

"నీకు నవ్వులాటగా ఉంది. నాకు మాత్రం ఒకటే టెన్షన్"

"టెన్షనెందుకు! నేను తీసుకెళతానన్నా నుగా!" అంటూ సిటీ బస్టాండ్‌కి తీసుకె ళ్ళాడు సూర్యం రాముని. బస్సొచ్చింది. ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు. రాము మనసు తేలికపడి ఊహాలోకాల్లో విహరించసాగింది.

* * *

"అద్భుతం... చాలా బాగుంది వాయిస్. ఎప్పట్నుంచి పాడుతున్నారు? !"

"నాకు ఊహతెలిసినప్పట్నుంచి"

"బ్యాడ్‌లక్! ఈ పాటికి మీరు జాతీయస్థా యిలో గుర్తింపు పొందాలి. సరైన వారి దృష్టిలో పడక... పోనీలెండి ఇప్పటికైనా మించి పోయింది లేదు. మీరు మాత్రం సాధన మానకండి. అన్నట్టు మీకు శాస్త్రీయ సంగీ తంలో ప్రవేశం ఉందా? !"

ఆయనకి ముప్పై ఏళ్ళు మించి ఉండదు వయసు. కాస్త పొట్టిగా, తెల్లగా ఉన్నాడు. అతన్ని చూడగానే ఎవరికైనా ఇట్టే బోధపడి పోతుంది. ఉద్యోగరీత్యా మంచి హోదాలో ఉన్నట్టు నలగని తెల్లవస్త్రాలు, నిగనిగలాడే నల్లని ఉంగరాల జుట్టు. టక్ చేసుకుని నీట్‌గా ఉన్నాడు. నుదుట ఎర్రని చుక్క బొట్టు ముఖానికి మరింత వన్నె చేకూ ర్చింది. పేరు ప్రదీప్.

ప్రదీప్ ఆఫీస్ నుంచి వచ్చేసరికి ఆరు దాటి పోయింది. గంటన్నరకుపైగా అతడి కోసం వేచి ఉండాల్సివచ్చింది.

ఆ ఇంట్లోకి అడుగుపెట్టేదాకా అసలు విష యాలేవీ రాముకి తెలియవు. అతని ధ్యాసంతా తాము కలవబోయే ప్రముఖ వ్యక్తి గురించే.

తమను చూడగానే "అన్నయ్యా!" అంటూ ఒక యువతి నవ్వు ముఖంతో పలకరిస్తూ ఇంట్లోకి ఆహ్వానించింది ఇద్దర్నీ.

"బాగున్నావా అమ్మా!" అన్నాడు సూర్యం హుషారుగా లోపలకు వస్తూ. "మా చెల్లెలు" రాముతో చెప్పాడు సూర్యం పరిచయంగా.

"చెల్లీ! ఇంతకు ముందు చెప్పానే... ఇతనే ... రాము"

ఆమె రాముకి నమస్కరించింది. రాము కూడా ప్రతినమస్కారం చేశాడు బిడియంగా.

ఇలా ఉదయం నుంచీ పరిచయాలూ పల కరింపులే. అందుకే రాముకి కాస్త ఇబ్బందిగా అనిపించింది. పైగా ప్రముఖ వ్యక్తిని పరి చయం చేస్తానని చెప్పి తోబుట్టువు దగ్గరకు తీసుకొచ్చాడేమిటా అని అసహనంగా కూడా ఉంది రాముకి. భరించలేని విసుగు మొదల యింది. అయినా ఆ భావాలేవీ బయటపడనీ యకుండా జాగ్రత్తపడ్డాడు.

"తీస్కోండి!" అంటూ సూర్యం చెల్లెలు ఇద్ద రికీ కాఫీలు తెచ్చిచ్చింది.

"వీడేడమ్మా... ఇంకా కాన్వెంట్ నుంచి రాలేదా?" కాఫీ తాగుతూ అడిగాడు సూర్యం

"వచ్చే వేళయిందన్నయ్యా!" అంటూ వీధి గేటుకేసి చూసింది. అన్నా చెల్లెళ్ళిద్దరూ ఏవో కుటుంబ విషయాలు మాట్లాడుకున్నారు.

రాము హాల్లో సోఫాలో ఒంటరిగా కూర్చుని పరిసరాల్ని పరికించి చూస్తున్నాడు. చాలా ఖరీదయిన ఇల్లే అనుకున్నాడు. పెద్ద టీవీ. అధునాతనమైన ఫర్నీచర్ అందంగా పొందిగ్గా ఎక్కడివక్కడ అమర్చబడి ఉన్నాయి. సిటీలో ఇంతపెద్ద ఇల్లు ఉంచుకుని సూర్యం హాస్టల్లో ఉంటున్నాడేమిటా అనుకున్నాడు రాము లోలోపల.

అంతలో మెయిన్ గేటు ముందు ఆటో ఆగిన శబ్దం. ఆటోలో నుంచి అయిదేళ్ళ కుర్రాడు భుజాన బ్యాగ్ సర్దుకుంటూ దిగి ఇంట్లోకి పరుగెత్తుకొచ్చాడు.

"హల్లో! టింకూ హౌవార్యూ?" సూర్యం అమాంతం ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు ఆ పిల్లవాణ్ణి.

"ఫైన్ అంకుల్" అని టింకూ కూడా సూర్యం బుగ్గమీద ముద్దుపెట్టాడు.

పిల్లాడి రాకతో ఇంట్లో సందడి ఒక్కసారిగా పెరిగింది. రాముకి ముచ్చటేసింది. టింకూ చలాకీతనం చూస్తుంటే దగ్గరకు తీసుకుని ఎత్తుకోబోయాడు. కానీ టింకూ అందినట్టే అంది తుర్రుమని జారుకున్నాడు .

"మనంకులే" అంటూ సూర్యం జంకుతున్న టింకూని వారిస్తూ అనునయించాడు.

"ఐతే మనింటికెప్పుడూ రాలేదేం? !" అన్నాడు టింకూ రాముకేసి అదోలా చూస్తూ.

"ఇప్పుడొచ్చాడు కదా!" అన్నాడు సూర్యం నవ్వి.

"అంకుల్ నాకేం తెచ్చావ్?" టింకూ అడిగాడు ఇచ్చిన ఫైవ్‌స్టార్ చాకోబార్ తింటూ.

టింకూ మాటలకు రాము కాస్త ఇబ్బంది పడ్డాడు.

"ఏయ్ తప్పు టింకూ! ఇంటి కొచ్చినవాళ్ళ నలా అడక్కూడదు" అంటూ "అది రాము అంకుల్ తెచ్చిందే" అన్నాడు సూర్యం.

"థాంక్స్ అంకుల్" అని లోపలికి పరుగు తీశాడు టింకూ.

ఆ తర్వాత ప్రదీప్ రావడం పరస్పర పరిచయాలు కావడం జరిగాయి. రాము గొంతు సవరించుకుని చక్కగా పాడి వినిపించాడు. ప్రదీప్ కొన్ని క్షణాలు తనను తానే మరిచిపోయాడు.

వంటింట్లో వంట చేసుకుంటున్న కల్పన కూడా రాము గాత్రానికి మంత్రముగ్ధురాలయింది. టింకూ ఆట మర్చిపోయి బొమ్మలా అయిపోయేడు కొన్ని నిమిషాల పాటు.

"శాస్త్రీయ సంగీతం నేర్చుకుంటే వాయిస్ మరింత పాలిష్‌డ్‌గా తయారవుతుంది" అన్నాడు ప్రదీప్.

"బావగారూ! మా వాణ్ణి మీ ట్రూప్‌లో చేర్చుకోరాదూ" అడిగాడు సూర్యం ప్రదీప్‌ని.

"ష్యూర్ ష్యూర్! నేనూ ఇలాంటి గొంతుకోసమే ఎదురు చూస్తున్నా" అన్నాడు ప్రదీప్ ఉత్సాహంగా.

"రాముగారూ! త్వరలో నేనొక ఆర్కెస్ట్రా పెట్టబోతున్నాను. మేల్ సింగర్ మీరే! మీ అదృష్టం బాగుంటే నా మొదటి సినిమాకి మీచేత పాడిస్తానేమో"

"సార్! మీరు సినిమా తీస్తున్నారా!!" అడిగాడు రాము. ఎలాగో నోరు పెగిలించుకుని నలుగురు ముందు అందునా కొత్త వ్యక్తుల దగ్గర పాటలు పాడినంత ఈజీగా మాటలు దొర్లవు రాముకి. అసలు ప్రదీప్‌ని చూడగానే రాముకి నోరు పడిపోయినట్టయిపోయింది. అంతటి పెద్ద హోదా గల వ్యక్తి ముందు మాట్లాడ్డానికి రాము మానసిక శక్తి చాలలేదు. అందుకే మొదట్నుంచీ బిడియంగా ముడుచుక్కూర్చుండిపోయాడు.

రాము అవస్థను కల్పన ఒక కంట కనిపెడుతూనే ఉంది. ఇంత బిడియపడే కుర్రాడు పాటలేం పాడగలడనుకొన్నది మొదట. తీరా రాము పాట విన్నాక మైమరిచిపోయింది.

"నేను కాదు నా మిత్రుడొకడు సినిమా తీసే ప్రయత్నంలో ఉన్నాడు. ఆ సినిమాకి నేను మ్యూజిక్ డైరక్టర్ని. అప్పుడే ట్యూన్స్

సిద్ధమైపోయాయి. మీకు వినిపిస్తాను. బాగా సాధన చెయ్యాలి సుమా" అన్నాడు ప్రదీప్.

"భోజనాలకు లేవండి" కల్పన వచ్చి అంది.

అందరూ డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చారు.

"బావా! రాము సింగరే కాదు రైటర్ కూడా. రెండు మూడు కథలు అచ్చయ్యాయి' ' అన్నాడు సూర్యం భోజనం చేస్తుండగా.

"అచ్చా"

"అంతే కాదు! మంచి నటుడున్నాడతనిలో" అన్నాడు సూర్యం.

"వెరీగుడ్! ఆలిన్‌వన్ అన్నమాట. మా మిత్రుడి సినిమా మెటీరియలైజ్ అయితే మీకు మంచి అవకాశాలే రావచ్చు" అన్నాడు ప్రదీప్.

భోజనాలయ్యాక చాలా సేపు, మాటాడు కుంటూ కూర్చున్నారు. ఆ తర్వాత హాస్టల్‌కి వెళ్ళబోతుంటే 'అన్నయ్యా' అంటూ కల్పన సూర్యాన్ని పిలిచింది.

"మా చెల్లెలు ఇంకా నీ పాటలు వినాలని కుతూహల పడుతోంది రాము" అన్నాడు సూర్యం లోపలికి వెళ్ళివస్తూ.

"అవును రాము! ఈ రాత్రికి ఉండిపొండి. నా ట్యూన్స్ వినిపిస్తాను" అని ప్రదీప్ టేప్ రికార్డర్ తీసుకొచ్చాడు హాల్లోకి.

రాము ఒక డజనుకు పైగా పాటలు పాడి వినిపించాడు. ఆ హాల్లో ఓ పెద్దకచేరియే జరి గింది అర్ధరాత్రి దాటేవరకూ.

కల్పన, టింకూ పాటలు వింటూనే నిద్రపో యారు. సూర్యం కూడా ఎప్పుడో నిద్రలోకి జారుకున్నాడు.

ప్రదీప్ తను కూర్చిన పాటల ట్యూన్స్‌ని రాముకి వినిపించాడు. రాము శ్రద్ధగా విన్నాడు.

ఒకటికి పదిసార్లు మననం చేసుకున్నాడు ఆ ట్యూన్స్‌ని. ఆ రాత్రి ఎప్పటిలాగే ఆనందో త్సాహాలతో రాముకి నిద్ర కరువయింది. తన అదృష్టానికి తానే మురిసిపోయాడు.

"సూరీ! నీ మేలు నా జన్మలో మరువలేను' ' అనుకున్నాడు మనసులో తృప్తిగా.

15



అనుకున్నట్టే అయ్యింది. రాధ పెళ్ళి జరిగిపోయింది.

కూతురు పెళ్ళి శివయ్య గుట్టుగా జరిపించే శాడు. కలిగినింటి సంబంధం. వరుడు ఉన్నత విద్యావంతుడు. ఉద్యోగస్థుడు. ఆడ పిల్ల తండ్రికి అంతకంటే ఇంకేం కావాలి. అందుకే శివయ్య మరి ఆలస్యం చేయదల్చు కోలేదు. వెంటనే పెళ్ళికి ఒప్పుకున్నాడు.

"మరి ఆ స్టూడెంట్లకేం చెబుతావు! ఆ సంబంధం సంగతేమిటి?" ఊళ్ళో ఒకరిద్దరు శివయ్యతో అన్నారు పెళ్ళికి ముందు.

"ఆళ్ళకు చెప్పేదేంటి? మర్యాదగా అడి గారు. మనమూ మర్యాదగా మాట్లాడి పంపించేశాం. అంతేగాని ఆ సంబంధం ఖాయం చేస్కోలేదే! ఊరికే మాటలయ్యే యంతే" శివయ్య సమాధానం చెప్పక ముందే పక్కనున్న పెద్దమనిషి అన్నాడు.

"అవును! ఏదో కుర్రాళ్ళు కదా... వాళ్ళను రెచ్చగొట్టకుండా నచ్చజెప్పి పంపించేశాం అంతే" మరో పెద్దమనిషి వంతపాడేడు.

"ఇప్పుడు రెచ్చిపోతే!" గతంలో జరిగిన ఎన్నో సంఘటనల దృష్ట్యా ఇంకొక వ్యక్తి సందేహాన్ని వ్యక్తపరిచాడు.

"అలాగని మంచి సంబంధం వొదులుకుం టామా! శివయ్యా నువ్వింకేం ఆలోచించకు, మేమున్నాం" అంటూ ఊరంతా ఏకమ య్యింది.

పెళ్ళి వరుడి ఊళ్ళో జరగడంతో శివయ్య ఇంటి దగ్గర పెద్ద హడావుడి కనిపించలేదు.

ఈ సంగతి జగ్గుకి తెలియక ఇంకా కలలు కంటూనే వున్నాడు. ఎలాగో నెల తర్వాత విషయం తెలిసింది.

జగ్గు పసివాడిలా భోరున విలపించాడు.

# వెక్కిరించిన దురదృష్టం







అదేంటో గానీ పాపం; కొంతమందిని అదృష్టం కోరి వరించేలోపే దురదృష్టం కోరకుండానే వచ్చి తిష్ట వేసుక్కూర్చుని వెక్కిరిస్తుంది. సెర్గీ రెపినొవ్‌స్కీ (27) విషయంలో అదే జరిగింది. అతగాడికి బంధువొకరు పంపిన ఒక ప్రైజ్ టిక్కెట్‌ను పూర్తిచేసి పంపాడు - ఏదో చిన్నపాటి బహుమతి వస్తే రావచ్చేమోననే ఆశతో. కానీ బంపర్ ప్రైజే తగిలింది. లండన్‌లో విలాసవంతమైన హోటల్‌లో మకాం చేసి వారంపాటు జల్సాగా ఖుషీగా గడిపే అదృష్టం అతగాణ్ణి వరించేసింది. అందుకయ్యే ఖర్చులన్నీ పూర్తిగా లాటరీ నిర్వహించే సంస్థే భరిస్తుంది. ఇంక అంతకంటే ఏం కావాలి. రెపినొవ్‌స్కీ ఎగిరి గంతేశాడు కానీ, దురదృష్టం అతడి కాళ్లకే కాదు, ఆనందానికీ సంకెళ్ళు వేసేసింది. మరి అతగాడు అప్పటికే ఎవరినో మోసం చేసిన పాపానికి పదేళ్ళ జైలు శిక్ష అనుభవిస్తున్నాడు. అందునా ఆ శిక్ష అప్పుడే ప్రారంభమైంది. రెపినొవ్‌స్కీ తనకు పట్టిన అదృష్టం గురించి జైలు అధికారులకు చెప్పుకున్నా వాళ్ళు 'నో ఛాన్స్' అనేశారు. ప్రత్యేక పరిస్థితుల్లోనే ఖైదీలను విడుదల చేస్తాం. అంతేగాదు, అప్పుడు కూడా రష్యా దాటి వెళ్ళటానికి వీల్లేదు. రెపినొవ్‌స్కీకి పదేళ్ల తర్వాతైనా ఆ అదృష్టం పట్టే అవకాశం లేదు. ఎందుకంటే బ్రిటిష్ రాయబార కార్యాలయం మాజీ ఖైదీలకు వీసాలివ్వరు కనుక అని జైలు ప్రతినిధి చల్లగా చెప్పేశాడు. అది విని అదృష్టదేవత ఇంత క్రూరమైన జోక్ చేస్తుందనుకోలేదం'టూ రెపినొవ్‌స్కీ కటకటాల వెనక జావగారి చతికిలపడిపోయి భోరుమన్నాడు.

# బామ్మగారి చోర విన్యాసం

రొటీన్‌తో బోర్ కొట్టినమ్మ బలదూర్ తిరిగిందనే సామెత ఉందో లేదో తెలియదు గానీ బోర్ కొడుతోందంటూ చేతులకు పని చెప్పిన ఆ ఇటాలియన్ వృద్ధ అమ్మణ్ణి మాత్రం చివరికి వాపోక తప్పడం లేదు. లేటు వయసులో కూడా చోరకళను అభ్యసించడంలో తప్పులేదు సుమా అనుకుంటూ 62 ఏళ్ళ అమ్మణ్ణి బంగారు దుకాణాల్లో ఆ కళావిన్యాసాల్ని ప్రారంభించింది. ధనవంతురాలిలా దర్జాపోతూ దుకాణాలకెళ్ళి నగలు కొనుగోలు చేయడానికి వచ్చినట్లు ఫోజు కొట్టేది. వాటిని నిశితంగా పరిశీలిస్తున్నట్లు నటిస్తూ అదనుకోసం ఎదురు చూసే ఓపికనూ అలవరుచుకుంది. వచ్చిన మరో కస్టమర్‌ని 'అటెండ్' కావడం కోసం సేల్స్‌మాన్ తల తిప్పీ తిప్పగానే ఈవిడగారు ఆ నగల్ని చటుక్కున దాచేసుకునేది. అసలు ఈ అమ్మమ్మగారు చోరీ ఎందుకు చేస్తుందిలే అని ఎవరూ అనుమానించేవారే కాదు. అలా 70 వేల పౌండ్ల విలువ చేసే నగలు కొట్టేసింది. ఏం లాభం. చివరికోరోజు శాన్ ప్రుట్టోసా అనే జిల్లాలోని ఒక దుకాణంలో హస్తలాఘవం ప్రదర్శించబోయి సెక్యూరిటీ కెమేరా కంటికి చిక్కిపోయింది. బేడీలు వేసిన పోలీసులు ఏమిటమ్మా ఇది అనడిగితే ఏం చేయను, విలాసంగా సెలవులు గడపడంతోను, విందులతోను విసుగు పుట్టేసింది. నా జీవితాన్ని మరింత థ్రిల్లింగ్‌గా, ఉత్తేజభరితంగా మార్చుకోవాలనుకున్నాను. అందుకే ఈ చోర విన్యాసాల'ని చిద్విలాసంగా బదులిచ్చిందట!



# వాక్

## మార్జాల ఇంధనం



తమిళతంబి రామన్ గుర్తున్నాడా ఎవరికైనా? అదేనండీ, ప్రత్యేకమైన ఒక రకం మొక్క సాయంతో తక్కువ ఖర్చుతో పెట్రోలు తయారు చేస్తున్నానని ఏడెనిమిదేళ్ల కిందట ఆర్భాటం చేసిన వాడండీ. ఆయనగారు తమిళనాడులో ఓ డిపో తెరచి చౌకగా తను తయారుచేసిన పెట్రోలు కూడా అమ్ముతుండేవాడు. ఇప్పుడేం చేస్తున్నాడో తెలియదుగానీ ఆయనకు పోటీగా ఒక జర్మనీయుడు వార్తల్లోకొచ్చాడు. డాక్టర్ క్రిస్టియన్ కోచ్ (55) అనే ఇతగాడు చచ్చిన పిల్లుల నుంచి డీజిల్ తయారుచేస్తున్నానని చాటుకుంటున్నాడు. ఇందుకోసం పాత టైర్లు, కొన్ని కలుపు మొక్కల్ని కూడా వాడుతున్నాడట. వీటిని పిల్లి కళేబరాల్ని కలిపి 300 డిగ్రీల ఉష్ణోగ్రత వరకు మండించి వాటిలోని హైడ్రోకార్బన్లను వడగట్టి ఒక ఉత్ప్రేరకం సాయంతో డీజిల్ తయారు చేస్తున్నాడట. ఈ డీజిల్ నాణ్యత ఎంతో మెరుగైందని, లీటరు ఖరీదు 15 జర్మనీ ఫైసలు మాత్రమేనని ఢంకా బజాయించి చెబుతున్నాడు. బాగా పెరిగిన పిల్లి కళేబరం నుంచి రెండున్నర లీటర్ల ఇంధనం లభిస్తుందని అతగాడి ఉవాచ. సొంతగా తయారుచేసిన ఈ డీజిల్‌తోనే తన కారు నడుపుకుంటున్నానని, ఇప్పటిదాక 105,000 మైళ్లు తిరిగానని, ఎలాంటి సమస్యలు రాలేదనీ చెబుతున్నాడు. ఇతగాడి ప్రయోగాలమీద డ్రెస్‌డన్ జంతు పరిరక్షణ సంస్థ మాత్రం 'ఇది మరీ క్రూరం' అని విరుచుకుపడుతోంది. ఆ సంస్థ కోపతాపాల మాట ఎలా ఉన్నా మున్ముందు కోళ్ళ ఫారాల మాదిరిగా ఈ డీజిల్ కోసం పిల్లుల ఫారాలు ఆవిర్భవిస్తాయో ఏమో!

## తాతగారి చదువు

కృషితో నాస్తి దుర్భిక్షమ్ అని ఆ దక్షిణాఫ్రికా తాతగారు మరోసారి రుజువు చేశారు. ఆసక్తి, పట్టుదల ఉంటే చేయలేనిది, సాధించలేనిది ఏముంటుందోయ్ అంటూ ఆయనగారు ఇప్పుడు హుషారుగా పాట పాడుతున్నారు. ఇంతకూ, టిమాంబ చౌకె అనే ఈ తాతగారు చేసిన ఘనకార్యం ఏమిటంటే 84 ఏళ్ళ ముదుసలితనంలో యూనివర్శిటీ ఎంట్రన్స్ పరీక్షలు రాయడం. ఎప్పుడో 66 ఏళ్ళ క్రితం ఇలా పరీక్షలు రాశారంట. పాపం- పెద్దాయన గదా కాస్త టైమిద్దాంలే అని ఇన్విజిలేటర్లు కాస్త ఉదారత చూపించబోయినా నిర్ణీత సమయంకంటే ముందుగానే చకచకా పరీక్ష రాయడం ముగించిన ఆ తాతగార్ని చూసి వాళ్ళు ఔరా అని నోళ్ళు వెళ్ళబెట్టేశారట. మరీ ఇంత లేటు వయసులో ఇదేంటి తాతగారూ అనడిగితే, 'పోయినసారి పరీక్షలు - అదేలెండి 66 ఏళ్ళ క్రితం - సరిగా రాయలేకపోయా. ఇప్పటికీ నేను తెలివైన తాతగారినా కాదా అని తేల్చుకోవడానికే ఈ పరీక్షలు రాస్తున్నా' అని సెలవిచ్చారట. అంతేకాదు, 'ఇదేదో నాకు మాత్రమే సంబంధించిన చిన్న రహస్యం అనుకున్నా. కానీ, ఈ భూమ్మీద ఏ రహస్యమూ దాగి చావదుగా' అని బోసి నోరు తెరచి నవ్వేశారట. ఆ తాతగారి పరీక్షల ఫలితాల గురించి మాత్రం అడక్కండే. ఎందుకంటే, ఆ సంగతి ఇంకా తెలియదు కనుక.



"ఊర్కోరా! అంతకంటే అందమైన అమ్మాయి నీ పెళ్ళాం అవుతుంది" అంటూ సూర్యం జగ్గుని ఊరడించే ప్రయత్నం చేశాడు.

సూర్యం మాటలకు జగ్గు ఎలాగో తమాయించుకున్నా కొంతమంది అల్లరి స్టూడెంట్ల కామెంట్లకు తట్టుకోలేకపోయాడు. వాళ్ళ హాస్యానికన్న మాటలు జగ్గుని ఆవేశపరిచాయి. బాగా ప్రభావితం చేశాయి.

"ప్రేమ కోసమై వలలో పడెనే పాపం పసివాడు"

"ఒరేయ్ జగ్గు! ఇక నీకు దేవదాసుగతే"

"అయ్యో! భగ్నప్రేమికుడా...! ఎంత ఘోరం జరిగిపోయిందిరా"

ఈ తరహాలో సాగేవి సహవిద్యార్థుల కామెంట్స్.

జగ్గు తట్టుకోలేకపోయాడు. అతని అహం దెబ్బతింది. తోటి విద్యార్థుల ముందు తలెత్తుకోలేకపోతున్నాడు.

అవమానంతో కుంగిపోసాగాడు.

తెలియని ప్రతీకారంతో రగిలిపోయాడు. కసితో రెచ్చిపోయాడు.

అంతే! జగ్గు అవేశంగా చేతిలో కత్తితో శివయ్య దగ్గరకు పరుగెత్తాడొకరోజు.

శివయ్య ఇంటి ముందు కెళ్ళి "ఒరేయ్ శివయ్యా! నన్ను మోసం చేస్తావా? నన్ను కాదని నీ కూతుర్ని ఇంకొకళ్ళకిచ్చి పెళ్ళి చేస్తావా? నా ప్రేమను చిన్నచూపు చూశావు. నాకన్యాయం చేశావు. నిన్ను చంపేస్తాను. కత్తితో ఖండఖండాలుగా నరికేస్తాను' ' అంటూ వీరావేశంతో అరచి బీభత్సం సృష్టించాడు. సమయానికి ఊళ్ళోవాళ్ళు జగ్గుని కట్టడి చేసి పట్టుకోబట్టి... లేకపోతే ఘోరం జరిగిపోయేదే.

తిన్నగా తీసుకెళ్ళి జగ్గును పోలీసులకు అప్పగించారు. జగ్గుపై హత్యాయత్నం కేసు నమోదయింది. దాంతో జగ్గు పేరుని హాస్టల్ రిజిస్టర్ నుంచి తొలగించి హాస్టల్లో ప్రవేశం లేకుండా చేశారు. హాస్టలర్స్‌లో చాలా మంది జగ్గుకి మద్ధతుగా ధర్నా చేశారు. గొడవ చేశారు. పోలీస్ స్టేషన్ దాకా ఊరేగింపుగా వెళ్లారు. అయినా ఫలితం లేకపోయింది. జగ్గు కాలేజీ నుంచి కూడా సస్పెండయ్యాడు.

పోలీసు కేసంటే ఏమిటో విద్యార్థులందరికీ తెలిసొచ్చింది. పోలీసులు తమనేం చేస్తారులే అని మొదట దుందుడుకుగా ప్రవర్తించిన వాళ్ళకు బుద్ధొచ్చింది.

పోలీసులు హాస్టలుకొచ్చి విద్యార్థుల్ని హెచ్చరించారు. పిచ్చి వేషాలు వేస్తే మీకు జగ్గుకి పట్టిన గతే పడుతుందని గట్టిగా వార్నింగ్ ఇచ్చారు. హద్దులు మీరితే శిక్ష తప్పదని చెప్పి మరీ వెళ్ళారు.

ఈ సంఘటనతో విద్యార్థుల్లో మార్పొచ్చింది. హాస్టల్ వాతావరణమే మారిపోయింది. దానికి తోడు పరీక్షలు దగ్గరపడ్డాయి. చాలా మంది ఈ గొడవలో తల దూర్చడం అనవసరం అనుకున్నారు. అంతా చదువులో మునిగిపోయారు. ఒక్క రాము తప్ప. ఇప్పుడు హాస్టలర్స్ దృష్టంతా పరీక్షలమీదే.

* * *

ఎప్పుడో తప్పిపోయిన అలవాటు ఇప్పుడు ఒక్కసారిగా ఎలా సాధ్యమవుతుంది?

గత మూడేళ్ళుగా బొత్తిగా పుస్తకాలు ముట్టుకోలేదు రాము- మొదటి సంవత్సరంలో ఏ కాస్తో తప్ప. ఎప్పుడైనా అవసరం అని పిస్తే... మొక్కుబడిగా అసైన్‌మెంట్లు పూర్తిచేయడం, తాత్కాలికంగా లెక్చరర్స్ చేత ఓకే అనిపించుకోవడం.

యూనిట్ టెస్ట్‌లలోనూ అంతే! ఎలాగో ఇంతదాకా ఈడ్చుకొచ్చేశాడు. ఇప్పుడు ఫైనలియర్ ఎగ్జామ్స్. అతిముఖ్యమైన కీలకమైన పరీక్షలవి .నలుగురితో నారాయణ అన్నట్టు రాము కూడా పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు. కాని ఏదీ తలకెక్కడం లేదు. అసలు అర్థం కావడం లేదు.

అంతా అయోమయం. అర్థం కాని భయం. తన ప్రాణానికి ఈ పరీక్షలు ఎందుకొచ్చిపడ్డాయి అని అల్లాడిపోతున్నాడు.

తను గాడి తప్పానా అనే ఆలోచన మొదటిసారిగా కలిగింది రాములో. అదీ చుట్టూ ఉన్న తోటి విద్యార్థులు పుస్తకాల్లోంచి తలలు

లేపకుండా గడపడం, చదువు గురించే చర్చిం చుకోవడం, అందరిలోనూ ఏదో ఒక సీరి యస్‌నెస్ కనబడడం - ఆ ధోరణులేవీ తనలో ఎంత ప్రయత్నించినా కనిపించకపోవడంతో కలిగిన ఆలోచన అది.

ఆ ఆలోచనలతో కొద్దిసేపు భయంగా అన్పించింది. పరీక్షల్లో ఫెయిలయితే అనే తంతు కూడా ఆ భయానికి కారణం.

అంతలోనే మరో ఆలోచన. వీళ్ళందరికీ చదువు తప్ప మరో ఆధారం లేదు. కాని తనకో దేవుడిచ్చిన గళం ఉంది. ఆ గళంతో తనెంతో ఎత్తుకు ఎదిగిపోతాడు. ఈ చదు వులు డిగ్రీలు తెచ్చిపెట్టే ఉద్యోగాలు తనకేం అక్కరలేదు. ప్రదీప్‌గారి సినిమా మొదల యితే తన ఎదుగుదలకు అదే నాంది అవు తుంది. ఇక తను వెనుదిరిగి చూడాల్సిన పని ఉండదు. ఈ చదువుమీద తనెలాగు దృష్టి పెట్టలేదు. అది ఇంటర్‌లో కాకుండా ఈ పాలిటెక్నిక్‌లో చేరినప్పుడే తెలిపోయింది. ఈ మూడేళ్లూ చదువు లేకుండానే గడిచిపో యాయి. ముందు మాత్రం గడవదా?

తన గళాన్ని, తనలోని కళను మాత్రం నిర్లక్ష్యం చేయకూడదు. ఏ అవకాశం దొరి కినా దాన్ని ప్రదర్శించడం మానకూడదు. అదే తనను అందలానికి చేరుస్తుంది. ఈ చదువు గురించి ఇంకా బుర్ర బద్దలు కొట్టు కోవడం అనవసరం అని తనను తను సమ ర్థించుకున్నాడు.

అయినా తోటివాళ్లని చూస్తే ఏదో దిగులుగా అనిపిస్తోంది. అందరిలాగా పాఠాలు వల్లించలేకపోతున్నాడు. పుస్తకం పట్టుకుంటే నిద్ర తన్నుకొచ్చేస్తోంది. అలాగే నిద్రపోతున్నాడు గంటలకొద్దీ.

"మెస్‌కి పోయి టీ తీస్కో" అని సలహా ఇచ్చాడు సూర్యం. ఎప్పుడూ ఎక్కడెక్కడో తిరిగే సూర్యం కూడా పుస్తకాలు వదలడం లేదు. ప్రిపరేషన్లో పూర్తిగా మునిగిపోయేడు. గదిదాటి బయటికే వెళ్ళడం లేదు. గతం లోలా హస్కులు కూడా లేవు సూర్యం గదిలో ఇప్పుడు.

## సొంత డైలాగులతో తికమక

నాటకంలో లేని సొంతడైలాగులతో ప్రదర్శనలను రసాభాస కాకుండా కాపాడడంతోపాటు ఒక్కోసారి వాటితోనే తోటి నటీనటులను తికమకపెట్టేవారు 'స్థానం' వారు. అందుకే ఆయనతో నటించాలంటే చాలామందికి గుండెల్లో రైళ్లు పరుగెట్టేవి. ఓసారి కన్యాశుల్కం నాటకం వేస్తున్నారు. 'స్థానం' మధురవాణి కాగా, ముదిగొండ లింగమూర్తి రామప్ప పంతులు. అయితే 'స్థానం'వారి తీరు తెలుసు కనుక ఈయన ఏం మెలిక పెడతాడోనని స్టేజీమీదకి రావడానికి జంకుతూ లింగమూర్తి వింగులోనే నిలబడి ఉన్నారు.. ఆయన అవస్థకనిపెట్టి 'రావోయ్ రామప్పపంతులూ.. అలా భయపడతా వేమి?' అంటూ కన్యాశుల్కంలో ఎక్కడా కనబడని ఓ సొంత డైలాగు కొట్టి ఆయనను స్టేజీమీదికి పిలిచి ఆయన భయం పోగొట్టారు 'స్థానం'.




సూర్యం బలాదూర్‌గా తిరిగేవాడే. అయినా తనలాగ అసలు పుస్తకం ముట్టని వాడు కాదని రాముకి సూర్యం గదిలో కొచ్చిన కొత్తలోనే అర్థమయింది. ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా రోజూ ఒక గంటయినా చదివేవాడు. అందుకే సూర్యంకి గతంలో అన్ని టెస్ట్‌ల లోనూ మంచి మార్కులే వచ్చేవి. రామూని

కూడా కాస్తంత చదువు మీద దృష్టిపెట్టమని చెప్పేవాడు. కానీ అతని సంగతి తెలిసిపో యాక అలా చెప్పడం ఏనాడో మానేశాడు.

రాము మెస్‌కెళ్ళేడు టీ కోసం.

"నమస్తే సింగర్ గారూ" మెస్ సూపర్‌వై జర్ మోహన్ నవ్వుతూ పలకరించాడు రాముని.

"మోహన్! టీ కావాలి" అన్నాడు రాము. అది టీ సమయం కాదు. అయినా మోహన్ మీదున్న నమ్మకంతో టీ కోసం వచ్చాడు రాము.

"హమ్మమ్మా! ఎంతమాట. ది గ్రేట్ సింగర్... అభినవ ఘంటసాలగారు అడ గడం మేం కాదనడమా... తప్పకుండా" అంటూ క్షణాల్లో అసిస్టెంట్స్‌కి చెప్పి రాము కోసం ప్రత్యేకంగా టీ చేయించాడు మోహన్.

టీ తాగాక రాములో నూతనోత్సాహం పుట్టుకొచ్చింది. "సార్! నాదొక చిన్న కోరిక!" అన్నాడు మోహన్.

"ఏమిటి మోహన్"

"త్వరలో మీరు సినిమాల్లో పాడబోతున్నా రని విన్నాను. ప్రస్తుతం ఆ ట్యూన్‌కే ప్రాక్టీస్ చేస్తున్నారని తెలిసింది. ఆ ట్యూన్ ఒక్కటి." మోహన్ అర్థిస్తూ అన్నాడు.

ఈ మధ్య పరీక్షల హడావిడిలో పడిపోయి తనను, తన పాటలను ఎవరూ పట్టించుకో వడం లేదు. ఈ పరీక్షలు తన ఆనందాన్ని మింగేస్తున్నాయి అనుకుంటూ "తప్పకుండా" అని ఉత్సాహంగా మెస్ హాల్లోనే గొంతు సవ రించబోయాడు రాము.

"ఇక్కడొద్దు! నా రూమ్‌కి పోదాం పదండి"

మోహన్ ప్రోత్సాహం రాములో పోయిన ప్రాణాన్ని మళ్ళీ తీసుకొచ్చేట్టు చేసింది.

ఈమధ్య తనలో తాను హమ్మింగ్ చేసు కోవడమేగాని గొంతెత్తి పాడే సందర్భం రాలేదు. అస్తమానం పాడు పాడు అని అదే పనిగా నసపెట్టే సూర్యం కూడా ఆసక్తి కన బరచడం లేదిప్పుడు. అయితే స్టడీస్ నుంచి కాస్త రిలీఫ్ కోసం అప్పుడప్పుడు పాడించు కుంటున్నాడంతే. అది కూడా ఒకటి అర మాత్రమే. అంతకు ముందులా గంటలకొద్దీ తనచేత కచేరీలు చేయించడం లేదు. ఇప్పుడు మోహన్ ఆ అవకాశం రాముకి కల్పించాడు. మోహన్ అడిగింది ఒక పాటే అయినా ఎన్నో పాటలు ప్రవాహంలా రాము గొంతునుంచి కొట్టుకొచ్చాయి.

వన్స్‌మోర్ సార్ అంటూ మోహన్ అడ గడం... రాము రెట్టించిన ఉత్సాహంతో పాడడం ఆ రాత్రంతా రాము మోహన్ గది లోనే గడిపేశాడు. అభిమానంతో మోహన్ ప్రత్యేకంగా చూశాడు రాముని. మెస్‌హాల్‌కి భోజనం కోసం వెళ్ళనివ్వలేదు. తన గదికే తెప్పించాడు.

మోహన్ తనను ప్రత్యేకంగా చూడడం రాముకి చెప్పలేనంత గర్వంగా ఉంటోంది. అందుకే అతను అడిగిందే తడవు పాట మొదలుపెట్టేవాడు రాము.

ఆ ఇద్దరి అనుబంధం అంతటితో ఆగలేదు. టౌన్‌కి షికారుకెళ్ళే దాకా దారి తీసింది పరీ క్షల రోజుల్లో కూడా.

రాము పరీక్షల సంగతి పక్కన పెట్టేశాడు పూర్తిగా మొదట ఇంకా నెలన్నరుందని.

ఆ తర్వాత నాలుగు వారాలు సమయం ఉందని.

అలా రోజులు దొర్లించేశాడు. ఆఖరికి పరీ క్షలు జరుగుతున్న రోజుల్లో కూడా పాటలు ఆపలేదు రాము.

ఆ క్షణాల్లో రాముకి తెలియలేదు, తను చేసిన తప్పేమిటో. ఆ తప్పు ముందుందు తనను ముప్పుతిప్పలు పెడుతుందని పడరాని పాట్లకి గురిచేస్తుందని గుర్తించే వయసు కాదు. కనీసం గుర్తుచేసి మందలించేవాళ్ళు లేరక్కడ. పైగా తనను భ్రమల్లో ముంచి తేల్చే సందర్భాలే అందుకు కారణం. ఆ పరిస్థితి ఎప్పుడో దాటే శాడు రాము. మోహన్ టౌన్లో తనకు తెలిసిన వారి దగ్గర కూడా రాముని పొగిడి మరీ పాడిం చేడు. రాము మైమరచిపోయి తెలియని మత్తులో మునిగిపోయేడు.

పరీక్షలు ముగిశాయి. ఏదో పుస్తకం తెరిచి ముక్కున పెట్టి ఆ పరీక్షల మొక్కు

చెల్లిద్దామనుకున్నాడు. కానీ చివరి నిమిషంలో సబ్జెక్ట్ ఏం అర్థమవుతుంది? ఏం చదువుతాడు? కాస్త సులభంగా అన్పించిన వాటిని అలా అలా తిరగేసి ఎలాగో రాశాననిపించాడు రాము. రాసిన తీరుతో దాదాపు తను ఫెయిల్ అని ముందే తెలిసిపోయింది రాముకి. అయినా తన సొంత ఊరుకి బయల్దేరుతున్న సంతోషం. చదువు బెడద ముగిసిందన్న ఆనందం.

## 16



చదువుకు ముగింపు పలికి ఇంటికొచ్చిన కొడుకును చూసి నారాయణమ్మ ఎంతగానో మురిసిపోయింది. కొడుకు పెద్ద చదువులు చదివేశాడని గొప్పలుపోతూ అందరికీ చెప్పుకుని ముచ్చటపడిపోయింది. కొడుకు మీద నారాయణమ్మ పెట్టుకున్న ఆశలెలాంటివో ఊళ్ళో అందరికీ తెలుసు. రాముని చదివించడం కోసం నారాయణమ్మ పడిన కష్టమూ తెలుసు.

"నారాయణమ్మ! అనుకున్నట్టే నీ కొడుకుని చదివించావు! ఇంక నీ కలలు పండినట్టే. రాము పెద్ద ఆఫీసరవుతాడు. నీ ఆశల్నీ తీర్చుతాడు. నువ్వు నిజంగా చాలా అదృష్టవంతురాలివి"

ఆ మాటలకు నారాయణమ్మ తబ్బిబ్బియిపోతూ ఎంతగానో పొంగిపోయింది. పాపం! ఆ పిచ్చితల్లికి అసలు సంగతేం తెలుసు!?

"బాబూ నాయనా! ఏంట్రా... అలా సిక్కిపోయి నల్లబడ్డావు?" అంది నారాయణమ్మ రాము వొళ్లంతా ఆప్యాయంగా నిమురుతూ.

నిజానికి రాము సన్నబడలేదు. సరికదా కాస్త ఒళ్ళు కూడా చేశాడు. మంచి రంగు తేలి ఇదివరకంటే నిండుగా తయారయ్యేడు. చిక్కిపోయి రోజురోజుకి ఎముకల గూడులా తయారవుతున్నది నారాయణమ్మే. శక్తికి మించిన కాయకష్టం నారాయణమ్మ ఆరోగ్యాన్ని హరించివేస్తోంది.

తరచూ దగ్గుతోంది. ఆయాసపడిపోతూనే కొడుక్కి తన చేతులతో వంటచేసి తినిపించింది చాలా కాలం తర్వాత.

భోజనం అయ్యాక రాము మాస్టారు దగ్గరకు వెళ్ళబోతుంటే నారాయణమ్మ పిడుగులాంటి వార్త చెప్పింది. అది విని రాము నిజంగానే తల్లడిల్లిపోయాడు.

"ఏంటమ్మా! నువ్వు చెబుతోంది నిజమా? !' ' రాము గొంతు పూడుకుపోయింది. తల్లి ముఖంలోకి తీక్షణంగా చూశాడు.

"అవున్నాయనా! మాయదారి గుండెజబ్బు ఆయన్ని ఎత్తుకెళ్లిపోయింది"

"మరి నాకు చెప్పలేదేం? !" మాష్టారు ఆఖరు చూపు దక్కనందుకు రాము హృదయం బాధతో బరువెక్కిపోయింది. తనని మాయదారి పాలిటెక్నిక్‌లో చేర్పాడనే అక్కసు కొంత ఉన్నా మాష్టారంటే రాముకు చాలా అభిమానమే.

"ఏం సేయను నాయనా! నీకు కబురంపాలనే అనుకున్నాను. కానీ నీ సదువు పాడవుద్దని, పైగా అప్పుడు నీకు పరీచ్చలని ఎవరో సెప్పారు!" అంది నారాయణమ్మ.

రోజులు గడుస్తున్నాయి. భౌతికంగా హాస్టల్‌కి దూరమైన రాము మనసు మాత్రం యింకా ఆ వాతావరణానికి, అక్కడి అనుభవాల అనుభూతులకి ఇప్పటికీ పులకరిస్తూనే ఉంది. ఒకటా రెండా... వరుసగా మూడేళ్ళ ముచ్చట్లు!

మూడు సంవత్సరాలు మూడు నిమిషాల్లా ముగిసిపోయాయి! ఎన్ని సంతోషపు సంఘటనలు! ఎంతటి ఆనందపు సందడులు! ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రపోయేదాకా ఒక్కోసారి రాత్రంతా నిద్రమేల్కొని తెల్లవార్లూ... ఎన్ని అల్లర్లు... ఎన్నెన్ని అల్లిబిల్లి కబుర్లు! చీకూ చింతా లేకుండా!

భయాందోళనలంటే ఏమిటో కూడా తెలి

యకుండా! ఎంత స్వేచ్ఛ... స్వచ్ఛమైన సరదా సందడులు. ఇప్పుడవన్నీ ఏమయ్యాయి? ! ఎక్కడ దాక్కున్నాయి? !

ఉదయాన్నే లేవగానే టీ. ఆ తర్వాత టిఫిన్ ఠంచన్‌గా మధ్యాహ్నం పన్నెండు గంటలకే భోజనం. మళ్లీ మధ్యాహ్నం నాలు గ్గంటలకి లైట్‌గా టిఫిన్, టీ. ఏడు గంటలకి డిన్నర్... గుంపులు గుంపులుగా మెస్‌కె ళ్ళడం... సరదా కబుర్లతో భోజనం చేయ డం... మళ్లీ హస్కు కొట్టుకుంటూ జంట లుగా... ఒంటరిగా... గుంపులుగా ఎవరికిష్ట మైనట్టు... ఎవరికెలాతోస్తే అలా.

మెస్‌కి వెళ్ళడం, రావడం. మధ్యలో అక్కడే సుదీర్ఘంగా కబుర్లు... చర్చలు... ఎన్ని విష యాలు దొర్లేవని! అమ్మాయిల అందాలు... అబ్బాయిల సరదాలు. లెక్చరర్స్ రుసరు సలు... ప్రిన్సిపాల్ చీదరింపులు... కొండ కచో బెదిరింపులు... అప్పుడప్పుడు అవే బెది రింపులు రివర్స్ కావడం. స్టూడెంట్స్ తోకము డిచి తోడు తీసుకుని మరీ ఉడాయించడం. ఆ దృశ్యాలన్నీ తరచూ మదిలో సుడులు తిరుగు తూనే ఉన్నాయి అతడికి. ఆ సరదాలన్నీ పరదాలు పరుచుకున్నాయిప్పుడు.

సంతోషాలన్నీ అంతమై సంతాపాన్ని మిగి ల్చాయి. ఏదో స్తబ్ధుగా, ఎంతో వెలితిగా అన్పి స్తోంది రామూకి.

హాస్టల్ నుంచి వచ్చిన రెండు మూడు నెలలదాకా రామూ పరిస్థితి ఇలాగే సాగింది. నిద్రలో సైతం అవే కలలు... కలవరిం తలు... కలతల పలకరింపులు...

మళ్లీ ఆ రోజులు రావని తెలిసినా రాము మనసు మాత్రం ఉవ్విళ్లూరుతోంది ఆ అనుభ వాలకోసం.

పరీక్షా ఫలితాలొచ్చాయి. ఊహించినట్టే జరి గింది. రాము ఫెయిలయ్యాడు.

రాము బాధపడలేదు కాని భయపడ్డాడు.

"భయమెందుకురా? !" శేఖర్ అన్నాడు. శేఖర్ ఒకనాటి హైస్కూలు క్లాస్‌మేట్. ఊళ్లో ఉన్న ఒకే ఒక మిత్రుడు. ఎవర్కైనా తెలిసి పోతుందని చెప్పాడు రాము బిడియంగా.

శేఖర్ పకపకా నవ్వేడు.

"నవ్వుతావేంట్రా? " రాము కోపంగా చూశాడు.

"నీ అమాయకత్వానికి నవ్వొగాక మరేం వస్తుందిరా! లేకపోతే ఏంటి? నువ్వు భయ పడాల్సింది నీ భవిష్యత్తు గురించి" అన్నాడు శేఖర్.

"నా సంగతి నీకింకా పూర్తిగా తెలియన ట్టుంది. నా కోసం ఓ బంగారం లాంటి అవ కాశం... అదృష్టయోగం ఎదురు చూస్తోంది" పగటి కలల్లో తేలిపోవడం అలవాటైపోయిన రాము తన సహజ ధోరణిలో అన్నాడు.

"ఏమిటో అది? !" శేఖర్ అన్నాడు. వీడింకా భ్రమల్లోనే బతుకుతున్నాడు. ఇంత జరిగినా ఇంకా బుద్ధి రాలేదు. వీడిలాంటివాళ్లు మస య్యేదాకా మాయలోనే గడిపేస్తారు అనుకు న్నాడు జాలిగా.

"పరీక్ష గట్టెక్కింది కదా! ఇంకేంట్రా నువ్వు చేసేది? !" చెప్పరా అన్నట్టు శేఖర్ సూటిగా రాము కళ్లలోకి చూస్తూ అన్నాడు.

"చెబుతానుగానీ ముందిది చెప్పు!" అన్నాడు రాము, శేఖర్ ముఖంలోకి అర్థిం పుగా చూస్తూ.

"ఏమిట్రా? !"

"అమ్మకీ సంగతి తెలియనివ్వకూడదు!"

"ఇలాంటివిప్పుడు వినేస్థితిలో ఉందట్రా నీ తల్లి. మంచాన పడి రేపో మాపో అన్న ట్టుంటే"

రామూ మాట్లాడలేదు.

"ఒరేయ్ నీ భ్రమల్లోంచి బయటకు రారా. వాస్తవంలో బతకడానికి ప్రయత్నించు" ఏమన్నా అనుకోని అని శేఖర్ ధైర్యం చేసి మిత్రుడికి సలహా ఇచ్చాడు. రాము దెబ్బతిన్న వాడిలా చూశాడు. "నావి భ్రమలు కావురా. ఆశలు, జరగబోయే వాస్తవాలు. ఇప్పుడు మీ అందరికీ అలాగే అన్పిస్తుంది. రేపు అలా జరి గినప్పుడు మీరే అకాశానికెత్తుతారు" అన్నాడు రాము.

ఇక ఏంచెప్పినా లాభం లేదనుకుని శేఖర్ మౌనం వహించాడు. కాకపోతే వీడిలా అయి

పోయాడేమిటా అని బాధపడ్డాడు. రాము ప్రదీప్‌కి ఉత్తరం రాశాడు.

"సార్! మీ ట్యూన్స్ దాదాపుగా నలిగి నా నాలుక్కి అంటుకుపోయేయి. అంతటి రాక్షస సాధన చేశాను. చేస్తున్నాను. మీరెప్పుడు పిలుస్తారా అని ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నాను. మీదే ఆలస్యం. మీరు కబురందిస్తే చాలు. క్షణాల్లో పయనమై మీ ముందుంటాను"

ఇంతకీ సినిమా ఎప్పుడు మొదలవుతుంది? అంతకంటే ముందు రికార్డు కావాలి కదా పాటలు. అందుకే మీ జాబుకై ఎదురు చూస్తూ... ఎంతగానో తపించిపోతున్నాను. వెంటనే జాబు రాయండి. మీ ఉత్తరానికై వేయి కళ్లతో వేచి చూస్తా... ఉంటా"

ఒకదానితర్వాత ఒకటి, ఇలా ఎన్ని లెటర్లో లెక్కలేదు.

అయినా ఒక్కదానికైనా జవాబు లేదు. ఎదురు చూడ్డం...పోస్ట్‌మేన్‌ని విసిగించడం. రాముకి మిగిలిందిదే. అయినా పట్టు వదలని విక్రమార్కుడిలా రోజుకో ఉత్తరం రాయడం. పోస్ట్ చేయడం. ఎదురుతెన్నులు కాయడం.

నా కొడుకు ఉజ్జోగం కోసం ఎన్ని తిప్పలు పడుతున్నాడు? దేవుడా నా కొడుకు కోరిక తీర్చు. ఆడుజ్జోగం చేయడం ఒక్కరోజైనా చూసేదాకా నిన్ను చేరుకోనంతే అనుకుంటూ నారాయణమ్మ కొడుకు భాగోతం తెలియక అమాయకంగా ఇంకా అడిగినప్పుడల్లా డబ్బులిస్తూనే ఉంది.

"రాయి నాయనా రాయి. ఉద్యోగం వచ్చేదాకా ఊరుకోకు. ఎంత కర్సయినా నేనిస్తాను. మూడేళ్ళు ఊరుగాని ఊళ్లో చదివించిందాన్ని... చిన్న ఉత్తరం ముక్కకి ఎనకాడుతానా? !" ఆ పిచ్చితల్లింకా కలల లోకంలోనే తేలియాడుతోంది. కొడుకు చేస్తున్నవి ఉద్యోగ ప్రయత్నాలని భ్రమపడుతోంది.

ఓ రోజు రాము ఎక్కువ డబ్బు కావాలని

## భయపడితే ఉసురుకే ఎసరు

'ఉద్యోగాలు పోతే పోయాయి ప్రాణాలు మాత్రం భద్రం' అని హెచ్చరిస్తున్నాడు హెల్త్ స్పెషలిస్ట్ 'జుస్సివాహ్తెరా'. ఈయన ఎవరు అనుకుంటున్నారా? 'ఫిన్నిష్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆక్యుపేషనల్ హెల్త్' అనే సంస్థలో శాస్త్రవేత్త. గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్‌ల వల్ల ఉద్యోగులు పెద్ద ఎత్తున ఉద్యోగాలు కోల్పోవాల్సి వస్తోంది. ఉద్యోగుల సంఖ్య తగ్గించి, ఉన్న ఉద్యోగులతోనే మొత్తం పని చేయిస్తున్నాయి కంపెనీలు. అదీగాక ఉద్యోగం ఇప్పుడు పోకున్నా, మళ్లీ కంపెనీ ఉద్యోగుల సంఖ్య తగ్గించే సమయంలో తమ ఉద్యోగానికి ఎసరు వస్తుందేమోనని ఉద్యోగాల్లో మిగిలినవారు ఉద్విగ్నతతో ఉంటున్నారు. ఇటువంటి అనిశ్చిత పరిస్థితి ఉద్యోగుల ఆరోగ్యం పై ఎటువంటి ప్రభావం చూపిస్తుందో తెలుసుకునేందుకు ఈయన 22,430 మంది ఉద్యోగుల ఆరోగ్యం విషయంలో పరిశోధనలు చేశారు. ఈయన పరిశోధనల వల్ల తేలిందేమిటంటే, ఉద్యోగుల సంఖ్య తగ్గించటం ప్రారంభించిన కంపెనీల్లో ఉద్యోగులు ఎక్కువగా అనారోగ్యానికి గురవుతున్నారట. వీరిలో అనేకులు గుండెపోటువల్ల మరణిస్తున్నారు. అధికంగా పనిచేయాల్సి రావటమే కాక, సరిగ్గా పని చేయకపోతే ఉద్యోగం పోతుందన్న భయం కూడా వీరి ఆరోగ్యాన్ని ప్రభావితం చేయడమే ఆ మరణాలకు కారణం. కాబట్టి 'ఉద్యోగం పోతే పోయింది, మరొకటి వస్తుంది. కానీ పోయిన ఉద్యోగం గురించి బెంగ పెట్టుకుని ఉన్న ఉద్యోగం పోతుందేమోనని భయం పెంచుకుంటే మళ్లీరాని జీవితం చేజారి పోతుంది జాగ్రత్త' అంటున్నాడీయన. ఇది కేవలం ఆ దేశంలో వారికే కాదు మనకూ వర్తిస్తుంది!



తల్లినడిగేడు. ఆ తల్లి ఎందుకని అడగ్గనైనా అడక్కుండా రోగంతోనే పనులు చేయడానికి సిద్ధపడింది.

"అమ్మా! ఇక్కడుంటే నాకెవరూ ఉద్యోగం ఇవ్వరు. నేనే పట్నం వెళ్లి ప్రయత్నం చేసుకోవాలి"

"అలాగే సెయ్యి నాయనా.... నాను కాదన్నానా? !" అంటూ నారాయణమ్మ ఎలాగో ఓపిక చేసుకుని పనికెళ్లింది.

ఆరోజే అలా పనిచేస్తూ ప్రాణాలు విడిచింది.

* * *

తల్లి మరణంతో రాము పరిస్థితి చాలా దారుణంగా మారింది. తీరని మనోవేదనకు గురయ్యేడు. చెప్పలేనంత ఒంటరితనం ఆవరించింది.

ఇన్నాళ్లూ తనకంటూ ఒక మనిషంటూ ఉందన్న ధైర్యం ఉండేది. ఇప్పుడు తనకెవ్వరూ లేరన్న ఆలోచన వస్తే చాలు తట్టుకోలేకపోతున్నాడు. ఎండుటాకులా వణికిపోతున్నాడు. చాలా రోజులు తిండీ తిప్పలు కూడా లేకుండా గడిపాడు.

ఉన్న ఒక్క జత బట్టలు మాసిపోయాయి.
చింపిరి జుట్టు... పీక్కుపోయిన ముఖం.
కళతప్పి బక్కచిక్కింది శరీరం.

రాముకి తనమీద తనకే జాలి కలుగుతోందిప్పుడు. దిక్కుతోచని తన దైన్యస్థితికి తల్లడిల్లిపోతున్నాడు రాము.

ఏమిటిది? ఎందుకిలా అయింది తన పరిస్థితి. హఠాత్తుగా ఇలా మారిపోయిందేమిటి కాలం. తనను పట్టించుకునే వాళ్ళు.. తన బాధనర్థం చేసుకుని బాసటగా నిలిచే వాళ్లూ కరువయ్యేరేమిటి? ఏడాది కాలంలో ఎంత మార్పు.

ఒకనాటి వైభవమంతా పోయింది. ఎటూ తోచని ఏకాకితనం మిగిలింది. దిగులుగా, ఆవేదనగా నిట్టూర్చడం దినచర్య... కాదు, క్షణచర్య అయింది.

కొన్నాళ్లు మిత్రుడు శేఖర్ తింటానికింత పెట్టి ఆదుకున్నాడు. ఆ తర్వాత అది కూడా కరువయింది. తనే శేఖర్‌కి దూరం అయ్యాడు. అలా ఎన్నాళ్లు ఇతరులపై ఆధారపడగలడు? అందుకే శేఖర్ కంటపడటమే మానేశాడు రాము సిగ్గుతో,న్యూనతాభావంతో.

ఒకసారి హఠాత్తుగా మళ్లీ శేఖర్ దగ్గరకు వెళ్లాడు రాము. మిత్రుడు మళ్లీ తన దగ్గర కొచ్చినందుకెంతగానో మురిసిపోయేడు శేఖర్.

"ఒరేయ్ శేఖర్! నాకో సహాయం చేస్తావా!" అన్నాడు రాము దీనంగా ముఖం పెట్టి.

"తప్పకుండా! ఏంటో చెప్పరా!" అన్నాడు శేఖర్ వెంటనే. "నాక్కొంత డబ్బు కావాలి. ఊరికే కాదు అప్పుగా. మళ్లీ సిటీకి పోతాను. అక్కడ నాకు తెలిసినవాళ్లూ, నా శ్రేయోభిలాషులూ చాలామంది ఉన్నారు" అన్నాడు రాము.

ఇంకా భ్రమలొద్దని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు శేఖర్. అయినా రాము వినలేదు. శేఖర్ ఇచ్చిన డబ్బుతో నగరానికి బయల్దేరాడు. బయల్దేరేముందు తల్లినొక్కసారి తలుచుకుని శపథంగా అనుకున్నాడు.

"అమ్మా! నువ్వు నన్ను గొప్పవాడిగా చూడాలని కలలు కన్నావు. నీ కోరిక తీర్చాలని కంకణం కట్టుకున్నాను. ఎప్పటికైనా నేననుకున్నది సాధించి తీరుతాను. నాకా నమ్మకం ఉంది. అందుకే పుట్టిపెరిగిన ఈ ఊరొదిలి వెళ్లిపోతున్నాను. ఎవరూ ఊహించని స్థాయికి చేరి అప్పుడే మళ్లీ ఈ ఊర్లో అడుగు పెడతాను. నారాయణమ్మ కొడుకు రాము ఎంత గొప్పవాడయ్యాడోనని అందరూ అనుకుని ఆశ్చర్యపడేలా చేస్తాను. నీ ఆత్మకు శాంతి చేకూరుస్తాను" అని మనసులో గట్టిగా అనుకోవడమే కాదు; మిత్రుడు శేఖర్ ముందు కూడా అన్నాడు.

రాము పరిస్థితి చూస్తుంటే శేఖర్‌కి జాలేస్తోంది. అయినా ఏమీ చెయ్యలేని నిస్పృహాయత.

"రామూ! నిజంగా నువ్వనుకున్నది సాధిస్తే ముందుగా సంతోషించేది నేనేరా!" అని మాత్రం అనగలిగేడు శేఖర్.

శేఖర్ బస్టాండ్ దాకా వచ్చి రాముని



బస్సెక్కించేడు.

"రామూ! జాగ్రత్త! నీకే అవసరం వొచ్చినా నేనున్నానన్న సంగతి మాత్రం మర్చిపోకు. డబ్బవసరమైతే మొగమాట పడకు. ఉత్తరం రాస్తే చాలు. నేనే స్వయంగా వస్తాను" రాము చెయ్యి చేతిలోకి తీసుకుని అభిమానంగా నొక్కుతూ భరోసాగా అన్నాడు.

"శేఖర్! నీ మేలు నా జన్మలో మరిచిపోలేను" అన్నాడు రాము కృతజ్ఞతాపూర్వకంగా, కళ్లలో నీళ్ల చిప్పిల్లుతుండగా.

బస్సు కదిలి విశాఖవైపు దూసుకుపోయింది. రాములో నూతనోత్తేజం వచ్చింది, మళ్లీ నగరంలోకి ప్రవేశిస్తున్నానన్న ఆనందంతో. మనసులో ఏవేవో ఆశలు ఆశయాలు అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్నాయి.

కళ్లు మూసుకుని నగరం వెళ్లగానే ఎవరెవరిని కలవాలి. ఏమేం చేయాలి అనుకుంటూ ప్రణాళికలు వేసుకుంటున్నాడు రాము.

**17**

బస్సు వైజాగ్ బస్‌స్టేషన్‌కి చేరుకుంది. రాము భుజానికి బ్యాగ్ తగిలించుకుని బస్ దిగాడు. సముద్రపు గాలులు ఎక్కడినుంచో వచ్చి రివ్వున ముఖానికి తగిలి శరీరాన్ని ఆహ్లాదపరిచాయి. మనసులో ఏదో తెలియని ఆనందం. అదే వైజాగ్ గొప్పతనం. ఎలాంటివారినైనా ఇట్టే మంత్రముగ్ధుల్ని చేసేస్తుంది అనుకున్నాడు రాము.

అనుకున్న ప్రకారం ముందుగా ప్రదీప్‌ని కలవాలి. తన బంగారు భవిష్యత్తు, కలలు కంటున్న ఆశలు ప్రదీప్‌తోనే ముడిపడి ఉన్నాయి. ఈ పాటికి సినీప్రపోజల్స్ ఒక కొలిక్కి వచ్చేసేవుంటాయి. తను కూడా ఆ గొప్ప ప్రాజెక్ట్‌లో ఒక భాగం కాబోతున్నాననే భావం కలిగితే చాలు రాము అంతరంగంలో ఆనందపవనాలు వీస్తున్నాయి.

ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలన్న తపనతోనే ప్రదీప్ ఇచ్చిన ట్యూనింగ్స్‌ని బాగా సాధన చేశాడు. బాగా అంటే మామూలుగా కాదు. రాక్షస సాధన. వాటిని ప్రదీప్‌కి వినిపించాలి. అతని మెప్పు పొందాలి.

సిటీ బస్ వచ్చింది. రాము ఎక్కి కూర్చున్నాడు. అర్ధగంటలో ప్రదీప్ పనిచేసే ఫార్మ్ దగ్గరకు చేరింది బస్సు. బస్సు దిగి ఫార్మ్ మెయిన్‌గేట్‌కి చేరాడు రాము.

"ఏయ్... ఆగు..." అంటూ సెక్యూరిటీ గార్డు అడ్డుపడి అటకాయించేడు.

"ప్రదీప్‌గారి మనిషిని. ఆయన్ని కలవడానికొచ్చాను" అన్నాడు

"సరే...!" అంటూ వెంటనే వొదిలేశాడు గార్డు. చాలా పెద్దఫర్మ్. విశాలమైన ప్రాంగణం. భారీ బిల్డింగ్‌లు.

అటుగా వస్తున్నవారిని అడిగి ప్రదీప్ పేరు ప్రస్తావించాడు.

"ఇటు వెళ్ళు"అంటూ దారి చూపారు వాళ్లు.

అక్కడికెళ్లి అడిగితే "అటువెళ్ళు" అని చెప్పారు. అలా అటూ యిటూ తిరిగేసరికి అర్ధగంటపైనే అయ్యింది. ఆఖరికి ఎలాగో ప్రదీప్ పనిచేసే సెక్షన్‌కి చేరుకున్నాడు.

"సార్! ప్రదీప్‌గారు కావాలి" లోపలికెళ్లి ఒకాయన్ని అడిగాడు.

ఆయన రాము వైపు అదోలా చూశాడు ప్రదీప్‌గారితో నీకేంటిపని అన్నట్టుగా "మీరెవరు?!"

ఆ ప్రశ్నకు రాము కాస్త తడబడ్డాడు. బెరుకుగా చూస్తూ "ప్రదీప్‌గారి ఫ్రెండ్‌ని సార్!" అన్నాడు. ఆ వెంటనే ఎక్కడ్నుంచి వచ్చిందీ చెప్పేడు.

"ప్రదీప్ లేడు" ఆయన ముభావంగా ముఖంపెట్టి అన్నాడు.

"ఎక్కడికెళ్లారు?!" ఆ మాటకు ఆయన రాము ముఖంలోకి అసహనంగా చూశాడు మళ్లీ.

"ఫ్రెండ్‌నంటున్నావు. తెలియదా!? ప్రదీప్ చెప్పలేదా! కంపెనీ పని మీద క్యాంప్ వెళ్లాడు?!"

"ఎప్పుడొస్తారు సార్?!"

"అబ్బో! ఆయనెళ్లింది అమలాపురమో, రాజమండ్రో కాదు. అమెరికా. నెల పడుతుంది...!" చిరాగ్గా చెప్పి లేచాడాయన అక్కడ్నుంచి విసురుగా.

రాము వెనక్కి తిరిగి వచ్చేశాడు. ఎక్కడలేని నీరసం ఆవహించేసింది. మళ్ళీ అంతలోనే పుంజుకుని నెల రోజులేకదా అనుకున్నాడు. మెయిన్ రోడ్డు మీదకొచ్చి సిటీ బస్టాండ్ దగ్గర నిలబడ్డాడు. ఏంచేయాలి? ఎలా గడపాలి?! అసలు ఎక్కడుండాలి?

ప్రదీప్‌ని ముందు కలిస్తే తన ప్రణాళికకు ఒక రూపం రావచ్చని మొదట అనుకున్నాడు. అతనే ఎక్కడుండాలో ఏం చేయాలో చెప్పేవాడు. బహుశా వచ్చినపని పూర్తి అయ్యేదాకా తన ఇంట్లోనే ఆతిథ్యం ఇచ్చేవాడు. కానీ అంతా తల్లకిందులయ్యింది.

ఇప్పుడేం చెయ్యాలి? పోనీ తనే వెళ్లి ఇంట్లో వాళ్లను కలిస్తే? ప్రదీప్ ఫ్యామిలీతో తనకు సత్సంబంధాలున్నాయి. తను వెళ్తే ఎంతో అభిమానంగా చూసుకుంటారు. కానీ ప్రదీప్ లేకుండా ఆ యింటికెళ్ళడానికి రాము మనసు అంగీకరించలేదు. వెంటనే ఆ ఆలోచనను పక్కన పెట్టేశాడు.

సూర్యంని కలిస్తే?! సూర్యం ఇక్కడే వైజాగ్‌లోనే ఏదో కంపెనీలో పనిచేస్తున్నట్టు రాముకి ఇంతకు ముందే తెలుసు. కానీ అది ఏ కంపెనీయో ఎక్కడుందో పూర్తి వివరాలు తెలియవు. ప్రదీప్‌ని కలిస్తే ఆ సంగతి తెలిసేది. బ్యాడ్‌లక్!

ఇప్పుడు సూర్యం ఆచూకీ కనిపెట్టడం తను చేయాల్సిన ముఖ్యమైన పని. అంతకంటే ముందు మోహన్‌ని కలవాలి. తనకిప్పుడు అర్జంట్‌గా కావలసింది ఈ నెల రోజులూ గడపడానికి తగిన వసతి. సిటీ బస్ లేటయ్యేట్టుంది. అసహనం అనిపించింది రాముకి. అప్పుడే అటుగా ఆటో వచ్చింది. ఆపి ఎక్కి గమ్యం చెప్పాడు.

* * *

అల్లంత దూరాన హాస్టల్ బిల్డింగ్స్ కనిపించగానే రాము ఒళ్లు ఝల్లుమంది. విద్యుత్తు లాంటిదేదో శరీరమంతటా ప్రవహిస్తున్న ఫీలింగ్ అంతులేని ఆనందం. అదుపులేని ఉద్వేగం. ఉత్సాహంతో మనసు ఉరకలు వేస్తోంది.

మూడు సంవత్సరాలు తనకు రాజభోగాలు అందించిన ప్రదేశం. అందరికీ కేంద్రబిందువై మన్నలను పొందుతూ, గౌరవాభిమానాలను చేజిక్కించుకునేట్టు చేసిన ఆ బిల్డింగులకు దగ్గరవుతున్నకొద్దీ హృదయస్పందనలు అధికమవుతున్నాయి.

ఆటో ఆగింది. హాస్టల్ మెయిన్‌గేటు చేరగానే ఆటోవాడికి నోటిచ్చి చిల్లరసంగతి కూడా పట్టించుకోకుండా లోపలికి జారుకున్నాడు హుషారుగా.... జోరుగా.

"ఏ స్టూడెంట్ కుర్రాళ్లో ఏంటో... డబ్బు విలువ బొత్తిగా తెలియదు. చిల్లర కూడా అడగలేదు. ఎలా అడుగుతాడు? ఇంట్లో అమ్మా నాన్నా అడిగినంతిస్తే! జేబులో నోట్లున్నన్నాళ్లూ చిల్లర సంగతి పట్టదు. కష్టపడి సంపాదిస్తే తెలుస్తుంది ఈ కుర్రకుంకలకి" నడివయసు దాటిన ఆ ఆటోడ్రైవర్ ఆటోని రివర్స్ చేసి డ్రైవ్ చేసుకుని పోతూ అనుకున్నాడు.

"హలో గాయకమణిగారూ! బాగున్నారా? !" హఠాత్తుగా కళ్లెదుట ప్రత్యక్షమైన రాముని చూసి కళ్లింత చేసుకుంటూ అమాంతం గుండెలకు హత్తుకున్నాడు మోహన్.

చాలాసేపు అక్కడే నిలబడి గడగడ మాట్లాడుకున్నారిద్దరూ. ఆ తర్వాత మోహన్ రాముని తన గదికి తీసుకెళ్లాడు. గదిలోకి రాగానే అసిస్టెంట్ రెండు గ్లాసులతో టీ పట్టుకొచ్చి ఇచ్చాడు.

"తీస్కో రాము" అంటూ ఎంతో ఆప్యాయంగా టీ గ్లాస్ రాముకి అందించాడు మోహన్. టీ తాగి అలా రిలాక్స్‌డ్‌గా మంచంపై నడుం వాల్చాడు రాము.

"రామూ! నువ్వు బాగా అలసిపోయి ఉన్నావు. రెస్ట్ తీసుకో. లంచ్ పని కొంచెం

## ఇద్దరూ కలిసే వేయండి

బెంగుళూరులో శ్రీకృష్ణతులాభారం నాటకం వేస్తున్నారు.. సత్యభామగా 'స్థానం' తన నటవిశ్వరూపం చూపి ప్రేక్షకుల్ని మరిపించి, మురిపించారు. నాటకం అయ్యాక ఆయనను అభినందించడానికి ఒక రిటైర్డ్ మిలిటరీ ఆఫీసర్ ఓ పూలదండ చేతపుచ్చుకుని, సతీసమేతంగా నేరుగా గ్రీన్‌రూమ్‌లోకి వచ్చారు. అప్పటికి 'స్థానం' ఇంకా మేకప్‌లోనే ఉన్నారు. తీరావచ్చాక పరకాంతకెలా దండవేస్తామని తటపటాయించి సదరు ఆఫీసర్‌గారు తనభార్యతో ఆపని చేయించబోయారు. కానీ పరకాంతతో దండ వేయించుకోవడమెలా అని తటపటాయించడం ఈసారి 'స్థానం' వంతయింది. అందుకే ఆయన ఇద్దరూ కలిసి వేయండి సరిపోతుందని చెప్పి ఆ సమస్యను సరసంగా పరిష్కరించారు.




వుంది. ఆ పని చూసుకుని వస్తాను. ఈలోగా స్నానం చేసేయ్. నేనక్కడ క్షణం లేకపోతే కుక్స్ ఇష్టం వచ్చినట్టు చేసేస్తారు. ఆ తర్వాత స్టూడెంట్స్‌తో పడలేం. సాంబారు బాగోలేదని, పప్పులో ఉప్పు తక్కువని పెరుగు మజ్జిగలా తగలడిందని..." అని హడావుడిగా చెబుతూ నవ్వేడు

మోహన్, నీకు తెలియందేం ఉంది అన్నట్టు రాము ముఖంలోకి చూస్తూ.

"వెళ్ళు! వెళ్లు! ముందా పని చూడు. లేక పోతే నా వల్ల నీకు నీలాపనిందలు" అని తొందరచేస్తూ తనూ నవ్వేడు రాము బదులుగా.

మోహన్ వెళ్లగానే రాము టవల్ తీసుకుని స్నానం చేయడానికి సిద్ధమయ్యాడు. తనివి తీరా అర్ధగంటకు పైగా జలకాలాడాడు.

మళ్లీ తన గతవైభవం తనకు దక్కిందన్న ఆనందం రాముని ఉక్కిరిబిక్కిరి చేసేస్తోంది. స్నానమయ్యింది.

ఫ్యాన్ ఫుల్ స్పీడ్ పెట్టి మళ్లీ మంచంపై వాలిపోయాడు. ఏవేవో భావాలు అంతరంగాన్ని అతలాకుతలం చేసేస్తున్నాయి. అంతవరకూ హాయిగా నిద్రపోదామని తాపత్రయపడిన రాముకు అంతులేని ఆలోచనలు మస్తిష్కాన్ని తొలిచెయ్యడంతో చిరాకుగా అనిపించింది. కళ్లు మూసుకున్నా నిద్రపట్టలేదు.

పోగొట్టుకున్నవి ఒక్కసారిగా పొందినప్పుడు దాన్నెలా అనుభవించాలా అని తికమకపడినపుడు కలిగే అశాంతి అది.

ఆ వాతావరణంలో అడుగుపెట్టినప్పట్నుంచీ అదే పరిస్థితి. ఏదో తెలియని ఆరాటం... ఆత్రం. గత స్మృతులన్నీ ఒకేసారి మనసులోకి ప్రవేశించి చిందరవందర చేసేస్తున్నాయి. మంచంపై నుంచి లేచి గదిలో అటు యిటు పచార్లు చేసి మళ్లీ మంచంపై పడ్డాడు. ఆలోచిస్తూనే మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

* * *

జీవితంలో మొదటిసారిగా కళకు సంబంధించిన గొప్ప సత్యమొకటి రాముకి తెలిసొచ్చింది. అదేమిటంటే...

ఏ కళైనా ఎవరో ఒకరు వెలికి తీయాలి. ప్రోత్సహించి పురిగొల్పాలి. అప్పుడే అది నెమలిలా పురివిప్పుకుని నాట్యం చేస్తుంది.

ఈమధ్య ఎవరూ తననుగాని తన పాటనుగాని ప్రోత్సహించలేదు. అందుకే పాడడం అన్నమాటే మర్చిపోయాడు. దాదాపుగా ఎప్పుడైనా చేస్తే ప్రదీప్ ఇచ్చిన ట్యూనింగ్స్ సాధన చేయడం, ఎక్కువగా పాడింది లేదు. ఆ ట్యూనింగ్స్ సాధన కూడా బాగా ప్రాక్టీసు చేసి ప్రదీప్ చేత శెభాష్ అనిపించుకోవాలనే. సినిమా ఛాన్స్ చేజారిపోకుండా అద్భుతంగా పాడి ప్రజల చేతనూ ఆహా అనిపించుకోవాలన్న ఉబలాటంతోనే. అయితే ప్రదీప్ నుంచి కబురొస్తుందన్న ఆశతో చేసిన ప్రాక్టీస్ ఆ కబురేమీ రాకపోవడంతో రోజురోజుకూ సన్నగిల్లింది. అది కూడా పాడడం మానేసి నోరు కుట్టేసుకున్నాడు బలవంతంగా. దాదాపు తనలోని గాయకుడు చనిపోయాడనే అనుకున్నాడు. అందుకు బలమైన కారణాలు కూడా లేకపోలేదు.

ఎప్పుడో స్కూల్ ఫైనల్ లో స్టేజిపై నటించి పలువురి ప్రశంసలందుకున్నాడు. ఆ తర్వాత అలాంటి సందర్భం రాలేదు. తన నటనా ప్రతిభను ప్రదర్శించే అవకాశం చిక్కలేదు. అలా రాములోని నటుడు చచ్చిపోయాడు.

అలాగే రచయిత కూడా. మొదట్లో అడపాదడపా రాసేవాడు. అవి పత్రికల్లో అచ్చయ్యేవి. చదివి మెచ్చుకునే వాళ్ళు. ఆ తర్వాత ఎందుకో ఏ రచన చేసినా అచ్చయ్యేది కాదు. తిరుగు టపాలో గోడకేసికొట్టిన బంతిలా తిరిగొచ్చేది. ఆఖరికి విసుగొచ్చి పూర్తిగా కలం పట్టడం మానేశాడు రాము. ఎప్పుడైనా ఏదైనా రాయాలని బలవంతంగా ప్రయత్నించినా సాధ్యమయ్యేది కాదు.

అదేవిధంగా పాడడం కూడా మరుగున పడిపోయింది. శాస్త్రీయ సంగీతం సాధన చేద్దామనుకున్నాడు, ఒకప్పుడు సూర్యం ప్రోత్సాహంతో. అలా అనుకుంటూనే కాలం గడచిపోయింది. కొంత డబ్బులు లేక, కొంత సమయం లేక, మరికొంత సూర్యం వంటి వాళ్ల ఆసరా లేక.

చేద్దాంలే అనుకుంటూ గడిపేశాడు. పరీక్షలయిపోవడంతో ఊరెళ్లిపోయాడు.

శాస్త్రీయ సంగీతం నేర్చుకోకపోయినా, సినిమా ఛాన్స్ దక్కుతోందిగా అనుకుంటూ గడిపేశాడు.

విచిత్రమేమిటంటే, సినిమా ఫీల్డ్ గురించిగానీ, దానిలో ఉన్న పోకడలు గానీ, తనలాంటి వారికి ఎదురయ్యే చేదు అనుభవాలు గానీ, తగిలే ఎదురుదెబ్బలు కానీ రాముకి పెద్దగా తెలియవు. ఎప్పుడైనా సినిమా పత్రికలు తిరగేసినప్పుడు ప్రముఖులు తొలినాళ్ళలో ఎదురైన చేదు సంఘటనలు గురించి గొప్పగా చాటుకోవడాన్ని చదవడం మినహా.

ప్రదీప్ మాటల్ని పూర్తిగా నమ్మేశాడు. నమ్మకపోవడానికి సినిమా ఫీల్డ్, అందులోని లోతుపాతులు తెలిస్తే కదా.

ప్రదీప్‌కి పెద్ద హోదా. డబ్బు కూడా బాగానే ఉంది. ఆయన మిత్రులు కూడా అదే స్థాయిలో ఉంటారు. అందుకని సినిమా తీయడం వారికి పెద్ద లెక్కలోది కాదు. ట్యూనింగ్స్‌దాకా వచ్చిందంటే తీయకపోవడమనేదే ఉండదు అనే గుడ్డి నమ్మకంతోనే ఆనాటి నుంచి గడిపేస్తున్నాడు.

దానికితోడు చుట్టూ ఉన్న విద్యార్థులు పొగడ్తలు, మెచ్చుకోళ్ళ ఎలాగూ ఉన్నాయి.

కానీ ఈ ఏడాదిన్నరగా అదేం లేకపోవడంతో తొంగిచూచిన నిరాశ, తనలోని కళను ప్రోత్సహించే ఆప్తహస్తం లేకపోవడంతో తాత్కాలికంగా అతడి గళం మూగబోయింది.

ఇప్పుడు మళ్ళీ కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది రాముకి. ఎంతోకాలంగా మూగబోయిన రాము గొంతు మళ్ళీ రాగరంజితాలను చిందిస్తోంది మోహన్ పుణ్యమాని.

మోహన్ ఖాళీ దొరికినప్పుడల్లా రాము చేత పాడించుకుంటున్నాడు. మోహన్ కోరుతున్నకొద్దీ రాములోని కళ ప్రవాహంలా ఉబుకుతోంది. బయటికొచ్చేస్తోంది. తనకొచ్చిన ఘంటసాల పాటలు.... పద్యాలు, భగద్గీత శ్లోకాలు... అన్నీ వరుసగా పాడేస్తుంటే తనకే ఆశ్చర్యంగా అనిపిస్తోంది. అప్పుడనుకున్నాడు రాము.

కళాకారుడిలోని కళ తాత్కాలికంగా నిద్రపోతుందిగాని శాశ్వతంగా చచ్చిపోదని.

ఊరునుంచి వచ్చినరోజే తెల్లవార్లూ గాత్రకచేరి సాగింది. ఆ పాటలకు ఆ గొంతులోని మాధుర్యానికి పరవశిస్తూ చుట్టూ ఉన్న విద్యార్థులు వచ్చిచేరారు.

"ఈయన రాము అని నా స్నేహితుడు. మీలాగే ఒకప్పుడు ఈ హాస్టల్లోనే ఉండేవాడు. ఈయన త్వరలో సినిమాల్లో పాడబోతున్నాడు" మోహన్ చెప్పాడు. హాస్టలంతా రాము పేరు మారుమోగిపోతోందిప్పుడు.

తరచూ ఎవరెవరో వచ్చి అభిమానంగా పలకరించి షేక్‌హ్యాండిస్తుంటే రాముకి తనువు పులకరించిపోతోంది. మళ్ళీ మళ్ళీ ఇదివరకిటిలా ఊహల్లో ఊరేగుతూ మనసు ఎటో వెళ్ళిపోతోంది.

"హలో! సింగర్‌గారూ.... మీ సినిమా ఎప్పుడు రిలీజవుతుంది? ! మీ పాటలు రికార్డయ్యాయా? ! క్యాసెట్ మార్కెట్లోకి ఎప్పుడొస్తుంది'



**మోహన్ కోరుతున్నకొద్దీ రాములోని కళ ప్రవాహంలా ఉబుకుతోంది. తనకొచ్చిన ఘంటసాల పాటలు.... పద్యాలు, శ్లోకాలు... అన్నీ వరుసగా పాడేస్తుంటే తనకే ఆశ్చర్యమనిపిస్తోంది**

' హాస్టలర్స్ వొత్తిడి ఎక్కువ కాసాగింది. ఆ స్ఫూర్తితో మళ్లీ సాధన ముమ్మరం చేశాడు రాము. అప్పుడప్పుడు కలాన్ని ఝళిపించడం కూడా మొదలుపెట్టేడు కథలు, కవితలు రాస్తూ.

* * *

టిఫిన్, భోజనం అన్నీ రూమ్‌కే వచ్చేస్తు న్నాయి. ప్రత్యేకంగా మెస్ హాల్‌కి వెళ్ళే అవ సరం లేదు.

దేనికీ ఇబ్బందిపడే అవసరం లేదు. అలా అన్ని ఏర్పాట్లూ చేసి ఎంతో అభిమానంగా చూసుకుంటున్నాడు మోహన్ రాముని.

ఏకంగా అయిదు రోజులు హాస్టల్‌ని వొదిలి పెట్టలేదు రాము. తినడం, పడుకో వడం, హాయిగా పాడు కోవడం... తనివితీరా హాస్టల్ ఆవరణంతా తిరిగి అణువణువునీ పరిశీలించి గత స్మృతులను నెమరేసుకోవ డమే ఈ అయిదు రోజులూ చేసింది.

ఏ గదిలో ఏ సంఘటన జరిగింది!

ఎక్కడ గంటలకొద్దీ కూర్చుని కచేరీ చేసింది.

అన్నీ మననం చేస్కుంటూ అవ్యక్తమైన అనుభూతిని పొందుతున్నాడు.

హాస్టలర్స్ అంతా క్లాసులకి వెళ్లినప్పుడు రాము హాస్టల్ ఆవరణంతా పిచ్చివాడిలా తిరిగి సరదా తీర్చుకునేవాడు.

పదేపదే వరండాల్లో స్వేచ్ఛగా తిరిగి ఇదీ అని చెప్పలేని ఆనందానుభూతిని పొందే వాడు. అలా ఎన్నాళ్ళు గడిపాడంటే తనొచ్చిన పనేమిటో మర్చిపోయేంతగా.

టెర్రస్ మీదకొచ్చేసరికి జగ్గు గుర్తుకొచ్చాడు. జగ్గు ప్రేమ వ్యవహారం అంతా కళ్లెదుట సిని మాలా కదలాడింది రాముకి.

'పాపం జగ్గు! ప్రేమ పిచ్చిలో పడి తనను తానే అన్యాయం చేసుకున్నాడు' అని అనుకు న్నాడే గాని తననుతాను తెలుసుకోలేకపో యాడు రాము. ఆ సంగతి ఎవరైనా గుర్తు చేస్తేనే తెలిసేది. అంతదాకా అది గుండెల్లో దాగుండిపోతుంది.

సస్పెండ్ అయ్యాక జగ్గు ఎక్కడికి పోయాడో ఏమయ్యాడో తెలియదు రాముకి. పరీక్షల సమయంలో జరిగిన సంఘటన కావ డంతో సూర్యం కూడా పెద్దగా పట్టించుకున్న ట్లనిపించలేదు అతడికి. ఎక్కడికి పోయుం టాడు. ఇంటికే పోయుంటాడేమో అని సూర్యం అనడం రాముకి గుర్తుంది.

ఆ తర్వాతి కాలంలో అవమాన భారంతో తాగుడుకి బానిసయ్యాడని. ఆత్మహత్య చేసు కుని చనిపోయేడని. ఏవో గాలి కబుర్లు తెలి శాయిగాని, అసలు విషయం తెలియదు. సూర్యాన్ని కలిశాక గానీ జగ్గు సంగతి పూర్తిగా తెలియదనుకున్నాడు రాము.

ఆ రోజు మళ్ళీ ప్రదీప్‌ని కలవడానికి బయ ల్దేరాడు. ఫోన్ నెంబర్ తెలియదు. లేకపోతే ఫోన్ ద్వారానే ప్రదీప్ సమాచారం తెలిసేది. ఈసారి తప్పకుండా ఫోన్ నెంబర్ తీసుకోవా లనుకున్నాడు రాము.

ఎంతో ఆశతో వెళ్లిన రాముకి మళ్లీ చుక్కె దురు. ప్రదీప్ ఫారిన్ ప్రోగ్రాం పొడిగించబ డిందట. ఎప్పుడొస్తాడో, ఎన్నాళ్ళు పడుతుందో ఎవరూ కరెక్టుగా చెప్పలేకపోయారు.

"పోనీ ప్రదీప్‌గారి ఫోన్ నెంబరివ్వండి సార్" ప్రాధేయపడుతూ అడిగేడు రాము, ప్రదీప్ ఆఫీస్ వాళ్ళని.

వాళ్లు రామువైపు అదోలా చూశారు.

కొందరు హేళనగా నవ్వారు.

"ఆయనేమైనా అల్లాటప్పా మనిషనుకు న్నావా! ప్రదీప్‌తో డైరెక్టుగా మాట్లాడ్డానికి మేమే జంకుతాం. ఆయన స్థాయి అలాం టిది. నువ్వు చూస్తే ఆయనకి బంధువులా ఫోన్ నెంబరిమ్మంటున్నావు"

"అవున్సార్! ప్రదీప్‌గారికి సన్నిహితుణ్ణే. ఆ సంగతి కావాలంటే ఇప్పుడే ఋజువు చేస్తాను. ఆయనకి డయల్ చేసి నాకివ్వండి. మీ ఎదుటే మాట్లాడతాను" అన్నాడు రాము పౌరుషంగా. తనను చిన్నచూపు చూడడం రాము భరించలేకపోతున్నాడు. అహం దెబ్బ తిని అవమానభారంతో కుమిలిపోతున్నాడు. కళ్ల వెంట నీళ్ళు రాలిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి.

తను కాబోయే సినీ సింగర్‌ననీ ప్రదీప్‌గారి సంగీత సారథ్యంలో పాడబోతున్నానని చెప్పాలనిపించింది రాముకి. ఇలాంటివాళ్ళే రేపు తను ఉన్నత స్థానానికి చేరి గొప్ప పేరు తెచ్చుకున్నప్పుడు వెంట పడి మరీ ఆటోగ్రాఫ్ లడుగుతారు. వొంగి వొంగి సలాములు చేసి కాళ్ల బేరాలాడుతారు. అప్పుడు చెబుతాను వీళ్ళ పని అని కసిగా లోలోపల అనుకుంటూ పళ్ళు నూరుకున్నాడు రాము.

రాము అవస్థను గ్రహించిన ఓ వ్యక్తి నెమ్మదిగా నచ్చజెప్పి పెద్ద తరహాగా మాట్లాడేడు.

"చూడు బాబూ! ప్రదీప్‌గారి ఫోన్ నెంబర్ మాకే తెలియదు. ఇక నీకెలా చెప్పగలం. అయినా ఆయన ఒకచోట ఉండరు. కావాలంటే మా ఆఫీస్ ఫోన్ నెంబరు తీసుకుని ప్రదీప్ గారొచ్చారని తెలుసుకుని రా!" అని ఓ కాగితంపై ఫోన్ నెంబర్ రాసిచ్చాడాయన.

రాము ఆ కాగితం మడిచి జేబులో పెట్టుకుని బయటికొచ్చేశాడు.

రాముకి తల కొట్టేసినట్టనిపించింది. వాళ్ళ ప్రవర్తన, మాట తీరు, అయినా ఏమీ చేయలేని నిస్సహాయత. నిరాశతో హాస్టల్‌కి తిరుగుముఖం పట్టాడు.

**18**



దాదాపు రెండు వారాలు గడిచిపోయాయి. హాస్టల్‌లో ఏం తోచక బీచ్‌కు వెళ్ళాడు. ఏ పనీ లేదు. ఎవరూ మిత్రులు లేరు. అనుకున్నది జరగడం లేదు. ఏదో చిరాకు. విసుగు మనసు నిండా. దిక్కు తోచనివాడిలా బీచ్ రోడ్డులో తిరుగుతున్నాడు. ఎక్కువసేపు ఉండ బుద్ధి కాక తిరిగి వెళ్లిపోదామని బస్టాపుకు వచ్చి సిటీ బస్సు కోసం ఎదురు చూస్తున్నాడు. కాస్త దూరంగా కిళ్లీ షాపు వద్ద ఒక మోటార్ సైకిల్ ఆగడం గమనించాడు.

ఓ వ్యక్తి సూటూ బూటూ వేసుకుని హుషారుగా ఈల వేస్తూ పక్కనున్న పాన్ షాప్ అతణ్ణి ఏదో ఇమ్మని అడగడం గమనించాడు రాము. ఆ వ్యక్తిని చూసేసరికి రాము ఒక్కసారి తనను తాను నమ్మలేకపోయాడు. బోల్డంత ఆశ్చర్యం, ఆనందం కలిగింది.

అద్భుతం... ఒకనాటి తన ఆత్మీయ మిత్రుడు... శ్రేయోభిలాషి... ఎవరి వివరాలు తెలియక తను తల్లడిల్లాడో ఆ వ్యక్తి ఇప్పుడు ఇలా హఠాత్తుగా ప్రత్యక్షం కావడం దానికి కారణం.

ఆ వ్యక్తి సూర్యం!

రాముా ఆశ్చర్యం నుంచి తేరుకుని సూర్యం అని పిలిచేలోపే అతడు కిళ్లీ షాపులో తనకు కావల్సింది తీసుకుని బైక్‌మీద కూర్చుని స్టార్ట్ చేసేశాడు. రాము పరుగున వెళ్లేలోగా మోటారు సైకిల్ కదిలింది.

సూర్యం, సూర్యం అని గట్టిగా అరుస్తూ చప్పట్లు కొడుతూ పరిగెత్తాడు. పది, పదిహేను గజాలు వెళ్ళాక ఎవరో పిలుస్తున్నట్లనిపించి సూర్యం మోటార్ సైకిల్ స్లో చేసి తల వెనక్కి తిప్పి చూశాడు. రాముా చేయి ఊపుతూ పిలవడం కన్పించి బండి ఆపాడు.

రాముా పరుగెత్తుకుంటూ వెళ్ళి అతడి దగ్గర ఆగాడు. అలుపుగా అన్పించి ఒక నిమిషంపాటు గట్టిగా ఊపిరి పీల్చుకుంటూ రొప్పుతుండిపోయాడు.

అప్పటికి రామూని గుర్తు పట్టిన సూర్యం "నువ్వా" అంటూ తేరిపార చూశాడు.

రాముా చిక్కిపోయి ఉండడం, నల్లబడడం గమనించాడు. "ఎప్పుడొచ్చావ్, ఇక్కడేం చేస్తున్నావ్" అనడిగాడు మామూలుగా.

తను కనబడగానే వాటేసుకుని ఆత్మీయత కురిపిస్తాడనుకున్న రామూకి అతడు మామూలుగా అలా అడగడం కాస్త నిరాశ కలిగించింది.

అయినా అది కనబడనీయకుండా ఎప్పుడొచ్చిందీ, ఎక్కడుంటోంది చెప్పాడు. అతడిని

కలుసుకోవాలని పరితపించినా ఎక్కడున్నాడో తెలియక అల్లాడిందీ చెప్పాడు. అంతా విని సూర్యం ఊకొట్టాడు తప్ప ఏం మాట్లాడలేదు.

సూర్యం ధోరణి రాముకి అర్థం కావడం లేదు.

"ఏంటి సూర్యం ఏదో పరిచయస్తుడితో మాట్లాడినట్లు మాట్లాడుతున్నావు. ఏమైంది నీకు? " అని అడిగేశాడు రాము ఉండబట్ట లేక.

"అబ్బే అదేంలేదు. ఏదో ఆఫీసు విషయం మైండ్‌లో ఉండిపోతే అదే ధ్యాసలోనే ఉన్నాను. అంతే" అని "డిప్లొమా పూర్తి చేశావా? " అడిగాడు సూర్యం.

లేదన్నట్లు తల అడ్డంగా ఊపాడు రాము.

సూర్యం ధోరణి, ముక్తసరి మాటలు చివుక్కుమనిపిస్తున్నా, తనపట్ల ఇదివరకటి ఆసక్తి కనబరచకపోయినా చాలా కాలం తర్వాత కనిపించిన సూర్యంకి ఆర్తిగా తన మనసంతా విప్పి చెప్పుకుపోతున్నాడు రాము. అన్నిటికీ యాంత్రికంగా ఊం కొడుతూ ఎటో చూస్తూ ఇంకేమిటి విశేషాలు అంటున్నాడు సూర్యం, వింటున్నాను చెప్పు అనే అర్థం స్ఫురించేలా.

"ఈ మధ్యనే మా అమ్మ చనిపోయింది సూర్యం" రాము దీనంగా ముఖంపెట్టి అన్నాడు.

"అయ్యో" అని ఊరుకున్నాడంతే సూర్యం.

రాముకి చాలా బాధనిపించింది. తను కోరుకున్న సానుభూతి సూర్యం నుంచి రాకపోవడంతో అతడి హృదయం గాయపడింది.

'ఏంటీ సూర్యం. ఎందుకిలా అయిపోయాడు. తనని వెంటేసుకుని తిప్పి, పదే పదే ప్రోత్సహించిన సూర్యమేనా ఇతడు అనుకున్నాడు మనసులో.

"సూర్యం! ఎక్కడైనా కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడు.

"నేను ఆఫీసు పనిమీద బయటికొచ్చాను. మళ్లీ ఆఫీసుకు వెళ్ళిపోవాలి" అన్నాడు సూర్యం.

"వెళ్ళిపోదువుగానిలే. కొంచంసేపు నీతో మాట్లాడాలి. ప్లీజ్" అభ్యర్థిస్తున్నట్లు అడిగాడు రాము. ఒక మిత్రుణ్ణి అలా అడగడం తనకే ఏదో ఎబ్బెట్టుగా అన్పించింది.

"సరే" అని బండి లాక్ చేశాడు సూర్యం.

ఇద్దరూ దగ్గరలోని క్యాంటీన్‌లో కూర్చున్నారు. సూర్యం రెండు టీ ఆర్డర్ చేశాడు. టీ సిప్‌చేసి అన్నాడు రాము, "సూర్యం నువ్వు చాలా మారిపోయావు"

సూర్యం రాము వంక చూసి కాబోలన్నట్లు భుజాలు ఎగరేసి నవ్వీనవ్వనట్లుగా అన్నాడు.

"హాస్టల్లో ఉండగా ఎలా ఉండేవాళ్ళం. ఏడాదిన్నరైనా పూర్తి కాలేదు నీలో ఎంతో తేడా కన్పిస్తోంది. ఎందుకు? "

"తేడా తేడా అంటున్నావు. ఏం తేడా రాము. కాలేజి, హాస్టల్, స్నేహాలు అదో జీవితం. ఇప్పుడు జీవితం వేరు. నువ్వే ఇంకా ఈ జీవితంలోకి అడుగు పెట్టినట్లు లేవు. కొత్త బరువులు, బాధ్యతలు. అవి ఒకసారి మొదలైతే వాటిలోనే పడి కొట్టుకుపోతాం. నేనూ అంతే"

"నేను కాదనడం లేదు. బాధ్యత, బరువులు ఎక్కువైతే నువ్వన్నట్లే జరుగుతుంది. కానీ ఇంత స్వల్ప కాలంలో స్నేహాన్ని, మిత్రులను కూడా మరచిపోయేటంతగా, పోనీ ఇలా కలిసినప్పుడు కూడా మునుపటిలా ఉండలేనంత మార్పే ఆశ్చర్యం కలిగిస్తోంది"

"నువ్వలా అనుకుంటున్నావు అంతే"

అలా అన్నాడుగానీ ఇదివరకటిలా తాను లేడన్న సంగతి సూర్యానికి కూడా తెలుసు. అతడలా అనడంతో ఏమనాలో తెలియక మౌనం వహించాడు రాము.

"నువ్వు డిప్లొమా పూర్తిచేసి ఏదైనా ఉద్యోగం చూసుకో. కాస్త జీవితం మెరుగు పడుతుంది" సలహా ఇస్తున్నట్లుగా అన్నాడు.

విచిత్రంగా చూశాడు రాము సూర్యాన్ని. ఒకప్పుడు తన పాటంటే చెవి కోసుకుని, తనని వదలిపెట్టకుండా వెంట తిప్పుకుని, గాయకుడిగా తనకు ఉజ్వల భవిష్యత్తు ఉందని అన్న సూర్యమేనా ఇలా మాట్లాడేది అనుకున్నాడు.

"ఎలా పూర్తి చేస్తాను సూర్యం. నా

పాటను మీ అందరూ పొగిడి, ఆకాశానికెత్తేసి నాలో ఎన్నో ఆశలు రేకెత్తించి, ఎంతో ఉత్సాహాన్ని నింపారు మీరంతా. ఇప్పుడా మాట-నా పాట గురించి కనీసం ఒక్క మాట కూడా మాట్లాడకుండా ఉద్యోగం గురించి సలహా ఇస్తున్నావా" అన్నాడు. అతడి స్వరంలో బాధ తొంగి చూసింది.

"రామూ, డోన్ట్ బి ఫూలిష్. అంతా మా తప్పు అన్నట్లు మాట్లాడకు. నువ్వు బాగా పాడతావు కాబట్టి ఎంకరేజ్ చేశాం. ఆ ఎంకరేజ్‌మెంట్ ఊతంగా నువ్వు ముందుకు సాగే ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నమూ చేయలేదు. చదవాల్సిన చదువుకు సున్నా చుట్టేసుకున్నావు. ఆ రోజుల్లో మేమంతా చెప్పేవాళ్ళం. చదివి పరీక్షలు పాస్ కమ్మని. పెడచెవిని పెట్టావు. ప్రతి దానికీ ఎప్పుడూ ఎవరో ఒక ఆసరా కావాలి అంటే ఎలా? నువ్వే ఏదో ఒక మార్గం వెదుక్కుని ముందుకెళ్లాలి"

సూర్యం మాటల్లో వాస్తవం ఉన్నా అతడలా అనడం రాముకు మనసులో బాణాలు గుచ్చినట్లనిపించింది. నిజమే. ఇప్పటికీ తను చదువు గురించి బెంగ పడడం లేదు. గాయకుడిగా తన లక్ష్యాన్ని సాధించడం గురించే. దాని గురించి సూర్యంతో ఇప్పుడు ఏం మాట్లాడినా ప్రయోజనం లేదనిపించింది అతడికి.

దీర్ఘంగా నిట్టూర్పు వదిలాడు.

"సూర్యం అప్పుడు మీ బావగారి దగ్గరకు తీసికెళ్ళి పరిచయం చేశావు. ఆయన ఇస్తానన్న ఆఫర్ మీదే ఇన్నాళ్లూ ఆశలు పెట్టుకుని ఉన్నాను. ఆయన్ని కలుద్దామని నా భవిష్యత్తుకు బాట వేసుకుందామనే వచ్చాను. కానీ ఆయన లేరట. ఆయన కోసమే వెయిట్ చేస్తున్నాను. ఆయన వచ్చాక ఇద్దరం వెళ్ళి కలుద్దాం" అన్నాడు రాము.

అతడి మాటలు పూర్తి కాకముందే.

"సారీ రాము! నాకు రావడం కుదరదు! నువ్వెళ్ళు"



సూర్యం ముభావంగా చెప్పేశాడు.

"ఏం! ఎందుకని? "

"ఎందుకంటే ఏం చెప్పను? మా బావగారికి నామీద కోపమొచ్చింది. ఆయనగారి చెల్లెల్ని నేను పెళ్ళి చేస్కోకుండా వేరే సంబంధం చేసుకున్నానని. కుండమార్పిడి మంచిది కాదని మా ఇంట్లోవాళ్లు కూడా నేను కోరుకున్న అమ్మాయితో నా పెళ్ళి జరిపించారు"

"నీకు పెళ్లయిపోయిందా? ఎప్పుడు? మరి నాకు చెప్పలేదేం? "

"ఈ మధ్యే... చెప్పానుగా... ఫ్యామిలీ గొడవల మూలంగా అనుకోకుండా హడావుడిగా జరిగిపోయిందంతా" అని సూర్యం,

"ఇక వెళ్దాం నాకు ఆలస్యమైపోతోంది" అంటూ లేచాడు.

బైక్ దగ్గరకు వచ్చాక "మా ఆఫీసు నువ్వెళ్ళేదారిలో కాదు. ఇటు వైపు. మరి నే వెళతాను" అంటూ బండి స్టార్ట్ చేసి వెళ్లిపోయాడు సూర్యం.

రాము స్థాణువైపోయాడు. కనీసం తను ఫలానాచోట ఉంటున్నానని, ఫలానా ఆఫీసులో పని చేస్తున్నానని, ఫలానా అప్పుడు కలుద్దాంలే అని కూడ చెప్పకుండా సూర్యం వెళ్లిపోవడం చెప్పలేనంత ఆశ్చర్యం కలిగించిందతనికి.

సూర్యం కోసం తను పడిన తపనలో తనపై సూర్యానికి వెయ్యోవంతు కూడా లేదని రాముకి బోధపడింది. అయినా జీర్ణించుకోలేక పోతున్నాడు. అందుకే సూర్యం చూపిన అనాసక్తికి, నిరాదరణకు నిశ్చేష్టుడైపోయాడు. ఇదివరకటి సూర్యమేనా లేక తను కలగంటున్నాడా అనుకున్నాడు. తల కొట్టేసినంత అవమానభారం అతడి హృదయంలో.

> రాము స్థాణువైపోయాడు. కనీసం తను ఫలానాచోట ఉంటున్నానని, ఫలానా ఆఫీసులో పని చేస్తున్నానని, ఫలానా అప్పుడు కలుద్దాంలే అని కూడ చెప్పకపోవటం ఆశ్చర్యం కలిగించిందతనికి

తన స్థితి చూసి, తనెక్కడ మీద వాలిపోతాడేమోనని బెంబేలు పడ్డాడా? తనను చేరదీసి ఆశ్రయం ఇవ్వాల్సి వస్తుందని భయపడ్డాడా? అందుకే అంటీ ముట్టనట్లుగా ఉన్నాడా? ఏమీ అర్థం కాలేదు రాముకి.

తనతో ప్రదీప్ దగ్గరికి వస్తానని మాట ఇవ్వకపోయినా ఫర్వాలేదు. కనీసం కలిశాక ఏం జరిగిందో చెప్పమనిగాని, మళ్లీ కలవమని ఎడ్రస్ ఇవ్వడం గాని చేయలేదు సూర్యం. పైగా తనొచ్చిన పని గురించి పదే పదే ప్రస్తావించినకొద్దీ చిరాకుగా ముఖం తిప్పేసుకున్నాడు. అలా ఆలోచించుకుంటూనే హాస్టల్ కి చేరాడు.

మరో రెండు వారాలు గడిచాయి. ఈ రెండు వారాలూ బాధ పడని క్షణం లేదు.

సూర్యం ప్రవర్తన పదేపదే గుర్తు చేసుకుని అదే పనిగా లోలోపల కుమిలిపోతున్నాడు. నా అనుకున్నవాళ్లు నాకెందుకులే అన్నట్టుంటే ఎవరికైనా ఈ తీవ్రమైన క్షోభ తప్పదుగా.

సూర్యంతో సరదాగా విశాఖ వీధుల్లో మళ్లీ తిరిగి ఒకనాటి తీపి అనుభవాలను పునశ్చరణ చేసుకోవాలని రాము ఎంతగానో తహతహలాడిపోయాడు. ఆ క్షణాలకోసం పరితపించిపోయాడు. కానీ... అనుకున్నదొకటి జరిగిందొకటి. ప్రదీప్ వచ్చాక వెళ్లి కలవాలా వొద్దా అన్న ఆలోచన ఎక్కువయింది.

ఎవరిమీదో కోపంతో తనకొచ్చిన సువర్ణావకాశాన్ని ఎందుకు జారవిడుచుకోవాలి? ఇప్పుడు తనను నిర్లక్ష్యంగా చూస్తున్న అందరికీ ఏదో ఒకనాడు తన సత్తా చూపి తనేమిటో తెలిసేలా చెయ్యాలి అనుకుంటూ ప్రదీప్‌ని కలవడానికే నిశ్చయించుకున్నాడు రాము.

* * *

ప్రదీప్ ఫారిన్ నుంచి వచ్చాడని తెలిసిన వెంటనే ఇంటికెళ్లేడు రాము.

"ఎవరు మీరు? ఏం కావాలి? " కాలింగ్

బెల్ విని తలుపు తీసిన కల్పన అనుమానంగా చూసి అడిగింది.

"నేను... రాముని. మీరు గుర్తు పట్టినట్టు లేదు" అన్నాడు.

"ఏ రాము?" కల్పన మాటలకు రాము ఆశ్చర్యపోయాడు.

"మీ అన్నయ్య సూర్యం ఫ్రెండ్‌ని..." అన్నాడు నెమ్మదిగా.

"ఓ మీరా...!" అంటూ నిర్లక్ష్యంగా చూసింది కల్పన.

ఆమె చూపు, మాటల్లో ఏదో తేలికదనం రాముకి బాధ కలిగించింది. తనను చూడగానే ఆకాశానికెత్తేస్తారని ఆశించిన రాముకి తీవ్రమైన అవమానం, ఆశాభంగం కలిగాయి. కనీసం లోపలికి రమ్మని కూడా అననందుకు నొచ్చుకున్నాడు. వెంటనే వెనక్కి తిరిగి వచ్చేయాలనిపించింది.

ఇలాంటి చిన్న విషయాలకు వెరవకూడదు. ఎలాగైనా తను అనుకున్నది సాధించాలి. రాము మనసులో గట్టిగా అనుకున్నాడు.

"ప్రదీప్ గారున్నారాండీ?!"

"లేరు. ఆఫీసునుంచింకా రాలేదు!" చెప్పింది కల్పన విసుగ్గా ముఖం పెట్టి.

"ప్రదీప్‌గారి కోసమే ప్రత్యేకంగా మా ఊరు నుంచి వచ్చానండి" రాము మాటలకి 'అయితే ఏంటి' అన్నట్టు చూసి సగంలోనే లోపలికి పోయింది కల్పన. ఒకప్పుడు అదే ఇంటిలో అతిథిమర్యాదలు పొందాడు-

తనొక గొప్ప వ్యక్తిగా ప్రత్యేకంగా గుర్తింపబడ్డాడు.

ఆ ఇంట్లో అందరితో కలిసి భోజనంచేసి తెల్లవారేదాకా గాత్ర కచేరి చేశాడు. అలాంటిదిప్పుడు...!?

తనమీద తనకే జాలి కలిగింది రాముకి.

ఇంతలోనే అంత మార్పుకి కారణం ఏమిటో అంతుబట్టలేదు. అప్పుడు తనలో ఉన్నది ఇప్పుడు లేనిది ఏమిటో అర్థం కాలేదు. అసలు ఆనాటి ఆ మర్యాదలు నిజమైనవేనా అన్న అనుమానం కలిగింది. "అయ్యగారొచ్చేస్తారు కూర్చోమని చెప్పమన్నారమ్మగారు" పని పిల్ల వచ్చి చెప్పింది. ప్రదీప్ కోసం బయట వరండాలోనే కూర్చొని చాలా సేపు ఎదురుచూశాడు రాము.

ఒకపక్క ఎదురు చూపులు, మరోపక్క నీరసం... బాగా అలసటగా అన్పిస్తోంది.

కనీసం ఓ కప్పు టీ అయినా వస్తుందేమోనని ఆశపడ్డాడు.

ఆఖరికి అడిగితేగాని మంచి నీళ్లయినా ఇవ్వలేదు.

ప్రదీప్ వచ్చేసరికి చాలా లేటయింది.

ప్రదీప్ కూడా దాదాపు అదే రీతిలో మాట్లాడాడు మొదట.

"ఓ...! మీరేనా! ఆమధ్య రోజుకో ఉత్తరం రాసేవారు. మీ గురించి సూర్యం అంతా చెప్పాడు. పరీక్ష ఫెయిలయ్యారట కదా! ముందు ఆ సంగతి చూస్కోండి. ఏదైనా ఉద్యోగంలో సెటిల్ అయ్యాక మిగతా విషయాలు..."

సూర్యం అన్న మాటలే ఈయన కూడా... ఈసారి ఆశ్చర్యం కంటే దిగులు కలిగింది రాముకి.

"సార్! మీ ట్యూన్స్ బాగా ప్రాక్టీస్ చేశాను. మీకు వినిపిద్దామని వచ్చాను"

"ఇంకేం ట్యూనింగ్స్! ఎప్పటి మాట అది. ఆ ప్రాజెక్ట్ ఎప్పుడో ఆగిపోయింది"

ప్రదీప్ మాటలు రాముని హతాశుణ్ణి చేశాయి.

"అంటే...అంటే... సినిమా తియ్యడం లేదాండీ?"

"లేదు. ఆ సంగతి మర్చిపోయి చాలా కాలమయ్యింది"

'అయ్యో!' అన్నట్టు చూస్తూ బొమ్మలా నిలబడిపోయాడు రాము.

మంచి అవకాశమని ఎన్నో కలలు కన్నాడు. అదీ ఎప్పటినుంచి ఫైనలియర్ పరీక్షల ముందు నుంచి. ఇప్పటిదాకా అదే కల కొనసాగుతోంది. ఇప్పుడు... ఇప్పుడు... ఇంత హఠాత్తుగా ఆ కలను తెగనరుక్కుంటే... అదేపనిగా ఎన్నెన్ని రేయింబవళ్ళు ప్రాక్టీస్ చేశాడు.

గుండె వేగంగా కొట్టుకుంటోంది. గొంతు తడారిపోతోంది. ఎలాగో నోరు పెగల్చుకున్నాడు.

"ఈ సంగతి ముందే తెలిస్తే... "సార్! ఈ మాట ఒక్క ఉత్తరం ద్వారా ముందే చెబితే"

"రాయాలనే అనుకునేవాణ్ణి. ఎక్కడ, అసలు సమయం చిక్కలేదు" అన్నాడు ప్రదీప్. అతని మాటల్లోనూ చూపుల్లోనూ అసహనం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఆఫీసులో అలసిపోయి ఇంటికొస్తే ఇదెక్కడి లంపటంరా బాబూ అన్నట్టుంది ప్రదీప్ ధోరణి. ఎంత తొందరగా వొదులుతాడా అన్నట్టు. నిర్లక్ష్యంగా ప్రవర్తించడం రాము ఇట్టే కనిపెట్టేశాడు.

"సార్, పోనీ, మీరేదో ఆర్కెస్ట్రా పెడతానన్నారు"

ప్రదీప్ నవ్వుతూ "అదా... ఆ ప్రయత్నం కూడా అటకెక్కేసింది. ఆఫీసులో పని ఒత్తిడి బాగా పెరిగి ఆ ఆలోచనే మానుకున్నాను" అన్నాడు.

అయిపోయింది. అంతా అయిపోయింది. తను ఇన్నాళ్ళ ఆశలన్నీ అడియాసలైపోయాయి. ఒక్క మనిషినే నమ్ముకోవడం, అతడితోనే ముగిసిపోవడం... ఏమిటిదంతా. ఎందుకిలా జరుగుతోంది... అనుకుంటూ నీరసంగా లేచి, "వస్తాను సార్!" అంటూ ఓ నమస్కారం కొట్టి వచ్చేశాడు రాము. ఇక అక్కడ ఒక్క క్షణం కూడా ఉండలేక.

"బతికించావు" అన్నట్టుగా ముఖంమీదే తలుపు వేసేశాడు ప్రదీప్. సూర్యంమీద కోపం తనమీద చూపించేడు. అంటే... ఆనాటి అభిమానం తనమీద కాదు. అప్పుడు రాత్రి పది గంటలు. ఆఖరి బస్సెప్పుడో పోయింది.

రోడ్డుమీద ఒంటరిగా దీనంగా నడుస్తున్నాడు రాము. అలా ఎందుకు నడుస్తున్నాడో అతనికే తెలియడం లేదు.

ఎక్కడికి వెళ్లాలి? ఆ రాత్రికి ఎక్కడ గడపాలి? రామునికి దిక్కు తోచడం లేదు.

ఈ ఒక్క రాత్రికి ఉండనిచ్చినా బాగుండేది. కనీసం ఆ ప్రస్తావనే లేదు. పచ్చి మంచినీళ్ళివ్వని వారు ఒక రాత్రి ఇంట్లో ఉండమంటారా? అంతా తన భ్రమ కాకపోతే!

అలాంటి మనుషుల్ని నమ్మినందుకు... వాళ్ళ మాటలతో కలల కోటలు నిర్మించుకున్నందుకు తనమీద తనకే అసహ్యం వేసింది రాముకి. ఎన్ని ఆశలు చూపించారు? ! ఎంతగా పొగిడేశారు? !

అదంతా నిజమైన అభిమానమని... తనమీదున్న ప్రేమని అనుకున్నాడు. ఆఖరికి మిగిలిందేమిటి? భంగపాటు. నిరాశ.

గట్టిగా నిట్టూర్చాడు రాము. తీరని నిరాశతో హాస్టల్‌కి చేరాడు ఆటోలో.

## 19



"ఇప్పుడేం చేయాలి? "

ఆ రాత్రి నిద్ర పట్టక పదేపదే తనలో తానే అనుకున్నాడు రాము. దేనికోసమైతే మళ్లీ ఇక్కడికొచ్చాడో అది ఒట్టి భ్రమేనని తేలిపోయింది. ఆశలన్నీ నిరాశలయ్యాయి. కలలన్నీ కరిగిపోయి కల్లలయ్యాయి.

మూర్తీభవించిన నైరాశ్యానికి ప్రతిరూపంలా ఉన్నాడు రాము. రాముకి అర్థం కానిదొక్కటే! సూర్యం, ప్రదీప్, కల్పనల ప్రవర్తన! తన పట్ల చూపిన నిరాదరణ. తను చేసిన తప్పేమిటి? ! ఎందుకలా నిర్లక్ష్యాన్ని కనబరిచారు? ! లేక తనే వాళ్లనర్థం చేసుకోవడంలో పొరబడ్డాడా? ! అతిగా ఊహించుకుని రావడంవల్ల కలిగిన పర్యవసానమా అది!

ఏదేమైనా తీవ్రమైన అవమానంతో పాటు అనుకోని ఆశాభంగం. కింకర్తవ్యం? !

"లే! లే!! రామూ!..." మర్నాడుదయాన్నే మోహన్ అదిలించేసరికి ఉలిక్కిపడి లేచాడు రాము. బ్రష్ చేసుకుని టిఫిన్ చేసి మళ్లీ ఆలోచనల్లో పడ్డాడు రాము.

అనవసరంగా లేనిపోని ఆశలు పెట్టేసుకున్నాడు. ఆఖరికి కథ అడ్డం తిరిగి అంతులేని నైరాశ్యం మిగిల్చింది.

'ఇప్పుడెక్కడికెళ్ళాలి? ఏం చేయాలి?' మళ్ళీ మళ్ళీ ప్రశ్నించుకున్నాడు. 'సూర్యాన్ని కలిస్తే' అనే ఆలోచన కలిగింది రాముకి. 'అతడూ అంతగా మారిపోయాక కలిసి సాధించేదేమిటి?' అంతరాత్మ జవాబుగా పలికింది వెంటనే.

ఏం చేయాలో తెలియక, అర్థం కాక అయోమయంగా రోజులు గడుపుతున్నాడు - మోహన్ దాక్షిణ్యంతో. అస్తమానం అదే పనిగా ఆలాపనలతో గడిపే రాము ఈమధ్య గొంతు విప్పడం లేదు. ఎక్కువగా మాట్లాడటం లేదు కూడా. ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా కాలం గడిపేస్తున్నాడు.

బుద్ధిగా చదువుకుంటున్న హాస్టల్ విద్యార్థుల్ని చూస్తుంటే ఇప్పుడు బాధ కలుగుతోంది. తను చేసిన తప్పేమిటో తల్చుకుని కుమిలిపోతున్నాడు రాము. అంతా అయిపోయాక ఇప్పుడు బాధపడి లాభం ఏమిటి? !

కొందరు అచ్చం తనలాగే ఆటపాటలతో కాలక్షేపం చేసేస్తూ చదువుల్ని నిర్లక్ష్యం చేస్తుంటే తప్పని చెప్పాలనిపించింది రాముకి. కానీ చెప్పలేకపోయాడు.

విచిత్రం ఏమిటంటే ఒకప్పుడు తను ఎలాంటి పొగడ్తలకు పొంగిపోయి పరవశించేవాడో వీళ్ళూ అలాగే అయిపోతున్నారు. వాళ్లని ప్రోత్సహించేవాళ్ళు కూడా అచ్చం ఆనాటి తన సహ విద్యార్థుల్లాగే ప్రవర్తిస్తున్నారు... ఆహా... ఓహో అంటూ! చరిత్ర పునరావృతం కావడం అంటే ఏమిటో రాముకి అనుభవపూర్వకంగా తెలిసింది.

అసలు తప్పెవరిది? ఊరికే మునగ చెట్టెక్కించి పొగిడేవాళ్లదా? లేనిపోని ఆశలు పెట్టుకుని అదే నిజమని భ్రమల్లో బతికేవాళ్లదా! ఏదో ఒకప్పుడు వీళ్లూ కళ్ళు తెరుస్తారు! అప్పటికి జీవితం చేజారిపోతుంది.

నిర్వేదంతో నిరాశగా రోజులు గడిపేస్తున్న రాముకి పులిమీద పుట్రలా మరో సమస్య వచ్చి పడింది. హాస్టల్లో విద్యార్థులు తప్ప ఇతరులెవరూ ఉండకూడదని హాస్టల్ స్టూడెంట్స్ యూనియన్ కార్యదర్శి మెస్ సూపర్‌వైజర్ మోహన్ని రాముా ముందే వారించేడు.

"ఇదేం ధర్మసత్రం అనుకున్నావా? అతిథులంటే ఒకటి రెండు రోజులు. అంతేగాని ఇలా నెలల తరబడి వాళ్ల మెస్‌లో మెక్కడానికి హాస్టల్ నీ సొంతమనుకున్నావా! పై అధికారుల దృష్టిలో పడితే నీ ఉద్యోగం ఊడుతుంది... జాగ్రత్త!"

దాంతో మోహన్ భోజనం బయట చేయమని రాముకి చెప్పాడు. దాంతో రాము అర్ధాకలితోనే గడుపుతున్నాడు. శేఖర్ ఇచ్చిన డబ్బులు కూడా అయిపోనుండడంతో ఒక పూట తినీతినక రోజులు నెట్టుకొస్తున్నాడు.

మళ్ళీ అంతలో మరో సమస్య.

ఇప్పుడు హాస్టల్లో ఆశ్రయం పొందడానికి కూడా అవకాశం లేకుండా పోతోంది.

"సారీ! రాము... నాకు మాత్రం చాలా బాధగానే ఉంది. కానీ తప్పదు. తన మాట ధిక్కరించినందుకు మా వార్డెన్ మెమో కూడా ఇచ్చాడు నాకు" అంటూ మోహన్ ఏదో కాగితం తీసి చూపించేడు రాముకి.

రాము తప్పనిసరి పరిస్థితుల్లో హాస్టల్ వొదిలి వెళ్ళాల్సివచ్చింది. అతడికి అసలు విషయం తెలియదు. మోహన్ నాటకమాడి ఆ మెమో సృష్టించాడని... ఆ మెమో వార్డెన్ ఇచ్చింది కాదని... మోహన్ కావాలనే అలా చేశాడని ఆ తర్వాత ఎవరో చెబితే తెలిసింది రాముకి.

మోహన్‌కి రాము మీదున్న అభిమానానికి మూలకారణం రాము పాట. ఆ పాట కరువైనప్పుడు రాముని దూరంగా ఉంచడం మంచిదని నిర్ణయానికొచ్చాడు. పైగా తను కోరి మరీ అడుగుతున్నా పాడకపోవడం మోహన్ భరించలేకపోయాడు.

తీవ్రమైన ఆశాభంగంతో రాము గొంతు మూగబోయింది. పాడడానికి తగిన ప్రేరణ ఉత్సాహం కలగడం లేదు. అందుకే మోహన్ పాడమన్నా పాడడానికి రాముకి మనస్కరిం

చేది కాదు. అంతేకాదు. తనకు సినిమాల్లో పాడే అవకాశం పోయిందని తెలిసినప్పటి నుంచి హాస్టల్లో అవహేళనలు మొదలయ్యాయి. స్టూడెంట్స్ తనను చూసి గేలి చెయ్యడం... నవ్వి అవమానించడం... రాము హృదయాన్ని మరింత గాయపరిచేవి. ఆ కారణం చేత రాము నోటినుంచి పాటే కరవైపోయింది.

ఆఖరికి రాము పరిస్థితి రోడ్డు మీద పడే స్థాయికి దిగజారింది. కొన్నాళ్లు బస్‌స్టేషన్లు... మరి కొన్నాళ్ళు దేవాలయాలు... ఇవే ప్రస్తుతం రాము నివాసాలు. కడుపు నిండా భోజనమే కరవై పోయిందిప్పుడు.

ఎప్పుడు తినగలుగుతున్నాడో, ఎప్పుడు తిన లేకపోతున్నాడో అతనికే తెలియడం లేదు.

సొంత ఊరుకి పోదామనిపించింది. అక్కడికి మాత్రం తను వెళ్ళి చేసేదేమిటి? తీరని అవమానాలు తప్ప... అప్పటికే శేఖర్ నుంచి రెండుసార్లు ఎమ్.ఒ. అందుకున్నాడు. మళ్లీ అడగడానికి మనస్కరించలేదు రాముకి.

చావైనా రేవైనా ఇక్కడే అనే నిర్ణయానికొచ్చాడు. తక్షణం తనక్కావలసినవి రెండే రెండు. ఒకటి కడుపు నిండా తిండి! రెండు తలదాచుకోవడానికి నీడ! ఈ రెండూ దొరకేది హోటళ్ళలోనే అనే విషయం అర్థమయింది రాముకి.

ఎలాగో తంటాలు పడి ఓ పెద్ద హోటల్లో బోయ్‌గా ఉద్యోగం సంపాదించుకున్నాడు.

అంతకు ముందు పూర్తికాని డిప్లొమా ద్వారా ఏదైనా పని దొరుకుతుందేమోనని ప్రయత్నం చేశాడు. ఒకటి రెండు చోట్ల.

డిస్టింక్షన్లో పాసయినవాళ్లకే దిక్కులేక పోతున్నప్పుడు అసంపూర్ణమైన తన డిప్లొమాకి ఉద్యోగం ఎవరిస్తారు? ! అది అసాధ్యమైన పని అని అర్థమయింది రాముకి.

అది చాలా పెద్ద హోటల్ కావడంతో ఎవరెవరో ప్రముఖులు వస్తున్నారు. ఆ ప్రముఖుల్లో సిటీలో, ఆ పరిసర ప్రాంతాల్లో షూటింగుల కోసం వచ్చే సినిమా జనాభా కూడా ఉంటున్నారు. వాళ్ళని చూసేసరికి మళ్లీ రాములో ఆశలు మొదలయ్యాయి.

ఎప్పుడో ఒకప్పుడు... ఎవరో ఒక సినీ సంగీత దర్శకుడు కనిపిస్తాడు. వాళ్ళకి తన పాట వినిపించి అవకాశం సంపాదిస్తాడు.

ప్రస్తుతం రాము ఇలాంటి ఆలోచనలతో, ఆశలతో ఎదురుతెన్నులు కాస్తున్నాడు. కానీ అనుకోని సంఘటన ఎదురై రాము పరిస్థితి మళ్లీ మొదటికొచ్చింది.

* * *

ఓ జంట! నూతన దంపతులు.

కొత్తగా పెళ్ళి చేసుకుని హనీమూన్ కోసం వచ్చి ఆ హోటల్లో దిగారు. ఆ జంట దిగిన గది ఉన్న ఫ్లోర్‌లోనే రామూ బాయ్‌గా ఉంటున్నాడు.

మొదట రాము పెళ్ళి కొడుకుని గుర్తించలేకపోయాడు. ఆ తర్వాత తెలిసింది అతను ఒకప్పటి తన హాస్టల్ రూమ్మేట్ రాధాకృష్ణ అని. నాలుగేళ్లపైనే అయింది అతణ్ణి చూసి.

రాధాకృష్ణ కూడా రామూని గుర్తించాడు. కానీ బయట పడలేదు. ఏమీ తెలియనట్టు ప్రవర్తించేడు.

తనే పేరు పెట్టి పిలిచి పలకరిద్దామనుకున్నాడు రాము. కానీ తన స్థాయి, ఆ పని చేయనివ్వలేదు. పైపెచ్చు అతడా స్థితి, తనీ స్థితిలో ఉండడంతో కూడా సిగ్గుతో సగం చచ్చిపోయాడు. మొహం చాటేయడానికి కూడా అవకాశం లేని పరిస్థితి.

కేవలం తనొక సేవకుడు. వాళ్ళు హోటల్లో ఉన్నన్నాళ్ళూ చెప్పినట్టు చేయడం తన పని. అందుకే రాము కిక్కురుమనకుండా కేవలం తానొక రూమ్‌బాయ్ అన్నట్టు ప్రవర్తించాడు.

ఒకప్పుడు ఆ రాధాకృష్ణ కోసమే తను పరితపించిపోయాడు. అతడూ సూర్యం మాదిరిగానే తనచేత పాటలు పాడించుకుని... తన వెంట తిప్పుకుని చెప్పినట్టల్లా ఆడించుకున్నాడు. ఆనాడు హాస్టల్ ఖాళీ చేసి రాధాకృష్ణ తన ఊరుకి వెళ్లిపోతున్నప్పుడు రామూ పడ్డ వేదన ఇప్పటికీ గుర్తుంది.

తరచూ ఉత్తరాలు రాస్తామని... వైజాగ్ వచ్చినప్పుడు కలుస్తామని రాధాకృష్ణ,

నాయుడు తనకు మాటిచ్చిన సంగతి కూడా తెలుసు. కానీ ఆ తర్వాత వాళ్ళిద్దరూ అసలు ముఖాలే చూపించలేదు. కాలేజీకి సర్టిఫికెట్స్ కోసం వచ్చినప్పుడు కూడా కనీసం తనను కలవలేదు.

ఎంతన్యాయం జరిగిపోయింది? పాట గురించి తపించినా, అందులోనే రాణించడానికి ప్రయత్నించినా, చదువును నిర్లక్ష్యం చేయకుండా ఉండాల్సింది. ఇప్పుడలా అనుకుని ఏం లాభం?

తను మాత్రం వాళ్ల కోసం ఎంతగా కలవరపడిపోయాడని. వాళ్లు వెళ్లిపోయేక వాళ్లను మర్చిపోలేక ఎన్నో ఉత్తరాలు రాశాడు. అయినా ఒక్క ఉత్తరానికి కూడా జవాబు లేదు.

ఏమిటో ఈ మనుషుల తీరు. అందరూ తననొక వినోద సాధనంగా వాడుకున్నారు.

తనచేత పాడించుకుని ఆనందించారే గాని తనను నిజమైన మిత్రుడిగా చూడలేదు. అందులో సూర్యం కూడా మినహాయింపు కాకుండాపోయాడు.

ప్చ్ వీళ్ళ కోసమా తన చదువుని కూడా అశ్రద్ధ చేసి పరితపించింది. అసలు తప్పంతా తనది. తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్లని నమ్మి మోసపోయాడు. వీళ్ళకు కావలసింది తనపాటే గాని పాట్లు కాదు.

ఎంతన్యాయం జరిగిపోయింది? పాట గురించి తపించినా, అందులోనే రాణించడానికి ప్రయత్నించినా, చదువును నిర్లక్ష్యం చేయకుండా ఉండాల్సింది. ఇప్పుడలా అనుకుని ఏం లాభం? తన భవిష్యత్తంతా నాశనమయ్యింది. పశ్చాత్తాపంతో రాము పరిపరివిధాలా వాపోతున్నాడు.

రాధాకృష్ణను తను గుర్తు పట్టాడని రాధాకృష్ణకు తెలుసు. అలాగా రామూని రాధాకృష్ణ కూడా గుర్తించాడని రామూకి తెలుసు.

“ఒరేయ్ రాధా!” అని తనివితీరా పిలవాలనిపించేది రాముకి. కానీ రాధాకృష్ణ రాముకి ఆ అవకాశం ఇచ్చేవాడు కాదు.

అలా వారం రోజులకు పైగా సాగింది. ఆ తర్వాత రాము భరించలేకపోయాడు. పైగా అనుక్షణం గతం గుర్తుకొచ్చి వేధిస్తోంది.

అంతే! మేనేజర్‌కి కూడా చెప్పకుండా ఉడాయించేశాడు. అంతకుముందు తన డ్యూటీ వేరే ఫ్లోర్‌కి మార్చమని వేడుకున్నా ఫలితం దక్కక ఆ పని చేశాడు.

అల్ప విషయాన్ని అతిగా ఊహించుకుని తొందర పడ్డానా అనుకున్నాడు రాము బాధగా. ఉన్న కాస్త ఆధారం పోయింది. మిగతా విషయాలెలా ఉన్నా కూడు గూడులకు లోటుండేది కాదు. పైగా అవి మామూలు సదుపాయాలు కాదు. ఖరీదయిన తిండి... వగైరా... అన్నీ ఆవేశంతో పోగొట్టుకున్నాడు. ప్చ్..! ఏమిటో...? ఏం చేసినా అన్నీ ఆఖరికి చేదు అనుభవాల్నే మిగులుస్తున్నాయి అనుకున్నాడు. ఇవన్నీ స్వయం కృతాపరాధాలేనా అని పదే పదే ప్రశ్నించుకున్నాడు తనని తాను.

అసలు రాధాకృష్ణ తప్పేం ఉంది. కొత్త పెళ్ళాంతో పెద్ద హోదాలో స్టార్ హోటల్‌కొచ్చాడు. ఆఫ్టరాల్ తనొక రూమ్‌బాయ్. ఒకప్పుడు తను రాధాకృష్ణకు ఇష్టుడు కావచ్చు ఆ ఇష్టం ఇప్పటికీ అలాగే ఉండాలని, ఉంటుందని ఆశించడం తనదే తప్పు.

కొంచెం ఓపిక పడితే... తన పనేదో తాను తల దించుకుని చేసుకుపోతే బాగుండేది. ఇప్పుడీ పాట్లు తప్పేవి. అయినా వాళ్లు హోటల్లో శాశ్వతంగా ఉండరు. ఆత్మాభిమానంతో ఎంత తప్పుడు నిర్ణయం తీసుకున్నానని వాపోయాడు.

అసలు తనకు అలాంటి పెద్ద హోటల్లో ఉద్యోగం రావడమే గొప్ప అదృష్టం. అక్కడంతా డిగ్రీ చేసినవాళ్లే. టెక్నికల్ స్టూడెంట్‌నని అవసరానికుపయోగపడతాడని ఉండమన్నారు.

“మోటార్ మెకానిజమ్” వచ్చని-

"ఎలెక్ట్రికల్ వైరింగ్‌లో కూడా ప్రవేశం ఉందని తెలుసుకుని ఏదైనా- "రిపేరొచ్చిన పుడు చెయ్యాల్సి ఉంటుందని దానికి ప్రత్యేకంగా జీతం ఇవ్వమని ముందే చెప్పారు. రూమ్‌బాయ్‌గా ఉంటూనే అవసరమైనప్పుడు ఉపయోగపడాలి. అందుకిష్టమైతేనే ఉద్యోగం అని ముందే చెప్పి ఇచ్చారు.

తనక్కావలసింది మూడు పూటలా తిండి... ఉండడానికి గది. అంతే. పెద్ద జీతం కాదు. తన ప్లాన్ వేరే ఉంది. ఈ పెద్ద హోటల్లో దిగే సినీప్రముఖుల దృష్టిలో పడడం తనక్కావలసింది... తను ఆశిస్తున్నదీ అదే. అందుకే రెండో ఆలోచన కూడా చేయలేదు. వెంటనే చేరిపోయాడు.

అప్పుడప్పుడు పాటలతో తోటి సిబ్బందిని మెప్పించేవాడు. హోటల్ మేనేజర్ దృష్టిలో కూడా పడ్డాడు. అలా అందరికీ తలలో నాలుకలా... సంతోషంగా సాగిపోతుంటే జీవితం కాస్త పర్వాలేదులే అనుకున్నాడు. ఇంతలో రాధాకృష్ణ అక్కడ దిగడం... ఎందుకిలా జరుగుతోంది? తన విషయంలోనేనా? అందరికీ ఇలాగే ఉంటుందా? మంచీ చెడు గ్రహించలేక ఎందుకిలా అయిపోతున్నాననుకుంటూ కుములుతున్నాడు రాము.

అప్పుడే వారం రోజులైపోయింది - హోటల్ ఉద్యోగం వదులుకుని ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు... ఏదో తిని కడుపు నింపుకున్నాడు గాని ఆకలి తీరడం లేదు. గెడ్డం బాగా పెరిగి ముఖం పీక్కుపోయింది. బట్టలు బాగా మాసిపోయి చిరగడానికి సిద్ధంగా ఉన్నట్టు కనిపిస్తున్నాయి.

రోడ్లపై తన ఈడు కుర్రాళ్ళు ఎంచక్కా బైక్‌లపై చక్కర్లు కొడుతుంటే రాము మనసు ఉసూరుమంటోంది. వాళ్ళు చేసుకున్న అదృష్టానికి... తను పడుతున్న కష్టాలకి కారణాలు వెతుకుతూ... బేరీజు వేసుకుంటూ... దైన్య వదనంతో అడుగులు వేస్తున్నాడు.

తన గమ్యం ఏమిటో...! తను వేసే అడుగులు ఎటో...? అతనికే తెలియడం లేదు.

వెర్రిచూపులు చూస్తూ... నిరాశా నిస్పృహలతో... తీరని వేదనలతో... బాధాతప్తుడై... భార హృదయుడై... తుళ్ళిపడే వయసులో... కుళ్ళి కుళ్ళి ఏడ్చుకుంటూ...

తనలో తానే కుమిలిపోతూ... ఒంటరిగా విశాలమైన ఆ రోడ్డుపై నడుస్తుంటే... ఆ మూల ఏదో గోల... జనం మూగి... అరుస్తూ... ఏదో గొడవలా కనిపిస్తే అప్రయత్నంగా అటు నడిచాడు.

ఓ వ్యక్తిని... ఒక పదిమంది కలిసి చితక బాది నోటికొచ్చినట్లు తిట్టి పోస్తున్నారు. అతను మాత్రం 'అమ్మా' అని కూడా బాధతో అరవడంలేదు. అసలు నోరు విప్పడం లేదు. ప్రతిఘటించే ప్రయత్నం కూడా చేయడం లేదు. వాళ్ళు గొడ్డును బాదినట్టు కొట్టినా తట్టుకుని తన్నులు తింటున్నాడు. అతనికి పాతికేళ్ళు మించి ఉండవు.

"రాస్కెల్! ఛంపేస్తాం... అంత కొవ్వుతో ఉన్నావా?"

"ఏం చేశాడేంటి? !"

"నడి రోడ్డుమీద ఓ ఆడపిల్ల చెయ్యి పట్టుకుని దగ్గరకు లాక్కుంటాడా?

"అంత పని చేశాడా? ! చేసే ఉంటాడు... అందుకే ఎంత కొట్టినా నోరెత్తకుండా..."

"అలాంటివాణ్ణి కొట్టడం కాదు... చంపాలి... నరికి పోగులు పెట్టాలి..." నలుగురూ నాలుగు రకాలుగా అంటున్నారు.

"అవును! ఇంకా అమ్మాయిలు బయట తిరగడానికి జంకుతున్నారంటే ఇలాంటి జులాయి వెధవల వల్లనే. వీళ్లని పోలీసులకి అప్పజెప్పి కాళ్ల చిప్పలు చితక్కొట్టించాలి... ఇలాంటి కామాంధుల్ని కళ్లు పీకి కబోదుల్ని చెయ్యాలి. అప్పుడుగాని బుద్ధి రాదు..." అంటూ మళ్లీ ఓ వ్యక్తి చేయి అతన్ని కొట్టడానికి ఎత్తబోతే హఠాత్తుగా మరో చేయి గుంపులో నుంచి దూసుకొచ్చి అడ్డుకుంది.

అంతలోనే ఆ చెయ్యి, మరో చెయ్యితో జోడింపై అక్కడున్న జనానికందరికీ నమస్కారం పెట్టింది.

"అయ్యా! నా బిడ్డనేం చెయ్యకండయ్యా... వాడికి మతి చెడింది. తెలియక చేశాడు...

నా కొడుకు తప్పుకి నేను క్షమాపణ కోరుకుంటున్నాను. ఈ స్థిమితం లేనోణ్ణి దయతలచి క్షమించి వొదిలెయ్యండయ్యా. నా కొడుకుని ఇంకా చావకొట్టకండయ్యా మీకు పుణ్యం ఉంటుంది. మీ కాళ్లు పట్టుకుంటాను..." అని చేతులు జోడించి నమస్కరించిన ఆ వ్యక్తి జనాన్ని ప్రాధేయపడ్డాడు.

"అయ్యో! పిచ్చివాడా...? పాపం...!" "సర్సరె. వదిలేయండి" జనం పశ్చాత్తాపంతో నొచ్చుకుంటూ ఎటువాళ్లటు కదిలి వెళ్లిపోతున్నారు.



ధారగా కారిపోతున్న కన్నీళ్లని మాసిపోయిన కండువా చెంగుతో తుడుచుకుంటూ పోతుంటే అతణ్ణి గుర్తు పట్టి "చంద్రన్నా" అని పిలిచాడు రాము. చంద్రన్న చటుక్కున ఆగి వెనక్కి తిరిగి చూశాడు.

* * *

జన సంచారం అంతగా లేని ఒకచోట చెట్టు నీడలో ఉన్నారు ముగ్గురూ.

చంద్రన్న, రామూ కలిసి దాదాపు బలవంతంగా జగ్గుని జబ్బలు పట్టుకుని లాక్కుని అక్కడికి తీసుకొని రావలసి వచ్చింది. జనం చేత అన్ని తన్నులూ దెబ్బలూ తిన్నప్పటికీ జగ్గులో ఏ మాత్రమూ చలనం లేదు. అసలు జగ్గు ఈ లోకంలోనే లేనట్టు... ఎటో చూస్తూ... హఠాత్తుగా అరుస్తూ... జుట్టు చెరుపుకుంటూ... తన గుండెలమీద కొట్టుకుంటూ.... పిచ్చిచూపులు చూస్తూ అలా కూర్చుండిపోయాడు.

"ఒరేయ్ జగ్గూ... జగ్గూ... నిన్నేరా!" రాము పలకరించాడు. మనిషిని పట్టుకుని కుదిపాడు. జగ్గు అదోలా వెర్రిచూపులు చూస్తూండిపోయాడు. బదులు పలకలేదు. అతడి తల రాము తన వైపుకి తిప్పుకున్నా ఆ వెర్రిచూపులే తప్ప అతణ్ణి గుర్తు పట్టలేదు.

"ఎలాంటివాడు ఎలా అయిపోయేడు" జాలిగా అనుకున్నాడు రాము.

"ఇలా ఎప్పట్నుంచీ" చంద్రన్నను అడిగాడు.

"నీకు తెలియందేముంది బాబూ! ఆ పిల్ల పెళ్ళయినప్పట్నుంచీ... ఇంత కాలమయినా ఇంకా ఆ పిల్లనే తల్చుకుంటూ రాధా... రాధా... అని పలవరిస్తూ... ఇలా... ఒక్కగా నొక్క కొడుకు... చదువుకుని మమ్మల్ని ఉద్ధరిస్తాడనుకుంటే... ఆఖరికి ఆ దేవుడు వీడి రాత ఇలా రాశాడు. కొడుకు బతుకిలా తయారైతే ఏ తల్లి తట్టుకోగలదు? వీడిలా పిచ్చివాడైపోవడం చూసి తట్టుకోలేక వాడి తల్లి గుండె పగిలి చచ్చిపోయింది" అంటూ చంద్రన్న భోరున విలపించాడు.

"జగ్గు అమ్మగారు పోయారా?!" అంటూ రాము దిగులుగా జగ్గుకేసి చూసేడు.

అతణ్ణి చూస్తున్నకొద్దీ రాము కళ్లల్లో నీళ్లు చిప్పిల్లుతున్నాయి.

జగ్గుకి వాళ్ళ మాటలేం పట్టడం లేదు. ఎటో చూస్తూ తనలో తానే ఏదో గొణుక్కుంటున్నాడు. కూర్చున్నవాడు లేస్తూ కాని నిలబడినవాడు ఒక్కసారిగా మట్టి నేలపై కూలబడిపోతున్నాడు. మరుక్షణాన్నే హఠాత్తుగా లేచి

ఆకాశంలోకి పరికించి చూస్తున్నాడు.

"డాక్టర్‌కి చూపించలేదా? "

"ఎంతోమందికి చూపించాను. ఎవరూ ఏమీ చేయలేకపోతున్నారు. తట్టుకోలేని షాకు వల్ల మెదడు దెబ్బతిందట. మళ్ళీ మామూలు మనిషవడం కష్టమేనని అనిపిస్తోంది. డాక్టర్లు మాత్రం ఏదో ఆశ ఉన్నట్టు చెబుతున్నారు. కొన్నాళ్ళు చూద్దామంటున్నారు. వేలకువేలు ఖర్చవుతున్నాయి గాని ఫలితం కనిపించడం లేదు. ఏ జన్మలోనో చేసుకున్న పాపం... మమ్మల్నిలా పీడించుకు తింటోంది. లేకపోతే నాకు ఈ వయసులో ఈ పాట్లేమిటి? !' వీణ్ణి అనుక్షణం కనిపెట్టుకునుండాలి. వొదిలితే ఎటో పారిపోతాడు. లేకలేక పుట్టాడనుకుంటే ఆ దేవుడు వీణ్ణిలా చేసేశాడు" చంద్రన్న కళ్లొత్తుకుంటూ అన్నాడు.

'మధ్యలో దేవుడేం చేస్తాడు... అన్నీ మనిషే చేస్తాడు...' అనుకున్నాడు రాము మనసులో.

జగ్గుని చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది. అసలు జగ్గుకి తనకీ తేడా లేదనిపిస్తోంది. ఇద్దరూ ఏవో భ్రమల్లో పడి... ఊహాలోకాలు సృష్టించుకున్నవారే! ఇద్దరి జీవితాలూ గతి తప్పినవే.

"బాబూ! చిన్న సాయం చేస్తావా? !" చంద్రన్న అర్థిస్తున్నట్టుగా రాము ముఖంలోకి చూశాడు.

"చెప్పండి!"

"విదేశాలనుంచి ఎవరో పెద్ద డాక్టరొచ్చారట. ఆ డాక్టర్‌కి చూపించాలనే ఊరునుంచి తీసుకొచ్చాను. ప్రయాణం మధ్యలో తప్పించుకోవడం ఇది రెండోసారి. ఒక్కణ్ణీ కనిపెట్టుకోవడం కష్టంగా ఉంటోంది. ఇక్కడ మా దూరపు బంధువులున్నారు. ఫోన్ చేశాను. వాళ్ళీపాటికి బహుశా ఆసుపత్రి దగ్గరకు వచ్చే వుంటారు. ఆసుపత్రి దాకా నువ్వు కాస్త చేదోడు వాదోడుగా ఉంటే..."

"అయ్యో! దానికి అడగాలా, తప్పకుండా ... పదండి!" అన్నాడు రాము.

ఇద్దరూ జగ్గుని చెరొక చెయ్యి పట్టుకున్నారు.

ఆసుపత్రికి చేరేసరికి వాళ్ళ బంధువు అక్కడ ఎదురుచూస్తూ ఉన్నాడు. ఆయనకు అరవై దగ్గరుంటుంది వయసు. తెల్లని పంచె లాల్చీ వేసుకుని హుందాగా ఉన్నాడు. నొసట విబూది బొట్టు. కిళ్లీతో ఎర్రబారిన నోరు. ఆయన టౌన్లో ఓ చిన్న కాకా హోటల్ యజమానట.

"అయ్యో! ఆదెయ్యా... నువ్వే వచ్చావా? !" అన్నాడు చంద్రన్న తమ బంధువుని చూసి

"ఫర్వాలేదు! నేను లేకపోయినా... హోటల్ సాఫీగా సాగిపోతుంది. పనివాళ్ళంతా నమ్మకస్తులే. అద్సరే. ఫస్ట్ బస్సుకొస్తారన్నారని బస్టాండుకెళ్ళాను. రెండో బస్సులో కూడా మీ జాడలేదు. ఇక్కడకొచ్చేశాను ఉంటారని. నేనూ ఇప్పుడే వచ్చానిక్కడికి" అన్నాడు ఆదెయ్య చంద్రన్నతో.

"ఏం చెయ్యను. వీణ్ణి కాసుకునేసరికి తల ప్రాణం తోకకొస్తోంది. ఏ మాత్రం ఏమరుపాటుగా ఉన్నా ఎటు పారిపోతాడోనన్న భయమొకటి. అప్పుడే రెండుసార్లు తప్పిపోయేడు. ఇదిగో... ఈ అబ్బాయి సాయంతో ఎలాగో ఆసుపత్రికి తీసుకొచ్చా" చెప్పాడు చంద్రన్న.

"ఇతనెవరు? !" ఆదెయ్య రాముని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూస్తూ అడిగాడు.

"జగ్గు ఫ్రెండ్. ఇద్దరూ హాస్టల్లో కలిసి చదువుకున్నారు"

'చదువుకున్నారు' అనేమాట వినగానే రాముకి ఏదోలా అనిపించింది. అది సిగ్గో... బాధో... తెలియలేదు. నిజంగా చదువే ధ్యాసగా ఉంటే మాకీ పాట్లు ఎందుకొస్తాయి? చదువుకోవాల్సిన వయసులో దారి తప్పి ప్రవర్తించాం. ఇప్పుడు ఆ ఫలితాన్ని అనుభవిస్తున్నాం. మా తోటి వాళ్ళంతా జీవితాల్లో స్థిరపడి మంచి హోదాల్లో ఉన్నారు. మేం మాత్రం ఇలా తయారయ్యాం. మాది నిజంగా స్వయంకృతం. రాము అంతరంగం ఆవేదనతో ఆక్రోశించింది.

"చదువుకోమని మిమ్మల్ని పైసాపైసా కూడబెట్టి పై ఊర్లో ఉంచితే మీరు చేసే ఘనకార్యాలివా! మీ వయసులో మేమూ చేశాం... అసలీ వయసులో ఎవర్కైనా సహజమే. కానీ

జీవితాల్ని నాశనం చేసుకునేంతగా అయిపో కూడదు. అప్పుడు సరదాగానే సాగిపో తుంది... ఆ తర్వాతే తెలిసొస్తుంది" అని రామూ వంకచూసి అని "ఈ కాలం కుర్రాళ్ళు మరీ అన్యాయమయ్యా! ప్రేమా గీమా అంటూ బతుకుల్ని బజారుపాలు చేసుకుంటు న్నారు. అదో గొప్ప అని మాయలో పడి కొట్టుకుపోతూ కన్నవాళ్ళకు మాత్రం కన్నీళ్ళు మిగుల్చుతున్నారు. చదువుకుని పైకి రావల సిన వాళ్ళు.. ఇవేం.. బుద్ధులో? !" అన్నారు చంద్రన్నతో ఆదెయ్య జగ్గునుద్దేశించి అన్నా ఆ మాటలు తనకీ వర్తిస్తాయనిపించింది రాముకి. ఆదెయ్య మాటలు సూటిగా ఈటెల్లా గుచ్చుకున్నాయి గుండెకు.

ఆసుపత్రిలో పని అయ్యాక అంతా కలిసి ఆదెయ్య ఇంటికెళ్ళారు. ఆ రాత్రి రాము ఆ ఇంట్లో వాళ్ళతో పాటు ఇంత తిని తలదాచు కున్నాడు.

చాలా రోజుల తర్వాత సుష్టుగా భోజనం చేసి కంటినిండా నిద్రపోయేడు.

ఎందుకో... అక్కడున్నంతసేపూ నిర్భీతి నిశ్చింత కలిగింది రాముకి.

అది పేరుకు కాకా హోటలే అయినా దాని కున్న డిమాండ్ ఎలాంటిదో ఒక్కపూటలోనే అర్థమయింది రాముకి. రాత్రి పదకొండు దాటినా కస్టమర్లతో కిక్కిరిసిపోయి ఉంది హోటల్.

కస్టమర్స్‌లో ఎక్కువగా క్లాస్ వర్గానికి చెంది నవారే. ఎక్కడెక్కడి నుంచో ప్రత్యేకంగా ఆదెయ్య హోటల్ని వెతుక్కుంటూ రావడం గమనించాడు రాము.

ఆదెయ్య తాతముత్తాల నుంచీ వంశపారం పర్యంగా టౌన్లో నడుస్తున్న హోటల్ అది. పనివాళ్ళు అంతా కలిసి పాతికమందికిపైగా ఉంటారు. అక్కడి భోజనం రుచి చూశాక రాముకి ఏదో ఆశ కలిగింది. మంచి తిండి దొరుకుతుంది. ఎక్కడో ఒకచోట తలదాచుకో వచ్చు అనుకున్నాడు. తలెత్తబోయిన సంకో చాన్ని పక్కకు నెట్టేసి "ఆదెయ్యగారూ! మీ హోటల్లో ఏదైనా ఉద్యోగం ఇస్తారా? నేనూ ఉద్యోగం వేటలోనే ఉన్నాను" అభ్యర్థనగా చూస్తూ అడిగాడు రాము.

"కుర్రాడు బుద్ధిమంతుడు! తల్లీ తండ్రీలేని అనాథ. చదువు పూర్తి చేసుకుని ఉద్యోగం కోసం పట్నానికొచ్చాడు. అందాకా ఉండ నీయ్...." అంటూ ఊరికి పోయేటప్పుడు రామూ గురించి చెప్పి ఒప్పించాడు చంద్రన్న ఆదెయ్యని. తక్షణమే రాము కాకా హోట ల్‌లో సూపర్వైజర్ అయ్యాడు. ఇంక తన జీవితానికి ఢోకా లేదనిపించింది.

**20**



"బలహీనమనస్కుడు శారీర కంగా ఎంత బలవంతుడైనా బతుకు భారంగా మోయవలసి వస్తుంది. జీవితమంతా కలల తోనూ... ఆశల అలలతోను గడిచిపోయింది. ఆదెయ్య హోటల్లో పనివాళ్ళపై అజమాయిషీ చేసే ఉద్యోగం నుంచి అంట్లుతోమే స్థాయికి దిగజారింది. అయినా నేను బాధపడలేదనను గానీ ఎలాగో దిగమింగుతూ కాలం వెళ్ళబు చ్చుతున్నాను. ఆకలి ఆరాటం తెలిసినవాడిని. నీడకు కరవై పడరాని పాట్లు పడినవాడిని. అందుకే మనసు దిటవు చేసుకుని మనుగడ సాగిస్తుంటే మళ్ళీ మనసులో కల్లోలం మొద లయింది. మాగన్నుతో మొద్దు నిద్రలో పడి సర్వం మరిచి సేదతీరుతున్న మనసు కొల నులో అలలతాకిడి రేగింది" అని చెప్పి దీనంగా చూస్తున్నాడు రాము, తన గత మంతా సురేష్ ముందు వొలకబోసి.

రాము సుదీర్ఘమైన జీవన గతిని మౌనంగా విన్న సురేష్ గట్టిగా నిట్టూర్చాడు. అనంతసా గరుడు తన అలల సవ్వడితో రాము దీనగా థను విని ఊ కొడుతున్నట్టున్నాడు. ఇద్దరూ బీచ్‌రోడ్డులో ఓ పక్కగా కారాపి నిర్మానుష్య

ప్రదేశంలో కూర్చుని ఉన్నారు.

"నా దుస్థితిని తెలుసుకున్న శేఖర్ స్వయంగా నన్ను వెతుక్కుంటూ వచ్చాడు. నన్నూ నా పరిస్థితిని కళ్ళారా చూసి తనతో ఊరికి వచ్చేయమని ప్రాధేయపడ్డాడు" చెప్పాడు రాము.

"ఒరేయ్ రామూ! ఏంట్రా ఇది? నువ్వు చిప్పలు కడగడం స్కూల్ ఫైనల్లో ఫస్ట్‌క్లాస్‌లో పాసయినవాడివి. నిన్ను స్ఫూర్తిగా తీసుకుని నీ దగ్గర ఎన్నో పాఠాలు నేర్చుకున్నవాణ్ణి నీ మూలంగా ఎలాగో పాసై పరీక్ష గట్టెక్కించు కున్నవాణ్ణి. నిన్నీ స్థితిలో చూడలేకపోతున్నా నురా! అందరూ నిన్నేదో గొప్పగా ఊహిం చారు. ఆఫీసరవుతానని... గొప్ప హోదాలో ఉంటావని..." అని ఏవేవో మాట్లాడుతుంటే,

"అదిగో! అవే నన్ను ముంచేశాయి. కలల లోకంలోకి తోసిపారేశాయి. ఏ మాటకామాట చెప్పుకోవాలి చదువుని అశ్రద్ధ చేయకపోతే నిజంగా నా గమ్యాన్ని చేరేవాడినే. కానీ.. లేనిపోని భ్రమల్లో పడి గాడి తప్పాను. అందుకు నాకిదే శిక్ష" అన్నాను.

"ఇలా నిన్ను నీవు ఎన్నాళ్ళు శిక్షించుకుంటా వురా? ! ఒరేయ్ రామూ! సుందరయ్య మాస్టారేమనేవారో నీకు గుర్తుందా? ! 'ఒరేయ్ చదువురాని శేఖరంగా! ఆ రామూని చూసైనా బుద్ధి తెచ్చుకోరా! చూడు... ఎలా చదువుకుం టున్నాడో... వాడురా... ఎప్పటికైనా ప్రయో జకుడయ్యేది..." అన్నాడని చెప్పాడు.

కాని.. ఇప్పుడు అది తారుమారయింది. ఓడలు బళ్ళూ.. బళ్ళు ఓడలూ అవడం అంటే ఇదే! నీ తండ్రి నీకిచ్చిన వ్యాపారాన్ని రెట్టింపు చేసి రాజాలా బతుకుతున్నావు.. మరి నేనిలా..." అని వాపోయాను.

అందుకే నిన్ను నాతో తీసుకుపోవాలనొ చ్చాను. నీ దగ్గర అక్షరం ముక్కలు నేర్చుకు న్నాను. అదే నా వ్యాపారానికిప్పుడు అండవు తోంది. ఆ ఋణం తీర్చుకోనివ్వరా' అంటూ శేఖర్ శతవిధాలా నన్నొప్పించి మా ఊరికి తీసుకుపోవాలని చూశాడు. కానీ నాకు మన సొప్పలేదు. మళ్ళీ ఆ ఛాయలకు వెళ్ళాలనిపిం చలేదు. ఎందుకో తెల్సా సురేష్? !" అని చెప్పడం ఆపాడు రాము.

'ఎందుకన్నట్టు' చూశాడు సురేష్ రాము కళ్ళ ల్లోకి "మీ అమ్మ లేని ఊర్లో ఉండలేకా? "

"నా తల్లి లేకపోవడమే కాదు! దైవం లాంటి మాస్టారు చావుకి కారణమైనందుకు. ఆ మహానుభావుడి మాటల్ని పెడచెవిన పెట్టి అడ్డదార్లు తొక్కాను. పట్నానికి నేను వెళ్ళిన సంగతి పక్కనపెట్టి పాటలు, పద్యాలు అంటూ వెర్రివేషాలు వేయడం ఆయనకు తెలిసి తీరని వేదనకు గురిచేసింది. చివరి దాకా ఆవేదన ఆయన్ను వెంటాడింది.

ఆయన చావుకి దారితీసిన కారణాల్లో అది కూడ ఒకటని శేఖర్ అసలు విషయం చెప్పాక నామీద నాకే అసహ్యం వేసింది. నా మనసు నిప్పులో పడ్డంతగా తల్లడిల్లిపో యింది. అందుకే శేఖర్‌కే కాదు ఇంకెవ్వరి కంట పడకూడని సుదూర ప్రాంతాలకు తర లిపోవాలని తలపోశాను. కానీ అది కూడా అంత తేలికైన పనికాదని తెలిసిపోయింది. నాకు బతుకుమీద తీపి చచ్చిపోయింది. ఇప్పుడు నేనొక జీవచ్ఛవాన్ని" అని ముగిం చాడు రాము. అతని కళ్లవెంట నీళ్లు ధారాపా తంగా కారిపోతున్నాయి.

"రిలాక్స్! రామూ రిలాక్స్. నువ్విప్పుడు తీవ్రమైన డిప్రెషన్లో ఉంటున్నావు. ముందు అందులో నుంచి బయటపడే ప్రయత్నం చేయ్. తప్పు చేయడం తప్పు కాదు. అది మానవ నైజం. చేసిన తప్పుల్ని సరిదిద్దుకుని గమ్యాన్ని చేరుకుంటేనే జీవితానికి సార్థకత. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నువ్వను కుంటున్నట్టు నువ్వేం ఘోరమైన తప్పు చేయ లేదు. ఇప్పటికైనా గట్టిగా తల్చుకుంటే నువ్వ నుకున్నది సాధించగలవు. ఏది నిన్ను పెడ దారి పట్టించిందో అదే నిన్ను అందలం ఎక్కి స్తుంది!" అన్నాడు సురేష్.

"అంటే? !"

"అదేమిటో నేను చెప్పను. చూపిస్తాను. నాతో రా" అంటూ సురేష్ ముందు తను లేచి రాముకి చేయి అందించాడు. రాము

నెమ్మదిగా లేచాడు. ఎక్కడికి అంటూ.

"చెబుతాను"

ఇద్దరూ నడుచుకుంటూ కారు దగ్గరకు చేరారు. సురేష్ డోర్ తీసి ఎక్కమన్నట్టు రాముకేసి చూశాడు. రాము తటపటాయిస్తూ చూస్తూండిపోయాడు.

"నీ బాధ నా కర్థమైంది! నిన్ను చాలామంది గతంలో ఏవేవో ఆశలు చూపించి రంగుల వలలో చిక్కుకునేట్టు చేశారు. ఆ భయం నిన్ని ప్పటికీ పీడిస్తోందని నాకు తెలుసు"

తన మనసుని ఇట్టే పసిగట్టి భావాలను కచ్చితంగా అర్థం చేసుకోగలిగిన సురేష్‌కేసి విచిత్రంగా చూశాడు రాము. ఇలాంటి సురే ష్‌నా తను ఆనాడు నిర్లక్ష్యంగా చూసింది. అపార్థం చేసుకుంది. అనుకున్నాడు.

"నిన్ను నీవు తెలుసుకునేట్లు చేసి నిన్ను డిప్రెషన్ నుంచి బయటికి తీసుకురావడానికే నా ప్రయత్నం. నువ్వు ఈ స్థితినుంచి బయ టపడ్డాక తుది నిర్ణయాన్ని నీకేవొదిలేస్తాను. ప్లీజ్... కారెక్కు"

కారు స్పీడ్‌గా నగరంలోకి దూసుకుపోయి నగరం నడిబొడ్డునున్న ఒక కార్పొరేట్ బిల్డింగ్ ముందాగింది. కారు వచ్చి ఆగీ ఆగ గానే సెక్యూరిటీ గార్డు వచ్చి అటెన్షన్లో నిలబడి సాల్యూట్ చేసి కారు డోర్ తీసి వినయంగా నిలబడ్డాడు. కార్లో నుంచి సురేష్ రాము దిగి లోపలికి వెళ్లారు.

చీకటి పడినా లోపల ఇంకా చాలామందే ఉన్నారు. వాళ్లంతా నిలబడి సురేష్‌కి నమ స్కారం చెప్పి మళ్ళీ యధాప్రకారం తమ సీట్లలో కూర్చుని పనిలో నిమగ్నమవుతు న్నారు. సురేష్ హోదా చూసి రాము విస్తు పోతున్నాడు. ఇంత చిన్న వయసుకే ఎంతటి హోదా...?!

ఛాంబర్ బయట గోడపై గోల్డెన్ లెటర్స్‌తో నేమ్‌ప్లేట్... పి. సురేష్ ఎమ్.టెక్, ఎమ్.డి అని చెక్కి ఉన్నాయి. రాము ఆశ్చర్యపో యాడు. పాలీటెక్నిక్‌లో సురేష్ స్టేట్ ర్యాంక్ తెచ్చుకుని అంతటితో ఆగకుండా ఇంజనీరింగ్ డిగ్రీ, ఆపై మాస్టర్ డిగ్రీ కూడా చేశాడన్న మాట అనుకున్నాడు. ఛాంబర్‌లోకి ప్రవేశించ గానే "ప్లీజ్ బీ సీటెడ్" అన్నాడు రాముతో తనకెదురుగా ఉన్న సీట్ చూపించి.

ఏసీ గది మనసుని ఆహ్లాదపరుస్తోంది.

ప్యూన్ రెండు కప్పుల కాఫీ తీసుకొచ్చాడు.

ఇంతటి హోదాలో ఉన్న సురేష్‌ని చూడ గానే రాముకి ఏదోలా అనిపించి ఇబ్బందిగా ఫీలయ్యేడు. అంతరంగం ఆత్మన్యూనతా భావం తో కుదించుకుపోవడం సురేష్ పసిగట్టాడు.

"ఒరేయ్ రాము! బీ ఫ్రీ. డోంట్ బీ నెర్వ స్డ్ మనం ఒకప్పుడు కాలేజ్ మేట్స్... హాస్టల్ మేట్స్... రూమ్మేట్స్‌మి కూడా" అని నవ్వాడు సురేష్.

"ఒకప్పుడు నిన్ను అర్థం చేసుకోలేక అవ మానించాను. దానికి ఇప్పుడైనా నన్ను క్షమించు"అన్నాడు రాము బెరుకుగా చూస్తూ.

"ఫూల్! మనలో మనకి క్షమాపణలేంటి? " అంటూ బెల్‌కొట్టాడు సురేష్. "సార్"అంటూ వచ్చిన ప్యూన్‌కి సురేష్ ఏదో చెప్పి పంపిచా డు. ప్యూన్ వెళ్లిపోగానే "సురేష్! నువ్వు ఎమ్.టెక్ చేసి ఈ ఉద్యోగంలో..." అని రాము అర్థోక్తిగా ఆగిపోయాడు.

"అసలు ఉద్యోగాలు రావడమే గగనమై పోతోందిప్పుడు. చదివిన చదువుకి తగిన ఉద్యోగాలు రావడం ఈ దేశంలో ఎప్పుడో పోయింది. నువ్వు బహుశా గ్రహించే ఉంటావు. ఇది ఎఫ్.ఎమ్ రేడియో స్టేషన్. ప్రజలకు నిరంతరం వినోదాన్నిచ్చే ప్రైవేట్ సంస్థ. ఇందులో కళాసాంస్కృతిక సృజనా త్మక రంగాలకు ఎంతో ప్రాధాన్యం. ఇలాం టివి ఇంకా మన దేశంలో ముమ్ముందు చాలా రాబోతున్నాయి. అంటే నీ లాంటి కళాకా రులవే రాబోయే రోజులన్నీ" అని నవ్వాడు సురేష్

ఆ మాటలకు రాము సిగ్గుపడ్డాడు. తనను ఇంకా వీడని అపరాధ భావనలో కూరుకు పోయాడు. మళ్లీ తను రంగులవలలో పడబో తున్నానేమోనన్న అనుమానం కలిగింది. "సారీ! సురేష్ నాకలాంటి ఆశలిప్పుడు ఏ కోశానా లేవు. నీకో విషయం చెప్పనా?!"

"ఏమిటో చెప్పు" నేనొక గొప్ప కళాకారుణ్ణని విర్రవీగాను. అందరూ గుర్తించి, అలా అందరిచేతా పిలిపించుకోవాలని తపించిపోయే వాణ్ణి. ఇప్పుడా ఊసెత్తితే చాలు నాలో ఏదో ఏహ్యాభావం... నేను గొంతెత్తి పాడి ఏడేళ్ల పైనే అవుతోంది. నన్ను అడ్డదారిలో పడేసిన కళ అంటే నాకిప్పుడు చెప్పలేనంత చిరాకు... భరించలేని అసహ్యం"

"అదిగో... ఆ నిరాశా నిస్పృహలే వొద్దంటున్నది. నిన్ను అడ్డదారిలో పడేసింది కళ కాదు. గోరంతను కొండంత చేసి మైమరిపించిన నీ చుట్టూ ఉన్నవాళ్లు. అర్ధ్ధమైందా? శాటిలైట్ టీవీలొచ్చాక ఎంతమంది కళాకారులకు జీవనోపాధి కలుగుతోందో నీకు తెలుసా? జూనియర్ ఆర్టిస్టులెందరికో అన్నం పెట్టి ఆదుకుంటోంది. ఈమధ్య సినీఫీల్డ్‌లో ఒకప్పుడు స్టార్ వేల్యూ పొందిన నటీనటులకు సైతం ఆశ్రయం ఇస్తోంది టీవీ రంగం."

"ఇది చెప్పడానికేనా నన్నిక్కడకు తీసుకొచ్చింది?" రాము కూర్చున్న సీట్లో ఇబ్బందిగా కదులుతూ అన్నాడు.

"కూల్ డౌన్! నువ్వు అంతగా ఇబ్బంది పడనక్కరలేదు. ప్లీజ్ బి కామ్' అన్నాడు సురేష్ అభ్యర్థిస్తున్నట్టుగా.

అతడి మాటలకు రాము ప్రశాంతంగా సీట్లో సర్దుకుని కూర్చున్నాడు. "రామూ! నువ్వే అన్నావు. ఎమ్.టెక్ చేసి ఏ ఇంజినీరో కాకుండా సంబంధంలేని ఈ ఉద్యోగం ఏమిటని? అంటే నేను నా చదువుని పక్కన పెట్టి రాజీపడినట్టే కదా! ఆ పని నువ్వెందుకు చెయ్యకూడదు" అని ఆగాడు సురేష్.

రాముకి అంతా తికమకగా వుంది. ఏమీ అర్థం కావడంలేదు. జాగ్రత్తగా విను అన్నట్టుగా సురేష్ తన సీట్లోంచి ముందుకి వొంగి టేబుల్‌పై చేతులానిచ్చి రాము ముఖంలో ముఖంపెట్టి అన్నాడు.

"నా చదువుకి తగ్గ ఉద్యోగం రాదేమోనన్న అనుమానం నన్నూ పీడించింది. అలాగని నేను మొండిపట్టు పట్టుకుని కూర్చుని ఉండిపోలేదు. బతకడానికి ఏదైతేనేం అనుకున్నాను. వెంటనే ఉద్యోగంలో చేరిపోయాను - అసిస్టెంట్‌గా. ఈ మధ్యనే ఈ పోస్ట్‌లోకి ప్రమోట్ అయ్యాను" ఇంతలో ప్యూన్ వచ్చి "సార్!" అంటూ ఏదో చెప్పాడు.

"రమ్మను" అని సురేష్ ఆదేశం ఇచ్చాడు. ఓ వ్యక్తి- ముప్పయ్యయిదు వయసుంటుంది - లోపలికొచ్చి

"నమస్తే సార్!" అన్నాడు.

"రండి! మనోజ్‌గారూ.. కూర్చోండి" అన్నాడు సురేష్.

"మిస్టర్! మనోజ్... ఈయన్ని గుర్తుపట్టావా? ! మన హాస్టల్ సింగర్... అభినవ ఘంటసాల..." వచ్చిన వ్యక్తిని చూస్తున్న రాము ఆ మాటలకు గిల్టీగా తలదించుకున్నాడు.

"ఓ! మీరా... గుర్తుపట్టలేకపోయాను. బాగున్నారా!" అన్నాడు మనోజ్ రామూ వైపు చూస్తూ.

రాము తలెత్తి అతడివైపు పరిశీలనగా చూస్తూ "మీరు... మీరు ఓపిడియార్ కదూ...? !"అంటూ సందేహంగా చూశాడు.

"రైట్! తన కవితలతో ఆగని వాగ్ధాటితో వొదిలిపెట్టకుండా దంచేసిన రకం! మనోజిప్పుడు ఎఫ్.ఎమ్.శ్రోతల్ని వొదిలిపెట్టకుండా దంచుతున్నాడు...!" అని నవ్వాడు సురేష్ ఫకాలున.

మనోజ్ కూడా నవ్వుతూ అన్నాడు "సార్! రికార్డింగ్ జరుగుతోంది... మళ్లీ వస్తాను..."

"రానక్కర్లేదు. కేరీ ఆన్... మిమ్మల్ని కేవలం రాముకి చూపించాలనే పిలిపించాను..." అన్నాడు సురేష్. మనోజ్ రామూకేసి చూసి "వస్తా" అని వెళ్లిపోయాడు.

"మనోజ్! ఇక్కడ పన్జేస్తున్నాడా? " రాము అడిగారు. అవునన్నట్టు తలఊపాడు సురేష్.

"జీతమెంత? !" సురేష్ చెప్పాడు.

రామూ "హమ్మో" అని ఆశ్చర్యచకితుడయ్యాడు. "అంత జీతం అతను సగంలో ఆపేసిన చదువు వల్ల కూడా లభించేది కాదు. నీలాగే ఏవో భ్రమల్లో పడి సినిమా పాటల రచయితని కావాలని కలలు కన్నాడు. చదు

వుని అశ్రద్ధ చేసేశాడు. ఫీల్డులోకి వెళ్లి తన అదృష్టాన్ని పరీక్షించుకున్నాడు. వెనక్కి వొచ్చేసి ఇక్కడ ఉద్యోగం సంపాదించుకున్నాడు. ఆ తర్వాత చదువును కూడా కొనసాగించాడు ప్రైవేట్‌గా. అంతేగాని నీలా నిరాశకు గురికాలేదు. అదే మనోజ్‌లో ఉన్న గొప్పతనం. ఇప్పుడు చేస్తున్నది కూడా ఏదో కాలక్షేపం కోసమే. అతని ధ్యేయం వేరే వుంది. ఎప్పటికైనా సినీ ఫీల్డ్‌లో తన గోల్‌ని రీచ్ అవ్వాలన్నదే మనోజ్ ప్రగాఢ వాంఛ. అతని పట్టుదలను చూసిన ఎవరికైనా సక్సెస్ అయి తీరతాడనిపిస్తుంది. రామూ! మనిషి జీవితంలో ఏం కోల్పోయినా ఫర్వాలేదుగాని ఆత్మవిశ్వాసాన్ని మాత్రం పోగొట్టుకోకూడదురా? నీ ఫెయిల్యూర్స్‌కి అదే మూలకారణమని నాకనిపిస్తోంది. నీలో నెగిటివ్ ఎప్రోచ్ చాలా ఎక్కువగా ఉంది. ఎక్కడికెళ్లినా ఏంచేసినా నీకంటే నీలోని నిరాశే ముందుంటోంది. ముందు అది మానుకో. ఆశావహ జీవితాన్ని అలవర్చుకో"

సురేష్ మాటలు రామూని బాగా ఉత్తేజపర్చాయి. అంతలోనే ఏదో తెలియని నిర్వేదం అతనిలో. అది గ్రహించిన సురేష్ మళ్లీ కౌన్సిలింగ్‌ని కొనసాగించాడు.



"నువ్వు అన్నివిధాలా చితికిపోయి లేవలేని స్థితిలో ఉన్నావని నాకు తెలుసు. నువ్వొక స్థాయికొచ్చి నిలదొక్కుకునేదాకా నేను నీకు అండగా ఉంటాను. ఇప్పుడు నేను ఫోర్స్‌డ్ బ్యాచిలర్‌ని. నా భార్య పురుడుపోసుకుని పుట్టింటి నుంచి రావడానికింకా చాలా కాలం పడుతుంది. అప్పటిదాకా నువ్వు నాతో ఉండొచ్చు నీకు తాత్కాలికంగా ఉద్యోగం ఇప్పించే ప్రయత్నం కూడా చేస్తాను. ఇందులో నా స్వార్థం కూడా లేకపోలేదు. నేను స్వతహాగా కళాకారుణ్ణి కాకపోవచ్చు కానీ కళలన్నా కళాకారులన్నా ఒల్లమాలిన అభిమానం. నీకు తెలియదు. ఆనాడు హాస్టల్లో కావాలని నీ రూమ్‌లో వేయించుకున్నాను - వార్డెన్‌ని కోరి మరీ. ఎందుకంటే నీ పాటల్ని వినాలన్న కుతూహలంతో. నువ్వు నన్నపార్థం చేసుకుని రూమ్ ఖాళీ చేసేశావు. ఏదిఏమైనా మా ఎఫ్.ఎమ్. ద్వారా ఓ గొప్ప కళాకారుణ్ణి శ్రోతలకందించాలన్నది నా కోరిక. నీ ద్వారా ఆ కోరిక నెరవేరుతుందని నా నమ్మకం. నాకు తెలిసిన సంగీత విద్వాంసుడి దగ్గర నువ్వు శాస్త్రీయ సంగీతం నేర్చుకునే ఏర్పాట్లు చేస్తాను. నగరంలోని ప్రముఖుల దగ్గర మెలకువలు నేర్చుకుందువుగాని. కానీ అన్నింటికంటే ముందు నువ్వు చెయ్యాల్సిందొకటుంది!" అని ఆగాడు సురేష్.

"ఏమిటి? !" రాము అడిగాడు ఆత్రంగా.

"నీ చదువు. అది పూర్తిచెయ్"

"తప్పకుండా! నా మొదటి కోరిక కూడా అదే. నువ్వింత అండగా ఉంటానంటే రేపట్నుంచే... కాదు కాదు... ఈరోజు నుంచీ... ఈ క్షణం నుంచీ నా పయనం, గమ్యం నా విద్యార్హతను పెంచుకోవడానికే" అని శపథం చేస్తున్నట్లుగా అన్నాడు రాము. అతని స్వరంలో ఇదీ అని చెప్పలేని ఏదో ధైర్యం ఏదో విశ్వాసం.

రాము వదనంలో వేయికాంతుల ఆశారేఖలు వెల్లివిరియడం సురేష్ స్పష్టంగా చూస్తూ ఆత్మీయంగా నవ్వుతూ చేయి చాచాడు.



విద్యార్థుల మానసిక సంఘర్షణకు ప్రతిబింబం

# అంపశయ్య



మేధో లోకంలో గజిబిజిని, అరాచకాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రించడమే లక్ష్యంగా 'చైతన్య స్రవంతి' శిల్ప ప్రయోగం సాహిత్యంలోకి ప్రవేశించింది. దీన్ని పదునుగా వాడుకున్న తెలుగు సాహితీవేత్తల్లో శ్రీశ్రీ, బుచ్చిబాబు తర్వాత 'అంపశయ్య' నవీన్ అగ్రగణ్యులు. చైతన్య స్రవంతి శిల్పాన్ని నవలంతటా విస్తృతపరిచిన ఘనత నవీన్‌కు దక్కగా దాని బృహత్‌రూపం 'అంపశయ్య'లో మాత్రమే కనిపిస్తుంది.

'అంపశయ్య'ను ఒక తపస్సులా భావించి తీర్చిదిద్దానని ఆయన ఎంతో సగర్వంగా పేర్కొంటారు.

## కథ వెనుక కథ

తొలినవల 'అంపశయ్య'తోనే తెలుగు సాహిత్యంలో స్వీయ ముద్రను ప్రతిబింబించిన రచయిత నవీన్. అనంతరకాలంలో కాలరేఖలు, ముళ్లపొదలు, చీకటి రోజులు తదితర ఇరవై ఐదు నవలలు, రెండు కథా సంకలనాలు రచించారు. 'కాలరేఖలు' నవలకు ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చిన విషయం విదితమే. నిరుద్యోగ యువ మేధావి చదువుకుంటున్న సమయంలో ఎలా ఉండటానికి వీలుందో ఊహించి మరింత విస్తారమైన భూమిక నుంచి 'అంపశయ్య'ను రాశానంటున్నారు ఆయన.

ఉస్మానియా యూనివర్సిటీలో ఎమ్మే(పొలిటికల్ సైన్స్) చేస్తున్న హాస్టల్ విద్యార్థి రవి జీవితం ఒకరోజులోని కేవలం పదహారుగంటల కాలవ్యవధిలో ఎన్నిమలుపులు తిరిగిందనేదే ఈ నవల ఇతివృత్తం. దీని 'కథవెనుక కథ' ఈ నెల చతుర పాఠకులకు ప్రత్యేకం..

### ఆరోజే అనుకున్నాను

'ఉస్మానియా యూనివర్సిటీలో ఎమ్మే చదువుతున్న రోజులవి. 1963 ఫిబ్రవరిలోనో, మార్చిలోనో ఒకరోజు మనస్సును కలచివేసే సంఘటనలెన్నో జరిగాయి. బిల్ చెల్లించక పోవడంతో మెస్‌లో భోజనం బంద్ కావడం, గర్ల్‌ఫ్రెండ్ సినిమాకు రమ్మని ఆహ్వానించడం, ప్రత్యర్థులతో వాగ్వివాదం, ఫొటోగ్రఫీ నేర్చుకుంటున్న మిత్రుడు తను తీసిన న్యూడ్ ఫొటోలు చూపించడం వంటివన్నీ ఆ ఒక్క రోజులోనే జరిగాయి. అదేరోజు రాత్రి ఈ సంఘటనలన్నిటినీ చిత్రిస్తూ ఒక నవల రాస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన బుర్రలో పడింది. నా జీవితంలోనూ, నా చుట్టూ ఉన్న జీవితంలోనూ జరిగే అనేక సంఘటనలను నవలగా మలచాలన్న కోరిక చాలా చిన్నతనం నుంచే నాలో ఉండేది.

### మూడేళ్లకు కార్యరూపం

1963లో ఒకరోజు నా జీవితంలో సంభవించిన ఘటనలన్నీ నవలగా రూపొందించాలన్న కోరిక రోజురోజుకూ బలపడటంతో 1966 జులైలో నవల రాయడం మొదలు

## గొప్ప సాహసమే

అంపశయ్య మొదటి ముద్రణకు సంబంధించిన కాపీలుమొత్తం ఏడాది తిరక్కుండానే అయిపోయాయి. మొత్తమ్మీద 'అంపశయ్య' వంటి నవలను రాయాలనే ఆలోచన రావడం, రెండుసార్లు తిరిగి రాయడం, ఐదేళ్ల నా నిరీక్షణకు ప్రచురణతో సరైన ఫలితం రావడం నా జీవితంలో గొప్ప అడ్వెంచర్... ప్రారంభించిన సృష్టిని పూర్తిచేయాలనే దీక్ష, పట్టుదల, కఠోర శ్రమ కేవలం అనుభవంమీద మాత్రమే అర్థమవుతాయి. అదో తపస్సు- అదో సమరం- ఆ సమరంలోంచి ఉద్భవించిందే 'అంపశయ్య' ఈ నవల పాఠకుల మధ్యలోకొచ్చి ముప్పై అయిదేళ్లు పూర్తియినా ఇదంతా నాకు నిన్నో మొన్నో జరిగినట్లుగా ఆ నవలను రాసినప్పటి ప్రతీక్షణం సదా స్మరణీయమే..



పెట్టాను. అప్పుడు నల్గొండలో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నాను. బుర్రలోకి ఏ ఆలోచన వస్తే దాన్ని యథాతథంగా 'ఇది చదివి పాఠకులు ఏమనుకుంటారు' అన్న సంకోచమే లేకుండా పూర్తిగా కాగితంపై పెట్టేవాడిని. అలా రాస్తూ పోగా నవలసైజు దాదాపు ఎనిమిది వందల పేజీలకు పెరిగిపోయింది. 1967లో పూర్తయిన నవలను నేనొక పాఠకుడిగా చదువుకుంటే చాలా లోపాలు కనిపించాయి. పాత్రల మనస్సంచారాన్ని యథాతథంగా చిత్రించాలన్న పట్టుదలవల్లే ఈ లోపాలువచ్చాయి. దీంతో నవలను కుదించాల్సిన అవసరమేర్పడింది.

### రవిబాబు సహకారం

నల్గొండలో పనిచేస్తున్నప్పుడే నాకు కొత్తపల్లి రవిబాబుతో సాంగత్యమేర్పడింది. ఉస్మానియా యూనివర్సిటీ 'బి'హాస్టల్ మూడో నెంబరు రూంలో పదిహేనురోజుల పాటు ఇద్దరం కలిసి కూర్చుని ఎలాగైతేనేం నవలకు పూర్తిరూపం కల్పించాం. రవిబాబే నా వెనుక లేకపోతే 'అంపశయ్య' వెలుగుచూసేదే కాదేమో! ఎందుకంటే నేనురాసిన అంపశయ్య మొదటిరూపం గందరగోళంగా, అస్తవ్యస్తంగా సాగింది. నవలను ఎక్కడ, ఎలా ముగించాలో తెలియని స్థితి! అలాంటిది పక్షం రోజుల్లో రవితో కూర్చుని దాన్ని మూడు వందల పేజీలకు కుదించడమే కాక మంచి ముగింపు కూడా ఇచ్చాం. అప్పటికింకా నవలకు పేరు పెట్టలేదు.

### పేరుపెట్టడానికి తర్జనభర్జనలు

ఉస్మానియాలో చదివేరోజుల్లో నా సాహితీ మిత్రులైన వరవరరావు, గంట రామారెడ్డిలకు నవల రూపాన్ని పంపించాను. వరవరరావు 'నీ నవల చదువుతుంటే నన్ను నేను చదువుకుంటున్నట్టుగా

తోచింది.., ఇందులో ఉన్నదంతా మనం అనుభవించిందే, ఇన్ని వాస్తవ సంఘటనలను నవలగా మలచిన నీ నేర్పును అభినందించకుండా ఉండలేను' అంటూ చెప్పి నవలకు 'శిలువ' అన్న పేరు సూచించాడు. నాకు మాత్రం షెల్లీరాసిన 'ఓడ్ టు ద వెస్ట్ విండ్' పద్యంలో 'ఫాల్ అపాన్ ద తార్న్స్ ఆఫ్ లైఫ్' అన్న వాక్యం చాలా బాగా నచ్చి నవలకు అదే అర్థం వచ్చేలా పేరు పెట్టాలనుకున్నాను. ఒకరోజు అకస్మాత్తుగా తోచిన 'అంపశయ్య'ను మిత్రులు కూడా సరేననడంతో నవలకు ఆ పేరు పెట్టాను.

## ప్రచురణలోనూ సందిగ్ధమే

మేం నడుపుతున్న త్రైమాసిక పత్రిక 'సృజన'లో అంపశయ్యను ప్రచురించాలనుకున్నాం. త్రైమాసికలో సీరియలైజ్ చేస్తే చాలా కాలం పడుతుందన్న వరవరరావు భావనతో ఏకీభవించి సృజనలో అంపశయ్యను ప్రత్యేక అనుబంధంగా వేద్దామనుకున్నాం. కానీ కొన్ని కారణాలవల్ల 1969 మే, ఆగస్టు సంచికలో అంపశయ్యలోని మొదటి మూడు గంటల భాగాన్ని సీరియలైజ్ చేసి 1969 నవంబరులో సృజన ప్రచురణలు పేరుతో పుస్తకంగా విడుదల చేశాం.

## విశాఖ విద్యార్థుల కితాబులు

'అంపశయ్య' పుస్తకంగా వెలుగు చూశాక శ్రీశ్రీ షష్టిపూర్తి సమావేశాలకు విశాఖపట్టణం వెళ్లాం. అక్కడ ఈ నవల చదివిన అనేక మంది ఆంధ్రా యూనివర్సిటీ విద్యార్థులు నన్ను కలుసుకొని 'మేమిక్కడ విశాఖపట్టణంలో హాస్టల్‌లో అనుభవించిన కష్టాలు మీకెలా తెలిశాయి... మీ నవల చదువుతుంటే మమ్మల్ని మేం అద్దంలో చూసుకున్నట్లుంది.. మా మనసుల్లోకి మీరింత లోతుగా ఎలా చొరబడగలిగారు' అనిఅడిగినప్పుడు గొప్ప ఆనందాన్ని అనుభవించాను. సరిగ్గా నేను ఆశించిన స్పందన ఇదే... పాఠకుల నుంచి ఎటువంటి ప్రతిస్పందన ఉంటుందని ఊహించానో అది నిజమైంది.

## ఐదు అంశాలు

చైతన్య స్రవంతి శిల్పాన్ని ప్రక్కన పెడితే 'అంపశయ్య'లో ప్రధానంగా ఐదు అంశాలు కనిపిస్తాయి. మొదటిది యూనివర్సిటీల నిజ స్వరూపాన్ని బయటపెట్టడం. రెండవది వర్గ నేపథ్యం నుంచి తెచ్చుకున్న భావజాలాలను విద్యార్థులు యూనివర్సిటీ జీవితంలో సైతం అన్వయించుకోవడం. మూడోది విభిన్న భావజాలాల మధ్య అనివార్యంగా ఏర్పడే ఘర్షణల్లో విద్యార్థులు ఎవరికి తగిన పక్షాన్ని వారు వహించడం. నాలుగోది గ్రామీణ మధ్యతరగతి వ్యావసాయిక నేపథ్యం నుంచి వచ్చిన విద్యార్థి యూనివర్సిటీ వాతావరణంలో కుటుంబంపట్ల బాధ్యతని ఫీలవుతూ లోనయ్యే అంతస్సంఘర్షణ. అయిదు ప్రపంచాన్ని, కళలను, స్నేహాలను, ఆశలను, ప్రేమను, ఆశయాలను ఎంతో ఆకర్షణీయంగా కనిపింపచేసే నవయవ్వన అశాంతి. ఈ అయిదంశాలు 'రవి'గా ఒక యూనివర్సిటీ విద్యార్థి పాత్రలో విలీనమై విద్యార్థి జీవితంలోని నిత్య సంఘర్షణను కొట్టొచినట్లుగా చూపాయి.

## 16 గంటల కాలవ్యవధి

ఉదయం 5.30గంటలకు లేచింది మొదలు రాత్రి 9.30 గంటలకు పడుకునే వరకు 16గంటల కాలవ్యవధిలో యూనివర్సిటీ విద్యార్థి ఒకరోజు జీవితం ఇతివృత్తంగా సాగిన నవల ఇది. ప్రత్యేక తెలంగాణా సమస్య, వియత్నాం సమస్య వంటి నాటి సమకాలీన స్థితిగతులను స్పృశిస్తూనే యూనివర్సిటీ డిపార్టుమెంట్ల పనివిధానం, విద్యార్థుల రాజకీయాలు, డబ్బే అన్నింటికి మూలంగా ఉన్న స్థితి ఇవన్నీ అందులో ప్రతిబింబించాయి. విద్యార్థులు సామూహిక శక్తిగా తప్ప దౌర్జన్యాన్ని ఎదుర్కోవడం సాధ్యంకాదని గుర్తించి ప్రవర్తించే స్థాయికి ఎదగడం ఆనాటి అనుభవంతో రవి నేర్చుకున్న గుణపాఠంగా నవల ముగుస్తుంది' అంటూ ముగించారు నవీన్.

–మిద్దెల రంగనాథ్ ✦

# స్త్రీవాదంలో ప్రేమ




విస్తృతార్థంలో ప్రేమ అనేది అందరికీ అత్యవసరమే, ఆదర్శప్రాయమే. సాధారణంగా మాతృప్రేమ ఉదాత్తంగా పరిగణింపబడుతుంది. స్త్రీ పురుషుల మధ్య కలిగే ప్రేమ గురించి మాత్రం ఎవరి అభిప్రాయాలు వారివి. ఎవరి వాదం వారిది.

సంప్రదాయవాదులు వివాహానికి పూర్వం స్త్రీ పురుషులు పరస్పరం ప్రేమించుకోవడాన్ని అంతగా సమ్మతించరు. అయితే, రుక్మిణీ దేవి శ్రీ కృష్ణుణ్ణి ప్రేమించింది. తన సోదరుడి అభీష్టానికి విరుద్ధంగా ఆమె ప్రేమించింది. శ్రీకృష్ణుడికి సందేశం కూడా పంపింది రహస్యంగా. శ్రీకృష్ణుడు శత్రువులను జయించి, ఆమెని రాక్షస వివాహం చేసుకున్నాడు. ఆయన అవతార పురుషుడు కనుక ఎలా పెళ్ళి చేసుకున్నా చెల్లింది, ఆయన చేసే పనులు 'లోక కల్యాణం' కోసం కనుక.

సామాన్య కుటుంబాల్లో 'ప్రేమ వివాహం' అనగానే కొంత వైముఖ్యం, కొంత భయం కలుగుతాయి. "ప్రేమ గుడ్డిది" అంటారు. ముందు వెనకా చూసుకోకుండా ఎవరిని పడితే వారిని ప్రేమిస్తే, కుటుంబాల పరువు పోతుంది, సంప్రదాయాలూ ఆచారాలూ దెబ్బ తింటాయి, ఆర్థికంగా నష్టం వస్తుంది (కట్నం రాదు కనుక) అనుకుంటారు.

పెద్దలు చూసే సంబంధాల్లో 'ప్రేమ' ప్రసక్తి ఉండదు. కుటుంబం, సంప్రదాయం, మతం, కులం, శాఖ, గోత్రం, జాతకం, వయస్సు, విద్య సంపాదన, ఆస్తి, హోదా, కట్నం, అందచందాలూ, మొదలైన వెన్నో చూస్తారు. ఒకటి రెండు అంశాల్లో సర్దుకుపోయినా, తక్కినవన్నీ ముఖ్యమవుతాయి. ప్రేమదేముంది - పెళ్ళయాక వాళ్లు చేసేది అదే కదా అనుకుంటారు పెద్దలు. పెళ్ళిచేసుకోవడానికి కట్నాలూ కానుకలూ బేరమాడి తీసుకున్నప్పుడు పరస్పరం ప్రేమ ఎలా ఉంటుంది! భార్యాభర్తలు కీచులాడుకుంటున్నా, కుటుంబ సభ్యుల మధ్య మనస్పర్థలు ఏర్పడినా, స్త్రీలు సర్దుకుపోవాలి. అది సంప్రదాయం, సంస్కృతి. భార్యభర్తల మధ్య ప్రేమ ఉన్నా లేకపోయినా, పరువుకోసమో పిల్లల కోసమో కలిసి కాపురం చేయాలంటారు సంప్రదాయవాదులు.

సమాజం, "ఆడవాళ్ళ ఆత్మగౌరవానికి భంగం కలిగే పనులన్నిటినీ ప్రేమ పేరుతో, అనురాగం పేరుతో, బాధ్యత పేరుతో వాళ్ళ మీద రుద్దుతుంది. పెళ్ళి, భర్త, పిల్లలే స్త్రీలు అందుకోవాల్సిన అంతిమ గమ్యాలుగా

ప్రచారం చేస్తుంది" అన్నారు ప్రముఖ స్త్రీవాద రచయిత్రి ఓల్గా 'రాజకీయకథలు' సంపుటికి రాసుకున్న ముందు మాటలో.

స్త్రీవాదులు స్త్రీకి స్వేచ్ఛ ఉండాలంటారు. చదువుకునే హక్కు, ఉద్యోగం చేసే హక్కుతో పాటు ప్రేమించే హక్కు ఉండాలంటారు. ప్రేమ గాని, పెళ్ళి గాని విఫలమైతే, మరొక రిని ప్రేమించే హక్కు, మళ్ళీ పెళ్ళి చేసుకునే హక్కు, లేదా ఒంటరిగా జీవించే హక్కు ఉండాలంటారు, లేదా పెళ్ళి చేసుకోకుండా కలిసి జీవించే హక్కు ఉండాలంటారు కొందరు.

వివాహం పెద్దలు కుదిర్చినదైనా, ప్రేమించి చేసుకున్నదైనా, వివాహం ఒక బంధం కాబట్టి, పురుషాధిక్య వ్యవస్థలో భాగం కాబట్టి, వివాహం కాగానే పురుషుడికి భార్యపైన అధికారం సంక్రమిస్తుంది. ఆ అధికారాన్ని సమాజం హర్షిస్తుంది. అత్త గారు కూడా స్త్రీ అయినా, కోడలిపైన కొడుక్కు అధికారం ఉండాలనుకుంటుంది - ఆమె కూడా సంప్రదాయాల్ని జీర్ణించుకో వడం వల్ల ప్రేమించి పెళ్ళి చేసుకున్న యువకుడు కూడా పెళ్ళికాగానే భర్త అయి పోతాడు కనుక, అతని రక్తంలో ప్రవహి స్తున్న సంస్కృతి ప్రభావంతో భార్యపైన అధికారాన్ని ప్రదర్శిస్తాడు. భార్య గృహ నిర్వహణ బాధ్యతలూ, పిల్లల బాధ్యతలూ అన్నీ 'సహజంగా' స్వీకరించాలనుకుంటాడు. ప్రేమించి చేసుకున్నందువల్ల కొంత వరకు సహనం చూపిస్తుంది భార్య. భర్త పురుషా ధిక్య ప్రవర్తన శ్రుతిమించినప్పుడు ప్రేమ సంగతి అవతల పెట్టి, విడాకుల సంగతి ఆలోచిస్తుంది. సంప్రదాయ పద్ధతిలో చేసిన వివాహం కన్న ప్రేమించి చేసుకున్న వివాహం బంధం మరింత సున్నితంగా ఉంటుంది. ప్రేమించిన పురుషుడి పట్ల కొన్ని ఆశలూ నమ్మకాలూ ఉంటాయి. అవి దెబ్బతిన్నప్పుడు నిరాశా, నిస్పృహా చోటు చేసుకుంటాయి. విడాకులకు దారితీయ వచ్చు. అందుకే, ప్రేమించి పెళ్ళి చేసుకున్న దంపతులు జీవితాంతం కలిసి కాపురం చెయ్యగలరని గట్టిగా చెప్పలేం. పెళ్ళికాక ముందు, ప్రేమించే స్థితిలో కనిపించిన సద్గు ణాలు కొన్ని పెళ్లయ్యాక అంతగా కనిపిం చవు. సాన్నిహిత్యం, సాంగత్యం, సంపర్కం లేకపోవడం వల్ల పెళ్ళి కాక ముందు కని పించని దుర్గుణాలు కొన్ని తరవాత బయట పడతాయి. ఇరువైపులా సర్దుకుపోయే గుణం ఉంటే ఏ రకం వివాహమైనా నిలు స్తుంది, కొనసాగుతుంది. లేకపోతే పిల్లలు పుట్టిన తరవాత కూడా భగ్నమయ్యే పరి స్థితి ఏర్పడుతుంది.

ప్రధానంగా పురుషాధిపత్యాన్ని సమర్థించి పోషించే వివాహ వ్యవస్థ స్త్రీ పురుష సంబంధాల్లో ప్రేమనీ, కుటుంబ సంబం ధాల్లో ప్రేమనీ నశింపజేస్తోందని గ్రహిం చారు స్త్రీవాదులు. స్త్రీవాద రచయిత్రుల రచ నల్లోనూ, ప్రసంగాల్లోనూ స్త్రీ పురుష సమా నత్వం, ఆవశ్యకతనీ, స్నేహ సంబంధాల ఆవశ్యకతనీ స్పష్టంగా తెలియజెప్పడం జరు గుతోంది. పురుషాధిపత్యాన్ని సమర్థించ కుండా, స్త్రీలను తోటి మానవులుగా చూడటం అలవరచుకున్నప్పుడు, స్త్రీ పురు షుల మనస్తత్వాల్లో అభ్యుదయకరమైన మార్పు వచ్చినప్పుడు వివాహ వ్యవస్థని అందరూ హర్షిస్తారు. అంతవరకూ చాలా



మంది, ఉన్న పరిస్థితులలో కూరుకుపోయి, వైవాహిక జీవితాలను ఎలాగో గడుపుతారు- అందులో 'భద్రతనీ, సుఖా'న్నీ పొందుతున్నామనుకుంటూ, పురుషుడికి స్త్రీ చేసే సేవలు కావాలి, స్త్రీకి పురుషుడి సంపాదనా, భద్రతా కావాలి. ఒకరిపై ఒకరు ఆధారపడతారు. ఆ ఆధారపడటాన్నే 'ప్రేమ' అనుకుంటారు. ఒకరు పోతే మరొకరు దుఃఖిస్తారు - తోడు పోయిందని- అంటే, వారివల్ల లభించే సౌఖ్యాలో సంపదలో ఏవో పోయాయని. స్త్రీ వాద దృక్పథంతో చూసినా, తాత్త్విక దృక్పథంతో చూసినా అదే వాస్తవం.

వివాహ వ్యవస్థలోని లోపాల్ని అధిగమించవచ్చుననే దృష్టితో, స్త్రీ పురుషులు వివాహ బంధం లేకుండా కేవలం కలిసి ఉండటం మంచిది అనుకుంటున్నారు కొందరు. ఆధిపత్యం అనే పురుగు వారి ప్రేమ బంధాన్నీ, స్నేహ బంధాన్నీ పాడు చెయ్యకుండా ఉంటుందని నమ్ముతారు. ఆ విధంగా కలిసి ఉంటున్నవారి అనుబంధం శాశ్వతంగా- అంటే జీవితాంతం ఉంటుందా అంటే, అది వారి వారి మనస్తత్వాలపై ఆధారపడి ఉంటుంది. అభిప్రాయాలు తీవ్రంగా విభేదించినప్పుడు, సర్దుకుపోయే గుణం, అవగాహన, సహనం లేనప్పుడు ఆ ప్రేమానుబంధం తెగిపోవచ్చు ఎటువంటి చట్టం ప్రమేయంగానీ, సంప్రదాయాల భయం గాని లేకుండా సులభంగా విడిపోవచ్చు

ఎన్ని అనుకున్నా, ఎన్ని చెప్పినా, పెళ్ళి అనేది ఇప్పటికీ యువతీ యువకుల్ని 'బంగారు లేడి'లా ఆకర్షిస్తూనే ఉంది. ముఖ్యంగా, పెళ్ళి తంతు అంతకంతకి ఆర్భాటంగా, ఆకర్షణీయంగా జరపడం పెరుగుతోంది. సినిమాల ప్రభావంతో అలంకరణల పట్ల మోజు పెరిగిపోతోంది. పెళ్ళి 'ఘనంగా' జరగాలని కోరుకుంటున్నారు. జీవితంలో ఒక్కసారే జరిగే తంతు కనుక, అత్యంత ఘనంగా జరగాలని పట్టు పడుతున్నారు కూడా. ఆడపిల్లలు మరింతగా సంబరపడుతున్నారు, ప్రేమ సంగతి అటుంచి.

ఎటువంటి వ్యక్తిని చేసుకోవాలి అనే విషయంలో తమ అభిప్రాయాలనూ, అభిరుచులనూ తల్లిదండ్రులు అంగీకరించేటట్లు చేసుకోవడమే కాకుండా, తమ కోసం తల్లిదండ్రులు ఎంత ఖర్చయినా పెట్టాలి అనే ధోరణి పెరుగుతోంది. తల్లిదండ్రులపైన నిజంగా ప్రేమ ఉంటే ఆ విధంగా ఆలోచిస్తారా! అభ్యుదయకరంగా దండల పెళ్ళిళ్ళు చేసుకున్న తల్లిదండ్రులు కూడా తమ పిల్లలపైన ఖరీదైన ప్రేమ చూపించక తప్పడం లేదు. ప్రేమ వివాహాలు కూడా సంప్రదాయ పద్ధతిలో ఆర్భాటంగా జరుగుతున్నాయి. ఎంత ప్రేమించుకున్న వాళ్లయినా, వాళ్ళ పెళ్ళి ఆర్భాటం చూశాక, ఆ ఖర్చూ ఆ హడావిడీ జ్ఞాపకం పెట్టుకుని అయినా వాళ్ళు నాలుగు కాలాల పాటు తమ వివాహాన్ని నిలుపుకుంటే బావుండుననిపిస్తుంది.

పెద్దలు చూసి చేసిన పెళ్ళి అయినా, ప్రేమించుకుని చేసుకున్న పెళ్ళి అయినా, భార్యా భర్తలకు ఒకరిపై ఒకరికి సర్వ హక్కులూ ఉన్నాయనుకుంటే ప్రేమ మరుగున పడుతుంది. పెళ్ళి తంతు లేకుండా కలిసి సహ జీవనం చేసే వాళ్లకి కూడా ఈ సూత్రం వర్తిస్తుంది.

ప్రేమ ఒక బంధంలో ఇమిడేటంత సంకుచితం అయితే అది ప్రేమ కాకుండా పోతుంది- ఆ బంధం వివాహ బంధం అయినా, ప్రేమ బంధం అయినా, స్నేహ బంధం అయినా సరే. ఆధిపత్యం, సొంతం చేసుకునే తత్త్వం ఉన్న సంబంధంలో ప్రేమ నిలవడం కష్టం. ఒకరిమీద ఒకరు ఆధారపడటాన్నీ, ఒకరు లేకుండా మరొకరు ఉండలేక పోవడాన్నీ ప్రేమ అనుకుంటాం. కానీ ప్రేమ విశాలమైనది. బంధాలకు అతీతమైనది.

– అబ్బూరి ఛాయాదేవి ✦

# టికెట్ అడిగితే

నేనొకసారి విజయవాడ పోవటానికి ఖమ్మంలో హౌరా ఎక్స్‌ప్రెస్ ఎక్కాను. సీట్లు లేక నేను, ఇంకా ముగ్గురం నిల్చునే ఉన్నాం. మా కారేజీలోకి టి.సి. ఎక్కాడు. మా నలుగురి టిక్కెట్లు చూచాక బెర్త్ మీద ఉన్న ఒక వ్యక్తిని లేపుతూ టికెట్ అడిగాడు. ఆ వ్యక్తి తృళ్ళి పడి లేచి 'టికెట్ కావాలా?' అంటూ కాలి బూటు విప్పటం మొదలెట్టాడు. టికెట్ కలెక్టర్ హడలెత్తిపోయి 'సారీ మిస్టర్ పడుకోండి' అంటూ వెళ్ళిపోయాడు.

'పెద్ద మనుషులంటే ఇలాగే ఉంటారు. టికెట్ అడగటానికి వచ్చిన టి.సి.నే బూటు విప్పి తన్నటానికి తయారయ్యాడు. రోజులు మారాయి నాయనా' అంటూ లెక్చర్ దంచాడు మాలో ఒక పెద్ద మనిషి.

విజయవాడ స్టేషన్‌లో ట్రైన్ ఆగింది. అంతకు ముందు మా క్యారేజీలోకి వచ్చి వెళ్ళిన టి.సి. హడావిడిగా ముగ్గురు కానిస్టేబుల్స్‌తో మళ్లీ మా కారేజీలోకి ఎక్కాడు.

ఆ వ్యక్తి వద్దకు వెళ్ళి 'ఏయ్ మిస్టర్! దయ చేసి టికెట్ చూపిస్తారా?' అంటూ అడిగాడు.

ఆ వ్యక్తి మళ్లీ లేచి బూటు విప్పటం మొదలెట్టాడు. దాంతో టి.సి., ముగ్గురు కానిస్టేబుల్స్ నాలుగడుగులు వెనక్కి వేశారు. కాసేపటికి కుడికాలు సాక్సులో నుండి టికెట్‌ను బయటికి తీశాడు ఆ వ్యక్తి. టి.సి. కానిస్టేబుల్స్‌తో సహా అందరి ముఖాలు తెల్లగా మారాయి.

మేం అతడి దగ్గరకు వెళ్ళి సంగతంతా చెప్పి "వాళ్ళని హడలగొట్టేశావు కదయ్యా" అన్నాం. అతడు మా వంక వింతగా చూస్తూ "టికెట్ పోకుండా ఉండాలని సాక్సులో పెట్టుకున్నాను గాని, వాళ్ళను నేనెందుకు తంతానండీ!" అన్నాడు నింపాదిగా. ✦



బద్దిగం పాండురంగారెడ్డి

నాటి చతుర



ఫ్లాష్‌బ్యాక్

# దిగిరండి...దిగిరండి ధృతరాష్ట్రభువికి

— ఎన్.ఆర్.నంది

నాటి నవల

జనవరి 1979: సంపుటి: 1 సంచిక: 12

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం జనవరి నెల **చతురలో** ప్రచురించిన **'దిగిరండి... దిగిరండి ధృతరాష్ట్రభువికి'** నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

సమాజంలో అడుగడుగునా వేళ్ళూనుకుని వ్యాపించిన అవకతవకలను అక్షర రూపం కల్పించారు ఈ నవలలో రచయిత. కర్కశ కరాళనృత్యం చేస్తున్న వ్యభిచారం, లంచగొండితనం, అవినీతి, స్వార్థం, ఈర్ష్య, అసూయ, ద్వేషం, పోలీసుల జులుం, రాజకీయ నాయకుల దిగజారుడుతనం, గత్యంతరం లేక వృత్తిలోకి దిగిన వేశ్యల దీనహీన పరిస్థితులు, వేశ్యా గృహాలు నిర్వహించే బ్రోకర్ల నిర్దాక్షిణ్య మనస్తత్వాలు, పేదవారిని పీల్చి పిప్పిచేస్తున్న అధికారులు తదితర అనేక అంశాలను, సమస్యలను వివరిస్తూ సాగిన ఈ నవల మానవతా వాదులను ఆలోచింప చేస్తుంది. హృదయాలను కదిలించి కరిగిస్తుంది. పరిష్కార మార్గాన్ని అన్వేషించేటందుకు పురి కొల్పుతుంది. మీ కర్తవ్యమిదీ అని సమాజవాదులను హెచ్చరిస్తుంది.

**ఇక నవలలోకి వెళ్తే:**

నడివయసులో ఉన్న కథానాయకుడు గురువులు అనే రిక్షావాడి రిక్షా ఎక్కుతాడు. "ఏం తోచటం లేదు ఎక్కడికైనా తీసుకువెళ్తావా? " అని అడిగే సరికి "పదండి" అంటూ బయలుదేరుతాడు రిక్షావాలా గురువులు. కథా నాయకుడు యథాలాపంగా ఒక ప్రశ్న అడిగితే పది జవాబులు చెబుతుంటాడు. ఆ ఊళ్ళో జరుగుతున్న వేశ్యా వ్యాపారం, వేశ్యల రోగాలూ, వాళ్ళ దగ్గరికి గుమాస్తాలు, బడి పంతుళ్ళు, ప్లీడర్లు, పోలీసులు తదితర వర్గాల వాళ్ళంతా వెళ్తారనీ, సంసారులు సైతం వేశ్యావృత్తి వైపు మొగ్గు చూపుతుంటారని ఉదాహరణలతో సహా వివరిస్తాడు. "ఇలాంటి వెధవ పన్లు జరక్కుండా చూడండ్రా అని వీళ్ళని ఉద్యోగాల్లో పెడితే ఈ అధికారులు, మంత్రులూ గడ్డి తింటుంటారు" అని మంత్రుల అరాజకీయాన్ని ఎండగడతాడు. ఆ ఊళ్ళో జరిగే బ్రాకెట్టా

టలకు తను కూడా రోజూ డబ్బు కడతాననీ, బ్రాకెట్ వ్యాపారం చేసే వాళ్ళు మేడలు కట్టుకుని, కార్లు కొన్నారనీ, హోటళ్ళు నడుపుతున్నారని చెబుతాడు గురువులు. తన చెల్లెల్ని పెళ్ళి చేసుకుంటానని నమ్మించి ఓ వ్యక్తి మహా నగరానికి తీసుకెళ్ళి వేశ్యా గృహంలో అమ్మేశాడని చెబుతాడు. చెల్లెలు ఉత్తరం రాయగా ఆమెను తీసుకు రావాలని వెళ్లాననీ, ఆమె చెరపట్టిన వాళ్లు తనను కొట్టి వెళ్ళ గొడితే ఆమె ఆత్మహత్య చేసుకుందనీ, తను తన చెల్లెల్ని లేవదీసుకుపోయిన వాడిని చంపేశాననీ, జైల్లో ఐదేళ్ళు గడిపి వచ్చాననీ చెబుతాడు. "మాకు ఇళ్ళు లేవు - నిలువ నీడలేదు కుళ్ళిన కాలువలూ, దోమలూ, దొడ్లు, కుక్కలు, గాడిదలు పందులు మా చుట్టూ మాతో కలిసి మెలిసి బతుకుతాయి. బాగా డబ్బున్న ఓ రాజకీయ నాయకుడు వెంకటేశులు తన ప్రత్యర్థికి ఓట్లేయక తనకే ఓటేయమని అర్థించాడు. తనకు ఓట్లేసి గెలిపిస్తే ఈ పూరిపాకలు తీయించి చక్కని మేడలు కట్టిస్తానన్నాడు. కుళ్ళు కాలువలు తీసేయిస్తానన్నాడు. రిక్షాలు, పనులు ఇప్పిస్తాను అని వాగ్దానం చేయటమే గాక "సోదరీ సోదరీ మణులారా" అని మమ్మల్ని పిలిచి మమ్మల్ని తన తోబుట్టువులుగా భావించటంతో సంతోషించి చప్పట్లు కొట్టాం. ఆయనకే ఓటేయాలనుకున్నాం. కానీ మర్నాడు ఆయన ప్రత్యర్థి రాంబాబు గూడెంలో ఓ సినిమా వేసి మమ్మల్ని ఆకర్షించి, మధ్యలో సినిమా ఆపి తన ఉపన్యాసం మొదలుపెట్టాడు. వెంకటేశు ఇచ్చిన వాగ్దానాలు అమలు జరిగేవి కావనీ తననే గెలిపించమనీ, తను మీకు అనేక ఉపకారాలు చేస్తాననీ చెప్పాడు "చివరికి రాంబాబే గెలిచాడు గానీ ఆయనకు మంత్రి పదవి రానందున మాకేమీ మేలు చేయలేకపోతున్నాడు" అని ముక్తాయింపు నిచ్చాడు గురువులు.

అలా కబుర్లు చెబుతూ కథా నాయకుణ్ణి ఓ వెంకటింట్లోకి తీసుకువెళ్తాడు. వేశ్యా గృహం నడిపే స్త్రీకి డబ్బు చెల్లించి 'సీత' అనే ఆవిడ వెంట గదిలోకి నడుస్తాడు కథనాయకుడు. ఆమె ఈ ఊబిలోకి ఎలా దిగబడిందీ, ఎందుకు తప్పించుకోలేక పోతోందీ, ఆమె మనస్తత్వం, వివరాలు, చదువు సంధ్యలు, ఉండే వీధి వగైరా అన్ని వివరాలూ అడుగుతాడు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ప్రఖ్యాత దేశభక్తుడైన రామలింగేశ్వర శాస్త్రి గారి కూతురు ఆమె అని తెలుసుకుంటాడు. యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా, హైకోర్టులో



అడ్వొకేట్‌గా పనిచేయడమే గాక బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన సింహ స్వరూపుడైన దేశభక్తుడి సంతానానికి ఈ గతి పట్టిన, పట్టించిన పూర్వాపరాలు తెలుసుకుంటాడు. తను ఎం.ఏ. చదివినా గత్యంతరం లేక కుటుంబ పోషణ కోసం ఈ వృత్తి నెంచుకున్నాననీ శని, ఆది వారాలు ఇలా వచ్చి డబ్బు సంపాదించి తిరిగి విశాఖ వెళ్ళి తన వాళ్లను బతికించుకుంటున్నానని చెబుతుంది సీత. తన అసలు పేరు సులోచన అనీ, తన అన్న గుండెల మీద కుర్చీ కోడు పెట్టి నలుగురు పోలీసులు ఎక్కి తొక్కి చంపేశారనీ, అగ్ర వర్ణంలో పుట్టినందున ఉద్యోగమూ దొరకటం లేదని ఏడ్చేస్తుంది. బ్రాహ్మణులు ఫస్టు క్లాసులో పాసైనా, బంగారు పథకాలు పొందినా గుమాస్తా ఉద్యోగాలైనా దొరకక వెనుకబడి పోతున్నా

మని వాపోతుంది. జ్ఞానానికి విలువ లేని దేశం ప్రపంచంలో ప్రస్తుతం మన దేశమే నేమో అని కథా నాయకుడు బాధ పడతాడు.

తరువాత ఆ ఇంటినుండి బయట పడి మరో వేశ్య ఇంటికి వెళ్తాడు. కాళ్లు లేని అవి టిదే అయినా పొట్ట పోసుకునేందుకు ఈ వృత్తి తప్ప మరో మార్గం కనిపించ లేదని చెబుతుంది ఆ వేశ్య. ఆమె సాధక బాధకాలు తెలుసుకుని బాధాతప్త హృదయంతో, ఆలోచ నలతో తను విడిది చేసిన హోటల్ కొస్తాడు కథా నాయకుడు.

ఆయన వల్ల సహాయం పొందిన ఓ శ్రీమంతుడు ఈయనను గుర్తించి పలక రించి, తన గదిలోకి ఆహ్వానిస్తాడు. వీళ్ళు వెళ్లేసరికి ఆ గదిలో ఇద్దరు మగాళ్ళు, ముగ్గురు అందగత్తెలు దాదాపు దిగంబ రంగా కనిపిస్తారు. వాళ్లంతా తాగిన మైకంలో ఉన్నారు. ఒకామె ప్రముఖ సంఘ సేవిక. మరొకామె కోటీశ్వరుడి కూతురు. ఇంకొకామె పాశ్చాత్య వనిత. పురుషులలో ఒకరు పోలీస్ ఆఫీసర్, మరొకాయన రాష్ట్ర అత్యున్నత అధికారి, మూడో ఆయన కోటీ శ్వరుడు. ప్రొజెక్టర్‌లో బ్లూ ఫిలిం చూస్తూ విచ్చలవిడి శృంగారం జరుపుతుంటారు.

ఇక అక్కడ ఉండలేక బయల్దేరబోతున్న కథా నాయకుడు రింగవుతున్న ఫోను రిసీవర్ ఎత్తుతాడు. తను సుశీలా బాయిననీ, రాంబా బును పిలవమనీ అంటుంది- ఫోనులో మా ట్లాడుతున్న స్త్రీ. దానికి జవాబిచ్చిన కథానాయ కుని సంస్కృత భాషలోని వాక్యం ఆమెను ఆకర్షించి అతడిని తన ఇంటికి రమ్మని వేడు కుంటుంది. కథానాయకుడు సుశీలాబాయి ఇంటికి వెళ్తాడు. అప్పుడే రాంబాబు ఫోను చేసి తను సుశీలాబాయి ఇంటికి వస్తున్నానని చెబుతాడు. ఇప్పుడే రావద్దనీ, తను చాలానా ళ్లకు ఓ పండితునితో సంభాషిస్తున్నాననీ చెబుతుంది సుశీలాబాయి. ఆగ్రహించిన రాం బాబు ఆమె ఇంటి వీధి చివర్న పోలీసులను నిలబెట్టి కథానాయకుడిని అరెస్టు చేయి స్తాడు. పోలీసులు స్టేషన్‌లో కథానాయకు డిని చితకబాదుతారు. రాత్రంతా సెల్లోనే ఉంచుతారు. అతని దగ్గరున్న డబ్బు లాక్కుం టారు. చిత్ర హింసలు పెడుతుంటారు.

మర్నాడు ఉదయం రాంబాబు కథానాయ కుడిని చూడాలని పోలీస్ స్టేషన్‌కు వెళ్తాడు. ఊచల వెనుక నిలబడిన కథానాయకుడిని చూడగానే పిచ్చిగా అరుస్తూ "మహాప్రభో మన్నించండి. మహాదేవా మన్నించండి" అని ఉన్న చోటునుండే ఆయనకు సాష్టాంగపడి కాళ్లకు మొక్కసాగాడు.

ఆశ్చర్యంగా చూస్తున్న ఎస్సై "వారెవరు రాంబాబూ" అని అడుగుతాడు. "మీ మొగు డు. మన మొగుడు. మనందరి మొగుడు. కొంపలు ముంచేశారు గదరా" అంటూ తల బాదుకుని శోకాలు పెట్టాడు రాంబాబు.

"ఓ గాడ్! దిగిరా! దిగిరా! ధృతరాష్ట్ర భువికి దిగిరా! నాకు శక్తినివ్వు" అని దేవుడిని తలచుకుని ఏడుస్తాడు కథానాయకుడు. పాల రాతి పాలక భవనంలో కూర్చుని గాకుండా తన హోదా, అంతస్తు మరిచి ఆలోచించసా గాడు కథానాయకుడు. దేశంలో మానవ రక్త మాంసాలతో నడుపబడుతున్న భారీ పరి శ్రమ, కాటేజ్ ఇండస్ట్రీల గురించి ఆలోచిం చాడు. మాటల సందర్భంలో సులోచన మర ణం గురించి వింటాడు. ఆమె కోసం ఏం చేయాలా అని ఆలోచించసాగాడు. తను కమి షన్ వేసినా ఆమె తిరిగిరాని లోకాలకు వెళ్లిన విషయం అతనికి తెలిసిపోయింది మరి!

కథానాయకుడు ఎవరైనదీ చివరి వరకూ చెప్పకుండా సస్పెన్సుతో కథ నడిపారు రచ యిత. కొన్ని చోట్ల సంభాషణలలో, ఇతర వాక్యాలలోనూ చమత్కారం తొంగి చూస్తుం ది. నవలలో ఉపమానాలు పరుగులుతీశాయి.

ఉదాహరణకు, "వీధిలో ఎలక్ట్రిక్ దీపాలు ఓనమాలు రాని పార్టీ సభ్యుల్లా వెలవెలబోతు న్నాయి. అవి దేశ నాయకుడి వాగ్దానాల్లాగ దేదీప్యమానంగా వెలగటం లేదు.

అసెంబ్లీలో మాట్లాడలేని పిరికివారిలా నీరుగారి పోతున్నాయి" వంటివి చాలా ఉన్నాయి. ✦

నవంబరు 2005 'చతుర' నవల



# సంగమం

## పై సమీక్షలు



### మానవత్వానికి మచ్చుతునక

(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

మానవుడు వైజ్ఞానికంగా ఎంత ఎదిగినా ప్రకృతి ముందు మరుగుజ్జేనన్న సత్యం తిరుగులేనిది. ప్రకృతి ప్రదర్శించే బీభత్సాన్ని పూర్తిగా అరికట్టడం సాధ్యం కాకపోయినా వాటి మూలంగా మానవాళికి కలిగే కష్టనష్టాలను కొంత వరకైనా మిటిగేట్ చేయడానికి కృషి చేయాలి. అందుకు ప్రతి వ్యక్తీ మానవతా దృక్పథంతో తన వంతు సహకారాన్ని అందించాలనే సందేశంతో సాగిన 'సంగమం' నవల హృద్యంగా వుంది.

మూర్తీభవించిన మానవతావాది శంకరం మాస్టారు. వయసు పైబడుతున్నా పరోపకారానికి ముందుకు ఉరికే ఆదర్శప్రాయుడు. మంచి గురువులు కరువవుతున్న నేటి కాలంలో కిశోర్ వంటి గాడి తప్పిన విద్యార్థులను సున్నిత పద్ధతిలో సంస్కరించి ప్రయోజకుల్ని చేసినా, స్వంత ఇబ్బందులను సైతం లెక్కచేయకుండా అనాథయైన పసిబిడ్డకు నూతన జీవితం ప్రసాదించినా ఆయనకే తగును. కిశోర్ సైతం మాస్టారి హితవును పెడచెవిని పెట్టకుండా వృద్ధిలోకి రావడం, దేశ రక్షణే ధ్యేయంగా సైన్యంలో చేరడం ముదావహం. సత్ప్రవర్తన, పరోపకారబుద్ధి అతను మాస్టారికి సమర్పించుకున్న 'గురుదక్షిణ' అని చెప్పవచ్చును. ఆర్మీ వాళ్లపైన రంగారావు వెలిబుచ్చిన అపోహలను రవివర్మ తిప్పికొట్టిన తీరు బావుంది.

చావు పుట్టుకలు సహజమనుకుంటే, ఎటువంటి బాధనైనా కాలమే మందు అని చెప్పవచ్చును. ఆ సత్యాన్ని గుర్తించి, విధి తీసిన దెబ్బలకు కుంగిపోకుండా ఆత్మవిశ్వాసంతో, మనోస్థయిర్యంతో ముందుకు సాగడం జీవన హేలకు ఎంతైనా అవసరం. అది గ్రహించిన ఉష, కిశోర్ ఇచ్చిన చేయూతతో నూతన జీవితంలోని ఉషస్సులను వెదుక్కుంటూ పయనం కావించడం సముచితంగా ఉంది. స్ఫూర్తి దాయకంగా, సరళంగా సాగిన ఈ నవల ఆద్యంతం ఆసక్తితో చదివిస్తుంది. మానవత్వానికి మచ్చుతునకలా నిలుస్తుంది. అయితే, సహజంగా సాగే ప్రయోజనాత్మక నవలలో ఉషను శంకరం మాస్టారి మిత్రుడు భాస్కరరావు కోడలిగా చిత్రీకరించడం కొంత సినిమాటిక్‌గా ఉంది.

–పి.వి.వి. సత్యనారాయణ, సికింద్రాబాద్

---

### ప్రేమ, ఆప్యాయత, మానవత్వాల సంగమం

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

మమకారం, నిరాడంబరత్వం, నిస్వార్థం కలగలిసిన జీవే 'మనిషి' అవుతాడు. జీవితం మన కోసం కాదు. మరొకరి కోసం త్యాగం చేసినప్పుడే బ్రతుక్కి ఓ సార్థకత.

ఏమెరుగని ప్రాణులు సైతం పరులకోసం జీవితాన్ని అంకితం చేస్తే. వివేకం, విజ్ఞానం, తెలివి కలిగిన మానవుడు తోటివారికి అపకారం తలపెట్టకుండా ప్రేమ, మమతానురాగాలతో మానవత్వాన్ని జోడించి సాధ్యమైనంత మేరకు తోటి వారిని ఆపదలో ఆదుకోవాలనే నీతి సూత్రానికి నిదర్శనమే ఈ 'సంగమం' చతుర నవల.

శంకరం మాష్టారు తన ఉపాధ్యాయ వృత్తి ధర్మాన్ని తూ.చ. తప్పకుండా పాటిస్తూ కిశోర్ లాంటి విద్యార్థిని చెడుదారుల్లో నుండి మంచి మార్గానికి మళ్ళించి దేశసేవ చేసే మిలిటరీ ఉద్యోగంలో చేరేలా చేయడం, తన గురువుగారి ఆశయాలకి అనుగుణంగా తానూ పరుల సేవలో తన జీవితాన్ని కిశోర్ త్యాగం చేయడం నిజంగా మానవత్వానికి ప్రతిరూపంగా నిలిచిందీ నవల. ప్రతి పాత్ర మంచితనానికి మారుపేరై చదివేకొద్దీ మనసును ద్రవింపజేసింది. విద్యార్థి దశలోనే గురువులు పిల్లలకి సత్ప్రవర్తన అలవాటు చేయాలి. దుర్వ్యసనాలకి బానిసైన బాలురు దేశానికే కీడు తలపెట్టే పౌరులౌతారనే సందేశాన్ని శంకరం మాష్టారు, కిశోర్‌ల సన్నివేశం ద్వారా చాలా బాగా తెలియజేశారు రచయిత్రి.

ప్రకృతి బీభత్సానికి, విధి ఆడే నాటకానికి బలైపోయిన వారిని ఆదుకోడానికి శక్తివంచన లేకుండా సహాయం చేద్దామనే తలంపుతో, శంకరం మాష్టారు 'భుజ్' పట్టణానికి వెళ్లడం, ఆ తర్వాతి సంఘటనలతో కథనం నడిపిన తీరు, పాత్రల సత్ప్రవర్తన రచయిత్రి సత్తాని తెలియజేశాయి. సునామీ బీభత్సం, భయానక భూకంపం సృష్టించిన అల్లకల్లోలాన్ని, బలైపోయిన విగతజీవుల ఆర్తనాదాల్ని మరికాస్త వివరంగా తెలియపరిచి ఉంటే నవల మరికొంత రక్తికట్టేదేమో అనిపించింది. రక్తసంబంధాల్లోనే కాదు మానవత్వపు కలయికల్లో కూడా ప్రేమానురాగాలు, గౌరవ మర్యాదలు ఉంటాయనీ, అలా జీవితాన్ని మలచుకొని నడుచుకొన్ననాడే మానవుడు మాధవుడౌతాడనే అపూర్వ సందేశాన్ని అందించిందీ నవల.

– ఏ.ఏ., హైదరాబాద్.

---

# పురుషుడిలో మాతృత్వపు మమకారం

**(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

సందేశం, ఔచిత్యం, ఉన్న తెలుగు కథ సంగమం! మానవత్వం అనే పదానికి అసలైన భాష్యం చెప్పారు రచయిత్రి సి. జయా బాలకృష్ణ. మాతృత్వపు మమకారాన్ని మగవాడిలో చూపించటం మాటలు కాదు. రచయిత్రి అది సాధించారు. భుజ్‌లో వాస్తవంగా జరిగిన భూకంపం ఆధారంగా కల్పించిన కథ కనుక నవలలో సహజత్వం వచ్చింది. సన్నివేశ కల్పనం, పాత్ర చిత్రణ, దేశకాల నిర్దేశనం సమంజసంగా ఉంది. సంభాషణలు సరళమైన తెలుగులో భాషా కాలుష్యం లేకుండా ఉన్నాయి.

"ఆచార్య దేవోభవ" అనే సూక్తికి శంకరం మాష్టారు చక్కని ఉదాహరణ. 'ఆత్మ బుద్ధి సుఖశ్చైవ గురుబుద్ధిర్విశేషితః' అనే సూక్తిని ఆచరణలో పెట్టిన ఆదర్శ యువకుడు ఆదర్శ శిష్యుడు, కిశోర్! ఆరోగ్యప్రదమైన గ్రామీణ వాతావరణాన్నీ, ప్రకృతి శోభనీ, అక్కడి ప్రజల ఆత్మీయతనీ, కళ్లకు కట్టినట్లు చిత్రించారు రచయిత్రి. అనాథ యువతి ఉషని, ఆదర్శ యువకుడు కిశోర్‌ని, భార్యాభర్తలుగా చేసి కథ ముగించటం బాగుంది. సంఘసేవని, దేశభక్తిని ప్రతిబింబించిన సందేశాత్మక నవల సంగమం!

–పొరుపల్లి వెంకటేశ్వరరావు, హైదరాబాద్.

## ఉదాత్త చిత్రీకరణ (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

నవంబర 'చతుర' నవల సి. జయాబాల కృష్ణగారి సంగమం మనవతా విలువలకు అద్దం పట్టింది. ప్రధానంగా శంకరం మాష్టారి పాత్రను ఎంతో ఉదాత్తంగా చిత్రీకరించారు. వేలల్లో ఒకరుగా, నేటి కాలానికైతే లక్షల్లో ఒకరుగా అరుదుగా కన్పిస్తారు అలాంటి వ్యక్తులు. 'భుజ్' భూకంప బాధితులు పట్ల ఆయనపడిన ఆవేదన... వారిని ఆదుకోవాలని ఆయన పడిన తాపత్రయం ఆయన వ్యక్తిత్వాన్ని ఉన్నత స్థాయిలో నిలిపింది. విద్యార్థుల పట్ల ఆయన చూపిన శ్రద్ధ, ఆదరణ... వారిని ఉన్నతులుగా తీర్చిదిద్దాలన్న ఆయన ఆశయం బహుధా ప్రశంసనీయం. ప్రకృతి బీభత్సంతో విలవిలలాడుతున్న వారికి తన వంతు సహాయం అందించడానికి సిద్ధపడిన శంకరం మాష్టారిని... శిథిలాల్లో చిక్కుకొని కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్న పసికందుని రక్షించి, తను పెంచుకోవడానికి సిద్ధపడిన సంఘటన ఆయనను హిమాలయ శిఖరాలంత ఎత్తున నిలబెట్టింది. కిషోర్ ఆయన చేతులతో పెంచిన పూల మొక్క. దేశ రక్షణ కోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించే సైనిక వృత్తిలో నిలబడి... అనుక్షణం తన జీవన గమనానికి పథ నిర్దేశం చేసిన మహానుభావుణ్ని గుర్తు చేసుకుంటూ మానవతకు మరో పేరుగా నిలిచిన మరో పాత్ర కిషోర్‌ది.

'చనిపోవడానికి కన్నా బ్రతకడానికి ధైర్యం కావాలి' అన్న కిషోర్ మాటలు అద్భుతం. జీవితమంటే తను బ్రతకడమే కాదు మరొకరి కోసం బ్రతకాలి. మరికొందరికి బ్రతుకునియ్యాలి అన్న సూత్రంతో సాగిన గురుశిష్యులు ఇద్దరూ యిద్దరే!

– ఎస్. జ్యోతి, తణుకు

---

## సినిమా ఫక్కీలో...

(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

"సంగమం" నవలలో కొత్త యితివృత్తం ఉంది. సామాజిక స్పృహతో మానవ స్వభావాన్ని ఆవిష్కరించే ప్రయత్నం జరిగింది.

రిటైర్ అయిన వృద్ధుల జీవితాన్ని దీనంగా, హీనంగా చూపుతూ అందుకు కారణంగా కొడుకుల్ని కోడళ్లనూ హృదయం లేని వారిగా చిత్రీకరించడం చూస్తున్నాం. కాని ఇందులో రిటైర్ అయిన ఉత్తమ ఉపాధ్యాయుడు శంకరంలో మానవత్వం, మంచితనం హైడోస్‌లో కనిపిస్తాయి. కథ నిండా మానవ విలువలు పట్టించినా, శంకరం హృదయ వైశాల్యాన్ని నిరూపించడానికి కల్పించిన కొన్ని సన్నివేశాలు అసహజంగా ఉన్నాయి. రచనా సంవిధానం కూడా ఆకట్టుకునేదిగా లేదు.

చెప్పిందే పలుమార్లు చెప్పడం విసిగిస్తుంది. శ్రీదేవి లాంటి అనవసర పాత్రలూ కనిపిస్తాయి. ముగింపు సినిమా ఫక్కీలో అసహజంగా ఉన్నా మానవ విలువలతో బాగానే ఉంది అనిపించే నవల.

–శుభలక్ష్మి పట్నాయక్, కాకినాడ.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikâkulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www. eenadu .net

## నీటి మీద నడక



ఈ తొండగారి విన్యాసం చూశారా ఎంత కనుపసందుగా ఉందో. నీటిలో మునగకుండా దర్జాగా గంటకు 12 కిలోమీటర్ల వేగంతో నడిచిపోగలుగుతుంది ఈ తొండ. అందుకు అనువుగా దీని పాదాలు రూపొందించబడ్డాయి. శత్రుజంతువులకు ఆహారం కాకుండా తప్పించుకోవడానికి ఈ విన్యాసం ప్రదర్శించే తొండ ఆ బెడద తప్పిపోగానే బుడుగున నీటిలో మునిగి రెండు నిమిషాలు అలాగే ఉండి ఆ తర్వాత పైకి తేలుతుంది. దీనిని జీసస్‌క్రైస్ట్ లిజర్డ్ అని కూడా వ్యవహరిస్తారు.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78


# ప్రియ రైస్‌రిచ్‌తో

అవధులు లేని

## ఉల్లాసం, ఉత్సాహం...









Healthy Cooking Oil

Also Available

రైస్‌బ్రాన్ ఆయిల్ • గ్రౌండ్‌నట్ ఆయిల్

సన్‌ఫ్లవర్ ఆయిల్ • పామోలిన్ ఆయిల్

నువ్వుల నూనె • ప్రీతం కొబ్బరి నూనె



www.priyafoods.com

USHODAYA ENTERPRISES LIMITED (Priya Foods Division) D.No: 3-9-907/2, 1st Floor, Mahaveerlok Complex, Himayathnagar, Hyd- 29 Tel No.: + 91 40 23220446, 23220421 Fax. 91 40 23220487